చదువుల్లో మొనగాడు
ఆటల్లో మొనగాడు
పెరిగి పెద్దవాడౌతున్నాడు

## అతడి సైకిలు ఫిలిప్స్

ఫిలిప్స్ దిట్టంగా ఉంటుంది ఎంత చెడ తొక్కినా తట్టుకొనేటట్టు మంచి ట్రూ టెంపరు స్టీలుతో తయారైంది దాని అంద చందాలు గంభీరత కూడా మీ సంస్కృతిని బాగా తెలియజేస్తాయి మీవంటి యువకులకు తయారుచేయబడిన విశిష్టమైన బైసికిలు

ఫిలిప్స్ మీరు వాడదగిన సైకిల్







®
ఇ. ఎ. ఫిలిప్స్ కంపెనీ లిమిటెడ్ యు కె వారి రిజిస్టర్డ్ ట్రేడ్ మార్కులు ఇండియాలో తయారుచేయువారు టిఐ సైకిల్స్ ఆఫ్ ఇండియా అంబత్తూరు మద్రాసు 53 ప్రొప్రైటర్లు ట్యూబ్ ఇన్వెస్టిమెంట్స్ ఆఫ్ ఇండియా లిమిటెడ్ మద్రాసు 1 ఉపయోగించుటకు రిజిస్టరు కావింపబడినవి

tic p 3819a

# ® ఫిలిప్స్

# తప్పక చూడండి



యస్. రంగారావు సమర్పించు శ్రీదేవి కంబైన్స్

# చుట్టరికాలు

దర్శకత్వం. పేకేటి శివరామ్, B.A., నిర్మాత తోట సుబ్బారావు

ఆంధ్ర: జోతీ . సీడెడ్ నవభారత్ . నైజాం దివ్యదత్తా

JOTHEE STUDIO

## ముఖచిత్రం

ఈవారం 21-6-68 సంచికపై ముఖచిత్రం అక్కినేని నాగేశ్వరరావు చిత్రం చాలా ఆకర్షణీయంగాయున్నది. తాళ్లూరి నాగేశ్వరరావు గారు వ్రాసిన కథ 'నారయ్య నిరాహారదీక్ష' అనే కథ కూడా చాల్లా బాగున్నది. అకథ చదివినంతసేపు తెగ నవ్వువచ్చింది.

పి. లక్ష్మణరావు, (విజయరాయి)

* * *

ఈవారం పత్రిక "అక్కినేని నాగేశ్వరరావు" ముఖచిత్రంతో ఎంతో రమణీయంగా వుంది. "మొగలిపొదలు," "రాగమయి" సీరియల్స్ చాలా చాలా బాగున్నాయి.

హెచ్. రజినీకాంతరావు, (సీతాఫలమండి)

## కథలు

14-6-68 తేదీ సంచికలో మీరు ప్రచురించిన కథ "ఈ జన్మకిది చాలు" చాలాబాగుంది. ఈకథలోని ప్రతిపాత్ర ఎంతో సహజంగా వుండి సంఘంలోనివ్యక్తులను నిజంగా చూస్తున్నట్లేవుంది. రచయిత్రి ఎంతో అనుభవము కల్గినవారులా వున్నారు. శేఖర్, రేణుక, సరోజలాంటి వారు ప్రస్తుతం కోకొల్లలున్నారు. ఇహ సుబ్బారావు, దామోదరం, వేణుగోపాలరావు లాంటి కీచకులబాధ ఈ రోజుల్లో స్త్రీలకు పరిపాటి అయింది. ఇంతచక్కని పాత్రలతో వ్రాసినకథను వ్రాసినందుకు రచయిత్రికి, ప్రచురించినందుకు మీకూ నా హృదయపూర్వక ధన్యవాదములు అర్పిస్తూ, ఇకముందుకూడ ఇలాంటికథలు తరచూ ప్రచురించమని కోరుచున్నాను.

అంకరాజు అనూరాధ, (వికారాబాదు)

* * *

# ఉత్తరాలు

'డాక్టర్! డాక్టర్!!' అన్నకథ చాలా బాగుంది. మాధవరావు బదులు ప్రభాకర్ శిక్షకులి అవడం హృదయమును కదల్చివేసినది. కార్టూన్స్ చాలా బాగున్నాయి.

జోస్యుల శ్రీనివాసరావు, (తెనాలి)

## సీరియల్

21.6.68వ తేదీ ఆంధ్రసచిత్రవారపత్రిక 'రాగమయి' సీరియల్ 22వ పేజీలో రచయిత్రి "కృష్ణమోహన్ తొమ్మిదవ తరగతిలో వుండగా హైదరాబాద్‌కు ట్రాన్స్‌ఫర్ వచ్చి వెళ్లినట్లూ, యస్. యస్. ఎల్. సి.లో వుండలో దృష్టి పోయినట్లు" వ్రాశారు. హైదరాబాదులో యస్. యస్. ఎల్. సి. వుండదన్న విషయాన్ని రచయిత్రి గమనించ ప్రార్థన.

మేకా రామచంద్రరావు, (సికింద్రాబాద్)

* * *

మీరు ప్రచురించిన 'చీకటికడుపున కాంతి', 'హృదయం చిగిర్చింది'. సీరియల్స్ చాలా రసవత్తరంగా సాగాయి. కాని 'హృదయం చిగిర్చింది'సీరియల్ కథ చాల చిన్నదిగా ఉంది. కాని నడచినంతవరకు మాత్రము చాల ఆహ్లాదకరంగా సాగింది. 'చీకటి కడుపున కాంతి' కూడా బాలబాగుంది.

కుమారివడ్డాది బాల త్రిపురసుందరి, వరహాలమ్మ (వ్యాఢిల్లీ)



# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 5-7-'68
కీలకనామ సం॥ జ్యేష్ఠ మాసం శుద్ద దశమి
సంపుటము : 60 సంచిక : 43

స్థాపితము :
1908

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీథి, మద్రాసు-1

పోస్టుద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 26.00 |
| 6 మాసముల చందా | 13.00 |
| 3 మాసముల చందా | 6.50 |

## విషయసూచిక

ముఖచిత్రం : 'పంతాలు [illegible]పులు'లో [illegible]

విఖ్యాతంగాను...విభిన్నంగాను వుండండి

# బిన్నీవారి హాలీడే & BD.636 షర్టింగులలో




* Registered user of the
• SANFORIZED •
Trade mark

అసలైన డిజైనులతో నేయబడ్డ బిన్నీవారి హాలీడే మరియు BD 636 లను వాడండి మీకవి విభిన్నమైన అదనపు సౌందర్యాన్నిస్తాయి సున్నితమైన నూలునుండి తయారైనవి. ముందు తడపబడినవి * మెర్సిరైజ్ కావించబడినవి తెలుపుచేసా లేక ఆకర్షవంతమైనవి విస్తృత వర్ణశ్రేణిలో లభిస్తాయి

## బిన్నీ-బట్టలకు పెట్టినది పేరు

CY-4605

# ప్రపంచ రాజకీయాలు-ప్రజానాయకులు

భారత ప్రధాని, లేక రాష్ట్రపతిగాని విదేశాలకి వెడితే అక్కడి ప్రముఖులతో సంయుక్త ప్రకటనలు చెయ్యటం ఒక ముఖ్యమయిన తంతు అయిపోయింది. మన దేశం నాయకులు కమ్యూనిస్టు రాజ్యాలకి వెళ్లినప్పుడు ఈ ప్రకటనలలో అభిప్రాయాలు పూర్తిగా ఏకీభవించటం జరుగుతుంది ; తక్కిన దేశాల విషయంలో ఈ రకం ఏకీభావం కనిపించదు.

మన రాష్ట్రపతి కొన్ని కమ్యూనిస్టు దేశాలని పర్యటించి వచ్చారు. వారి పర్యటన 'ఉపయోగకరంగా' ఉందిట. యుగోస్లావియాలో కో-ఆపరేటివ్ ఉద్యమం వారికి బాగా నచ్చినదని వార్తలు వెలువడ్డాయి. సాధారణంగా కొందరు మంత్రులు (స్టేట్ మంత్రులు ఉపమంత్రులు కూడా) విదేశాలకి ప్రజల కర్చుమీదవెళ్లి వేగంగా కారులో కొన్ని ప్రదేశాలని పర్యటించి ఏవో పరిశోధనలు జరిపినట్లు మాట్లాడుతారు.

శ్రీమతి గాంధీ తమ తండ్రిగారితో యూరప్, ఉత్తర అమెరికా, ఆసియాలని పర్యటించారు. నేడు తమంతట తామే ఇతరప్రాంతాలని చూస్తున్నారు. ఆస్ట్రేలియా, న్యూజిలాండులని చూశారు. సెప్టెంబరులో దక్షిణ అమెరికాకి వెడతారు. బండి నడుస్తూనే ఉంటుంది.

అంతర్జాతీయ కార్మిక సమావేశం పుణ్యమా అంటూ ప్రతివేసవి చల్లప్రాంతాలకి వెళ్లిపోగలరు సేర్జయ సుఖలాల్‌హాథీ. వారు ప్రపంచ కార్మిక సమస్యలని జెనీవాలో పరిష్కరిస్తున్నారు. ఆస్ట్రేలియాలో ఇప్పుడు చలికాలం (భూమధ్యరేఖ దక్షిణంగా ఉండటంచేత); అక్కడినుంచి రాగానే శ్రీమతి గాంధీ కాశ్మీరులోని జాతీయ సమయిక్యతా సమావేశం అధ్యక్షత వహించటానికి వెడుతున్నారు. వాణిజ్యమంత్రి మన ఎగుమతులు పెంచటానికి మాస్కో వెడుతున్నారు. వారి సహాధ్యాయి శ్రీ ఫ్రకుద్దీన్ అలీ అహమ్మద్ ఇప్పటికీ పశ్చిమజర్మనీ, కమ్యూనిస్టు దేశాలు (కొన్నిటిని) పూర్తి చేశారు.

ఈ యాత్రల కర్చులన్నిటినీ భరించేదెవరు? భారత పౌరుడు. వాటిప్రయోజనమేమిటో అడిగేహక్కు అతనికి ఉందా లేదా?

అసలు భారతదేశం లోపల మిగిలిన సమస్యల పరిష్కారం ముందా, విదేశాలలో సమస్యల పరిష్కారం ముందా ?

బాధ్యతా రహితమయిన నడవడి చాలా బాగుంటుంది — అలా ప్రవర్తించే వారికి, బాధ్యతలంటే ఇష్టంలేనివారికి. కేంద్ర కార్యదర్శి కార్యాలయంలో ' చివరి బాధ్యత ఇక్కడే' అనే ప్రకటన ఏ బల్లమీదా కనిపించే అవకాశంలేదు. ఏ ఒక వ్యక్తి అయినా ఒక పనిచేస్తే దాని ఫలితాలకి అతను బాధ్యతవహించే అవసరం లేకుండా ఉండే పరిస్థితులు సృష్టించే సంప్రదాయాలు బలపడుతున్నాయి. మంత్రులు, వారి పరివారజనం మాత్రం హడావుడి తగ్గించటం లేదు ; ఆలస్యంగా ఆఫీసులని వదలటం, భోజనాలు మానుకొనటం, సమావేశాలకి అట్టహాసంగా వెళ్లటం చూస్తూ ఉంటాము. ఇలా ప్రవర్తించేవారి ఆత్మవిశ్వాసం పెరుగుతుంది. ఏదయినా ఒక ప్రతిపాదన వెలువడిందంటే దానిని ప్రతిపాదించిన వారి వ్యక్తిత్వం ముఖ్యం కాని ప్రతిపాదనలోని మంచి చెడ్డలు చూడటం మానేశారు. శ్రీ అశోకమెహతా ఏదిచెప్పినా తప్పు, రాజా దినేష్‌సింగ్ ఏదిచెప్పినా ఒప్పు.

ఇంకొక రకమయిన బాధ్యతా రహిత ధోరణి, లక్ష్యాలు ఈ మాత్రం ఉండాలని నిర్ధారణ చేస్తారు. విధానాన్ని కూడా నిర్ధారణ చేస్తారు. ఎరువుల విధానాన్ని తీసుకోండి. రాబోయే మూడేళ్లలో ఉత్పత్తి తగినంతగా ఉండదని అంచనా. 1971-72 కి బాగా ఉత్పత్తి శక్తిని పెంచితేనే కాని ఈ కొరత చాలా ప్రమాదకర మయినదని నిపుణులు అంటున్నారు. దీనిమీద 300 కోట్ల రూపాయలు విదేశద్రవ్యం, 700 కోట్ల రూపాయలు ఇతర కర్చులు అవుతాయిట.

ఎరువులకీ ఆహార ధాన్యోత్పత్తికీ ఎంతో సంబంధం ఉందికదా ? 1971-73 కి కొత్త ఉత్పత్తి శక్తి సృష్టించకపోతే మొత్తం రు. 610 కోట్లదాకా దిగుమతులు చేసుకొనవలసి ఉంటుంది.

ఈ రకం దిగుమతులు చేసుకునే శక్తి ప్రభుత్వానికి లేదనవచ్చు. ఇక విదేశసంస్థల పెట్టుబడితో ఇక్కడ కర్మాగారాలు నిర్మింతటమే గత్యంతరం. ప్రభుత్వరంగంలో పెట్టుబడికి అమెరికాగాని, ప్రపంచ బాంకుగాని నప్పుకోరు. అంటే ప్రభుత్వం విధానాన్ని గాని, ఉత్పత్తి అంచనాలనిగాని మార్చాలి...

కాంబేవద్ద తీర ప్రాంతంలో పెట్రోలియం కోసం నూతులుతవ్వే సమస్యని తీసుకుందాము. అమెరికన్‌సంస్థ టెన్నెకో షరతులు దేశానికి లాభకరంగా లేవంటారు; మన విధానాన్ని నిర్మించే రష్యా దేశంవారు ఈ నూతులుతీసే సాంకేతిక విజ్ఞానం కాని, యంత్రం సామాగ్రికాని తమవద్ద లేదం

టున్నారు. అయితే. ఇతరులు ఈ కార్యక్రమం తీసుకొనటం వారికి ఇష్టంలేకనేమో నీటిలో నూనె నూతులు తవ్వటం లాభకరమయిన పనికాదని భారత ప్రభుత్వాన్ని నిరుత్సాహ పరుస్తున్నారు.

ఒక భారత ప్రభుత్వం మంత్రి అయిదు సంవత్సరాలలో తమదేశమే తగినంత సాంకేతిక జ్ఞానం సంపాదించు కొనగలదన్నారుట. ఈ అయిదు సంవత్సరాలలో దిగుమతుల ఖర్చు మాటేమిటి ? శ్రీమతి గాంధీ వీని సంగతి ఆలోచిస్తున్నారా ?

రెండు నెలలక్రితం ఈ ప్రశ్నని ఒక కమిటీ పరిశీలనకి వదలాలని కేంద్ర మంత్రివర్గం నిశ్చయించుకుంది. ఈ కమిటీ సభ్యులని ప్రధానమంత్రి నియమిస్తారని అన్నారు కమిటీనిర్మాణం చెయ్యకపోగా శ్రీమతి గాంధీ ఈ శాఖమంత్రి శ్రీ అశోకమెహతాతో అసలు ఈ విషయం గురించి సంప్రదించనేలేదుట ! ఎవరికీ ఈపని చెయ్యటానికి తీరిక లేకపోయినా హిందీలో వచ్చిన ఉత్తరాలకి హిందీలో సమాధానం చెప్పాలనే ఉత్తరువుమాత్రం ఇవ్వటం జరిగింది.

ప్రధానమంత్రి జూన్ 19 నాడు యాత్రమీద వెడ్తారు. తాతా ఎరువులు, షెవ్రాన్ కో రాతినూనె తవ్వకం ప్రాజక్టులని గురించి చర్చించాలని శ్రీ అశోకమెహతా ప్రధానమంత్రికి ఉత్తరం రాశారు. ఆయన లేఖకి సమాధానం ఇంకా రాలేదు.

'నానుడు విధానం' ఎంతగా బలపడిందో నిరూపించటానికి మరొక ఉదాహరణ ఇస్తాను. ఎన్నో తర్జన భర్జనలు జరిపి కొండరాష్ట్రాలకి కొంత స్వపరిపాలన ఇవ్వాలని నిశ్చయించటం జరిగింది. షిల్లాంగ్ లోని ప్రభుత్వం దానికి ఇష్టపడకపోవటంలో ఆశ్చర్యంలేదు. శాంతి భద్రతలు వారికి ఇచ్చివెయ్యక పోయినట్లయితే కొంత స్వపరిపాలనకి అంగీకరిస్తామని శ్రీ మొరార్జీదేశాయి అన్నారుట. అస్సామ్ మాజీ అర్థికమంత్రి శ్రీ ఫక్రూద్దీన్ ఆలీ అహమ్మద్ కూడా రాజీనామా ఇస్తామని బెదిరించారుట. ఇంతదాకా ఎంతమంది కాంగ్రెసుమంత్రులు రాజీనామా చేశారు ? శ్రీ అహమ్మద్ మాత్రం పదవిని వదులుకుంటారా ? మంత్రివర్గంలో ఆయన స్థానం చాలా ముఖ్యమయినది. ఒకటి, ఆయన పోర్టు ఫోలియో చాలా ముఖ్యమయినది; రెండు, ఆయనకి అస్సామ్ బాగా తెలుసునంటారు; మూడు, మంత్రివర్గంలోని, విశ్వాసపాత్రులయిన ముగ్గురిలో ఒకరు. కొండప్రాంతాల పథకాన్ని మళ్లీ వాయిదా వేశారు.

కేంద్ర మంత్రివర్గం బొగ్గుధరలని పెంచారు. రయిల్వేవారు చాలా బొగ్గు వాడ్తారు కాబట్టి కంట్రోలు అవసరం అంటారు. ఇక బొగ్గు పరిశ్రమవారు నష్టాలు వస్తున్నాయంటారు. రయిల్వే విద్యుచ్ఛక్తిశాఖలు బొగ్గు పరిశ్రమ ప్రతినిధులతో మంతనాలు జరపాలని ఒక సూచన. ●

# జాతికి జ్ఞానజ్యోతి మిస్ హెలెన్ కెల్లర్

**'బధిరాంధులు లోకంలో లెక్కలేనంత మంది వున్నారు. వీరంతా ఇలా చీకటి బ్రతుకులో నశించి పోవలసిందేనా?' అనుకున్నది మిస్ హెలెన్ కెల్లర్ ఒకానొక బాధా పూరిత సమయంలో.**

*'నాకు ప్రాణంతో సమానమైన మిత్రులున్నారు. చేతినిండా ఆనందదాయకమైన పనివుంది. ఇవే నా జీవితంలో సుఖ సంతోషాలకి కారణం. నాలో లేనితనాన్ని తలచుకోడానికి నే నెప్పుడూ ప్రయత్నించలేదు. అవి నన్నెప్పుడూ బాధించనూలేదు. ఒకోసారి తీరని వాంఛలు కలిగేవి. కాని, అవి క్షణికాలు మాత్రమే. పూలమీదుగా ప్రాకిన మందమారుతం లాంటివవి. గాలి తరలిపోతుంది, పూలు అలాగే స్థిరంగా నిలిచివుంటాయి.'*

మిస్ హెలెన్ కెల్లర్ పుట్టుకతోనే అంధురాలు. బధిరురాలు. ప్రకృతి తన కట్ల చూపిన నిర్దయ ఆమెలో ఒక కొత్త చైతన్యాన్ని రప్పించింది బధిరాంధులకి వారి జీవితంమీద విశ్వాసం జనింపజేయాలని, వారి బ్రతుక్కి ఒక ప్రయోజనాన్ని కూర్చాలనే పట్టుదల హెలెన్ కెల్లర్‌ని ఒక ఉద్యమ నాయకురాలిని చేసింది.

ఆమె అంధురాలయినా ప్రకృతిని చక్కగా అవగాహన చేసుకోగలిగింది. స్ఫుటమైన కళ్ళకి అందని అందాల లోతులు ఆమె కనుగొన్నది చెవులున్నా వినలేని రమణీయ ప్రకృతి సంగీతాన్ని ఆమె వినగలిగింది. చూపున్న వారెవరూ ఆమె వర్ణించినంతగా ప్రకృతిని వర్ణించలేక పోయారు. గులాబి మొగ్గ రాగ రంజితాన్ని, పసిపాప మను బుగ్గల లేతాంతుల్ని ఆమె మనో నేత్రంతో దర్శించగలిగింది వాటి సహజ వర్ణాన్ని మృదుత్వాన్ని ప్రజలకి విడమర్చి చెప్ప గలిగింది. దైవాంశ సంభూతురాలుగా ప్రతిభా విశేషాలని కనపరచిన మిస్ హెలెన్ కెల్లర్ మేధాసంపత్తి అపారం.

మిస్ హెలెన్ కెల్లర్ 1880 జూన్ 27వ తేదీన టస్కంబియాలో జన్మించింది సంవత్సరంన్నర పసిపాపగా వున్నప్పుడు ఆమెకి విషజ్వరం ఆవహించింది ఆమె నేత్రకాంతుల్ని ప్రపంచంలోని అంధులకి పంచి ఇవ్వడానికి, బధిరులకొక కొత్త జీవితాన్ని ప్రసాదించే ఉద్యమానికి శంఖారావం పూరించడానికి ఆమె శ్రవణ శక్తినీ గ్రహించివేసింది ఆ విషజ్వరం.

దాదాపు పసితనమంతా మూగబాధలోనే మ్రగ్గిపోయింది. మిస్ సలివాన్ అనే ఒక ఉపాధ్యాయిని ఆమెకి ఉత్సాహాన్ని ప్రసాదించింది. ఆమె అంధ జీవితంలో భానోదయమైన సమయం అదే మిస్ సలివాన్ శిక్షణ హెలెన్ కెల్లర్ జీవితంలో రంగు రంగుల కలలు ఆవిర్భవింప జేసింది ఆ కలలు బంగారు కలలుగా పండడానికికూడా సహాయపడింది

అంధ శిక్షణాలయంలో చదువనూ వ్రాయనూ నేర్చుకున్నది. అనతికాలంలోనే ఆనర్సు డిగ్రీ సంపాదించింది. బధిరాంధులకి, మూగవారికి సేవచేయాలనే కోరిక ఆమెని గొప్ప రచయిత్రిగా చేసింది. 'ఆత్మకథ', 'టీచర్', 'ది వరల్డ్ ఐ లివ్ ఇన్', 'ది సాంగ్ ఆఫ్ ది స్టోన్‌వాల్' మొదలైన ఆమె రచనలవల్ల ప్రజలు బధిరాంధులపై ప్రేమవాత్సల్యాల జల్లులను కురిపించారు సాటి మానవులుగా వారి బాధని అర్థం చేసుకున్నారు. సోదర మానవులుగా వారిని గుర్తించి సానుభూతి చూపించారు బధిరాంధుల జీవితాలలో ఒక కొత్త శక మారంభమైంది.

ఆమె నిరంతర కృషికి ఎన్నో గౌరవ పట్టాలు లభించాయి. బిరుదులు సన్మానాలకి లోటులేదు ప్రకృతిని ప్రతిఘటించిన వీరవనిత ఆమె ఉద్యమ నిర్వహణలో అపజయమన్నది ఎరుగదు. ఏ మానవుడూ సాధించలేనంతటి ఘనవిజయంతో— ఆమె నారీలోకానికి ఆదర్శమూర్తిగా, మానవతకి మంచి చిహ్నంగా నిలువగలిగింది.

కుంటి, గ్రుడ్డి, మూగవారి నిరర్థక జీవితాలను అర్థవంతం చేయడానికి 87 సంవత్సరాలూ అగణితమైన సేవచేసింది. జూన్ 1వ తేదీన హూస్టన్ (అమెరికా)లో ఆమె ప్రాణాలు అనంతవాయువుల్లో కలిసిపోయాయి.

మిస్ హెలెన్ కెల్లర్ అమరజీవి ఆమె కీర్తి చంద్రికలు ఆచంద్రతారార్కమూ నిలిచి — మానవజాతిలో అణగారిపోతున్న సానుభూతి సహకార గుణాలను మేల్కొల్పి వికలాంగులకి వెలుగు చూపిస్తుంది!

— సి. కనకాంబరరాజు



భారతదేశానికి వచ్చినప్పుడు జవహర్‌లాల్ నెహ్రూతో మిస్ హెలెన్ కెల్లర్.

# ఎందులకో ప్రేమకానుక! ఇదిగో నిజమైనట్టి ప్రతిఫలము!!

జీవన్‌టోన్ సేవించుటకు ఆరంభించి ఎక్కువ లాభమును, మిక్కిలి ఎక్కువ బరువును, శక్తియు పొందినటువంటి ప్రేమికుల ప్రశంసలు ప్రొగులు.. వేలకొలది ఉత్తరములు ప్రతిదినము పొందియు కాని అన్నిటిని ఇక్కడ ఇచ్చుటకు వీలులేక కొన్ని ఉత్తరములను మాత్రము మీ ముందు పెట్టుచున్నాము. మిగిలిన ఉత్తరములను వ్రాసినవారికిని, ఈ స్నేహితులకును కృతజ్ఞతలు.

ఒక డబ్బా మందు సేవించియు, దానివల్ల ఏ లాభమును పొందలేదు. అందువల్లనే తిరిగి ఉత్తరము వ్రాయుచున్నాను. మీ ఉత్తరము ప్రకారము 7 డబ్బాలు సేవించితిని. ఇప్పుడు నాకు మంచి ఆరోగ్యమును, బరువును చేకూరినది. 99 పౌండ్లు వుండిన నా బరువు ఇప్పుడు 130 అయినది. మీరు చెప్పినప్రకారము ఫోటోను పంపించెదను. దాసన్, 17, సిల్కువీధి, బొంబాయి—20.

డాక్టర్ సార్, నేను 6 డబ్బాలు వేరొక మందుకొని సేవించితిని. కాని ఏ లాభమును పొందలేదు. నా స్నేహితుడు చెప్పినప్రకారము 'జీవన్‌టోన్' సేవించుటకుఆరంభించితిని. 4 డబ్బాలు సేవించినవెంటనే 27 పౌనులు అధికమైనది. ఇంకను ఎక్కువబరువు కావలెను. అందువలన ఇంకను 3 డబ్బాలు కావలెను. పంపవలయును. (వి. పి. పి. మూలముగా) పి. పి. పాల్, 27, మేదావీధి, కలకత్తా—10.

మేనేజర్ సార్, 1000 రూపాయల బహుమానమును, చిత్రములో నటించుటకు అవకాశమును దొరకును—మా యొక్క మందును ఉపయోగించినయెడల—అని పత్రికలో చూచి ఆరోగ్యమును, అధిక బరువును, సినిమాలో నటించుటకు మంచి అవకాశమును దొరుకునని ఆశతో మేము అందరముచేరి 10 డబ్బాల మందును తెప్పించితిమి. మేము ముగ్గురు స్నేహితులము సేవించియు లాభము ఏమియు దొరకలేదు. తిరిగి ఆ మందు 10 డబ్బాలు సేవించియు దానివల్ల దేహము మిక్కిలి బలహీనమైపోయినది. మాకు ముందుగనే తెలుసు. 'జీవన్‌టోనును' సేవించినయెడల తటాలున శరీరము లావు అగునని. అదేవిధముగానే ఆ మందు అని తలచి సేవించితిమి. కాని ఏమారిపోయితిమి. మేము దానితరువాతనే నమ్మకమైన మందు జీవన్‌టోన్ అని తెలుసుకొని జీవన్‌టోనును సేవించుటకు ఆరంభించితిమి. జీవన్‌టోను కంపెనీ ప్రచురణను బట్టి 6 డబ్బాలు నేనును, 8 డబ్బాలు నా స్నేహితులును, సేవించితిమి. వారు చెప్పినట్లుగను, పటములో చూచినట్లుగను తటాలున శరీరము లావైనది. కావలసిన బరువును లభించినది. మమ్ములనుపేపి ఒక చిత్రమును తయారుచేయుటకు మిగుల కృతజ్ఞతలు. పాలఘాట్ కంపెనీ చెప్పునటుల 1000 రూ. అవసరములేదు. కాని నిజంగా మీరుతీయుచిత్రములో నటించుటకు అవకాశము దొరికినందుకు కృతజ్ఞతలు. పి. సుబ్బయ్య, 132, చెంగోట్టై.

అయ్యా వైద్యుడా, నా స్నేహితులును నాలాగ చాల బలహీనముగా వుండిరి. జీవన్‌టోనును వదలక సేవించుటవలన కలిగిన లాభముచే వారు గుర్తుపట్టుటకే తెలియలేనంతగా మిక్కిలి లావుగా పెరిగిపోయినారు. అట్లే నాకును జరుగవలెనని ఆశతో ఒక డబ్బా కొని సేవించి ఏ లాభమును యివ్వలేదు. వారికిని ఏ లాభమును దొరకలేదు. 5 డబ్బాలు వదలక సేవించుటవలననే దేహము కొంచెము లావు అయినది. నా స్నేహితులు 8 డబ్బాలు సేవించిన వెంటనే శరీరము బాగుగా లావైనది. అదే మాదిరిగా నాకును 3 డబ్బాలు పంపవలసినది. సి. ఎం. మత్తాయి, మధుర.

ప్రియమైన డాక్టరునకు, మీరు చెప్పినప్రకారము ఫోటో పంపియున్నాను. నేను 9 డబ్బాల మందు సేవించితిని. మొట్టమొదట 2 డబ్బాలు సేవించినవెంటనే ఫలము లభించలేదు. అప్పుడు కొంతమంది చెప్పినట్లు వదలక సేవించుటవలన మంచి బరువు లభించినది. 38 పౌనులు అధికబరువును లభించినది. ఫోటోను పత్రికలో ప్రచురించుటకు నా పూర్ణసమ్మతము. పి. ఎం. సుందరం, శివలింగప్పవీధి, కోవై.

వైద్యులగారికి, నా స్నేహితులు మీ యొక్క జీవన్‌టోనును సేవించి, అనుభవించి, అదేమాదిరిగానే నాకును వారివలె లావును, బరువును లభించిన మంచిది. జీవన్‌టోనును సేవించి మిక్కిలి అధికమైనలావును పొందిన వారినిచూచి, తరువాత భుజింపనుంటిని. అదే మాదిరిగ. నా స్నేహితులకు లభించినది. వారికి దొరికిన మాదిరిగా అధికమైన బరువును, లావును నాకు దొరికిన మంచిది. అందువలన వెంటనే 4 డబ్బాలు వి. పి. పి. మూలముగా పంపవలయును. రు 10—00 దీనితో అడ్వాన్సుగా పంపియున్నాను. ఎం శివం, మెరైన్ డ్రైవ్, బొంబాయి.

సార్, నాకు ముందుగా పసుపు పిత్తము పట్టియుండినది. వాటినన్నిటిని కుటుంబ డాక్టరు పరిచేసినారు. కాని దేహము మిక్కిలి బలహీనమైనది. నా శరీరపుబరువు 72 పౌనులుగా వుండినది. నా కుటుంబ డాక్టరు జీవన్‌టోనునే వదలక సేవించుమని చెప్పిరి. అదే మాదిరిగా 7 డబ్బాలు జీవన్‌టోనును వదలక సేవించితిని. ఇప్పుడు 109 పౌనుల బరువువున్నాను. మంచి ఆరోగ్యముగను వున్నాను. ఇప్పుడు సేవించుటను డాక్టరు ఆపివేయమని చెప్పినారు. మీరు చెప్పినట్లు దీనితో నా ఫోటోను పంపియున్నాను. జడ్ జార్జి, 7/32, రిచ్ మన్డుంటవును, బెంగుళూరు.

సార్, 5 డబ్బాల మందు సేవించియైనది. కాని నేను తలచిన విధముగా 150 పౌనుల బరువు రాలేదు. 23 పౌనులు మాత్రమే కూడియున్నది. ఇంకను నాకు 18 పౌనులు కావలెను. వెంటనే 2 డబ్బాలు వి. పి. పి. మూలముగా పంపవలెను. రవికుమార్, బోర్డుప్లేయర్, అండమాన్.

వైద్యుడుగారు, నేను జీవన్‌టోనును సేవింప తలచి 3 మాసములు అయినది. కాని నా స్నేహితులు చెప్పినట్లు వేరొక మందు ఉపయోగించి చూచితిని. అందువలన లాభమేమియు దొరక లేదు. వదలక జీవన్‌టోనును సేవింప ఆరంభించితిని. 2 డబ్బాలు మాత్రమే సేవించిన వెంటనే 15 పౌనుల బరువు అధికమైనది. వెంటనే నా స్నేహితులకును చేరి 10 డబ్బాలు టి. వి. యస్. లారీ మూలముగా పంపవలసినది. ఎం. డేవిడ్, Opp. చర్చి, మండియా, మైసూర్ స్టేట్,

డాక్టరునకు, 2 సీసాల మందు దొరికినది. కాని 2 సీసాలు విరిగి పోయినవి. వెంటనే 2 డబ్బాలు పంపవలెయును. ఇప్పుడు నేను 6 వ సీసానే సేవించుచున్నాను. నాకు 32 పౌనుల బరువు మాత్రమే అధికమైనది. ఇంకను అధిక బరువు కావలెను. పైన చెప్పినట్లు 2 డబ్బాలు వెంటనే పంపవలెయును. సి. మహమ్మదుకుట్టి, అత్తిం కానా సమీపము, తిరువెంగాడు, కేరళ.



స్వీకరించుటకు పూర్వము

దాక్టరుగారు

రెండు నెలల క్రితము జబ్బు చేసినది. నాలుగు సీసాలు "జీవన్‌టోన్" సేవించగానే జబ్బు నయమైనది. నాలుగు సీసాలు సేవించిన వెంటనే 23 పౌనులు తూకము వచ్చినది. ఇంకా శరీరపుష్టి అవసరము. తిరిగి 5 సీసాలు సేవించి, మొదలు 110 పౌనులు తూకము ఉన్నది, యిప్పుడు 168 పౌనులు తూకము వచ్చినది. నా ఫోటో పంపుతున్నాను. అది పత్రికలలో పడుటకు నా పూర్తి అంగీకారము ఉన్నది. ఫోటో ఖర్చు మీరుపంపవలెను.

జి. పి. సుబ్బారావు, కోడంబాకము.



70 దినముల తరువాత

**జీవన్ టోన్ లాభములు** ఎంత మంచి ఆహారము భుజించినప్పటికిని శరీరములో చర్మముపట్టకపోయినను, పేగుగుదల తెప్పటకిని, అజీర్ణము, అలసట, ఆకలి తగ్గుట, యౌవనము విడిచి ముసలితనముగా కనబడుట, శరీరము చెడుట, స్వప్న తప్పుట, మొదలగు వానికి "జీవన్ టోమను" సేవించి మంచి ఫలమును పొందవచ్చును. "జీవన్‌టోమను' కొన్ని దినములు సేవించుచున్నయెడల చాల త్వరలో లావును, బరువును, మంచి పుష్టియు దొరకుట నిశ్చయము. కొంతమంది చెప్పునట్లుగా అస్వాభావికముల వ్యాధులకు ఇది పనికిరాదు. జీవన్‌టోమను సేవించు దినములలో కొంచెము దేహపరిశ్రమ చేయుట అవశ్యము. ఆవిధముగా చేయకపోయినయెడల అనవసరముగా లావగును. కావలసిన బరువును, లావును దొరికిన వెంటనే సేవించుట ఆపవలెను. లావును, బరువును వున్నవారు దీనిని సేవింపకుండుట మంచిది. అనేక మందులు ఉపయోగించియు ఫలము పొందలేనివారు ఒకసారి జీవన్‌టోమను ఉపయోగించండి. 454 గ్రాముల వెల రూ. 10/-

పురుషులు మాత్రము సేవించవలసిన మాత్రలు : దీనిని సేవించిన 10 దినములలో ఫలము లభించును. మిక్కిలి శక్తి కలిగించునంటి మాత్ర. 60 సంవత్సరములకు పైబడి వున్నవారికి ఈ మాత్రల మూలముగా ఫలము దొరుకుచున్నది. దాంపత్య జీవితములో ఏమారిపోయినవారు ఈ మాత్ర మూలముగా శక్తియు పొందవచ్చును.

... కోప్పు వెల రూ. 15/- ఈ మాత్రయును, జీవన్‌టోమను ఒకేసారి సేవించిన మంచి ఫలము యిచ్చును.

**"స్కిన్ టెమ్స్"** "స్కిన్‌టెమ్స్" ఉపయోగించి, మొటిమలు, కోసుకొన్న గాయములు, అమ్మవారు పోసి యేర్పడిన మచ్చలు, తేంబల్, చెమటకాయలు... మొదలగువానిని పోగొట్టి అందమైన ముఖమును పొందండి. 1 సీసా వెల రూ. 12/-

మా రంగుల చిత్రము : మా అనుభవపూర్వకమైన నిజమైన ఫొటోలను ప్రవేశపెట్టియున్నాము. ఏది నిజమైనదని తెలియవలెనన్న మా రంగులచిత్రము చూడవలెను. ఉచితం ఇండియాలో అన్నిష్ట ఆంశలోను వెలువరచియున్నాము. మద్రాసు గ్లోబు, మిడ్‌లాండ్ కోయంబత్తూరు, ఉదయా, తిరుచ్చి వెల్లింగ్‌టన్ థియేటర్లలో మేము వెలువరచిన చిత్రములను చూడవలెను. ఆ స్నేహితుని ఫోటోను పైన ప్రచురించివున్నాము. — కొత్త స్టాకిస్టులు:—

V. P. P. విచారణకై వ్రాయండి.—

**జ్యోతి ఆస్పత్రి**

రిజిష్టర్డు నెం. 218729

ఫోస్టు బాక్సు 1413




32, వెంకట నారాయణ రోడ్డు,
టి. నగరు, మద్రాసు-17,
ఫోన్: 44020

# క్షేమేంద్రుని బృహత్కథామంజరి కథలు

అనువాదం: తిరుమలరామచంద్ర

## విదూషకుని సాహసగాథ



విదూషకుడు కొరతవేసిన మనుష్యులు ముగ్గురి ముక్కులూ కోసుకొని మఠానికి తిరిగి వెళ్తుండగా దారిలో ఒక విచిత్రం కనిపించింది. ఒక సన్యాసి ఒక శవంపై కూర్చుని ధ్యానమగ్నుడై కన్నులు మూసుకుని ఉన్నాడు. విదూషకునికి ఇది చాలా కుతూహలం కలిగించింది. అతడు అక్కడ ఒక నీడచాటున నిలబడి ఏమి జరుగుతుందోనని చూస్తున్నాడు.

ఆ పరివ్రాజకుడు కొంత సేపటికి ధ్యానం నుంచి కదిలాడు., కళ్ళు తెరచాడు. శవం నాభి స్థలంపై చేతితో తట్టాడు. అక్కడినుంచి ఆవాలు పైకి వచ్చాయి. వాటిని అతడు చేతిలో పట్టుకుని పిడికిలి బిగించాడు. ఆ శవాన్నే ఎక్కి ఒక పాడు పడిన దేవాలయానికి వెళ్ళాడు.

అది చండికాలయం. సన్యాసి అక్కడ ప్రేతం నుంచి దిగి చండికకు నమస్కరించాడు. ''ఆదిత్య సేనుని కుమార్తెను నాకు ఉపహారంగా చెల్లించు. నీకు సిద్ధి కలుగుతుంది.'' అని దేవి అన్నట్టు విన బడింది స్పష్టంగా. సన్యాసిని నీడవలె వెన్నంటిన విదూషకుడు ఇవన్నీ చూచాడు. దేవాలయంనుంచి ఆ వినబడిన మాటలూ విన్నాడు. ఆదిత్యసేన తనయ అని వినగానే ఆశ్చర్యం కలిగింది. తన స్వామి అయిన ఆదిత్యసేనుని కుమార్తెను కాపాడాలనే నిశ్చయంతో అక్కడే కాచుకుని ఉన్నాడు.

సాధకుడైన ఆ సన్యాసి మహా మాయావి. ప్రేతవాహనుడై వెళ్ళాడు. తన మాయతో రాజ కుమారిని రాజమందిరం నుంచి చండికాలయానికి తెచ్చాడు. రాజకుమారి భయభ్రాంతురాలై ఏడుస్తోంది. మరుగున దాగిఉన్న విదూషకుడు అదనుకై వేచి వున్నాడు. రాజకుమారిని బలి ఇవ్వడానికి సన్యాసి సిద్ధమవుతున్న సమయంలో అతనిపైబడి శిరస్సును ఖండించాడు. రాజకుమారిని / వెలుపలికి పిలుచుకుని పోయాడు.

భయంతో వణికిపోతున్న రాజకుమారి నెమ్మదిగా కళ్ళు కొంచెం తెరిచింది. ఎదురుగా తనతండ్రి పురోహితుడు కనిపించాడు. ఏమీ తోచలేదు. గట్టిగా అతనిని కౌగలించుకొంది. ''మళ్లీ ఇక్కడికి రాండి'' అని దేవాలయం నుంచి అశరీరవాణి వినిపించింది. కాని విదూషకుడు దానిని అంతగా వినిపించుకోలేదు.

విదూషకుడు వెళ్ళడానికి ఉద్యమించాడు. కారు చీకటి. కనులు పెద్దవి చేసుకొని చుట్టూ చూచాడు. సాధకుడైన సన్యాసి తెచ్చిన ఆవాలు, ప్రేత అక్కడే పడివున్నాయి. ఆ ఆవాలు పుచ్చుకుని, ఆ ప్రేతనే ఎక్కి రాజపుత్రిని కూడా దానిపై ఎక్కించుకొని, ఆదిత్యసేనుని అంతఃపురానికి బయలుదేరాడు. అంతఃపురం చేరిన పిదప రాజపుత్రిని అంతఃపురంలో వదలిపెట్టి వెళ్లబోయాడు., తెల్లవారితే అంతఃపురంలోని జనం తన్ను చూస్తారనే భయంతో, ఆ చీకటిలోనే. ''నాకు భయం. నేను మిమ్మల్ని వదలి ఒంటరిగా వుండలేను. మీరు వెళ్లడం సుతరామూ పనికిరాదు.'' అని రాజపుత్రి ఆక్రోశించింది. ఆతనిని కదలనివ్వలేదు. విదూషకుడు చేసేది ఏమీలేక ఆ మందిరంలోనే నిద్రపోయాడు. బాగా అలసి వున్నాడు గనుక గాఢంగా నిద్రపట్టింది.

[illegible]
అంతఃపురం కావలివారు, కంచుకులు నిద్రపోతున్న అతనిని చూచారు. అంతఃపురంలో పరపురుష ప్రవేశమా?— అని చాలా కోపం వచ్చింది. ఆదిత్యసేనుని సన్నిధానానికి వెళ్లి విన్నవించారు.

ఆదిత్యసేనుడు వారి మాటలు వినగానే, మండి పడ్డాడు. విదూషకుని పిలిపించాడు. "ఏమిటిది?" అని ప్రశ్నించాడు.

విదూషకుడు అవంతయినా కలత పడలేదు జరిగిన సంగతులు పూసగుచ్చినట్లు అన్నీ చెప్పాడు. రాజును శ్మశాన సమీపంలోని చండిక ఆలయానికి పిలుచుకొని వెళ్లాడు. తల తెగిపడివున్న పరివ్రాజకుని చూపించాడు. తక్కిన నిదర్శనాలూ చూపాడు.

రాజుకు విదూషకుని మాటలతో నమ్మకం కలిగింది. చాల సంతోషించాడు. తన కన్యకు తగిన వరుడు అతడేనని నిశ్చయించి అతనికి తన కుమార్తెను ఇచ్చి వివాహం చేశాడు. గొప్పవారు తమకు ఉపకారం చేసిన వారికి ప్రీతితో ఐశ్వర్యం ఇస్తారు. కన్యను ఇస్తారు. ఇవ్వని వస్తువు ఏది?

రాజపుత్రి అనంగుడినే మచ్చిక చేసుకొని, తన అనుంగు బంటుగా చేసుకొనే విద్య తెలిసి పట్టింది. విదూషకుని వంటి ప్రియుడు ఏమిటి లెక్క? అతడు రతిలాలసుడై ఆమెతోపాటు రాజుగారి ఉద్యానవనంలో విహరించాడు.

కొంతకాలం గడిచింది. చండికాలయంలో ఆనాడు "మళ్లీ ఇక్కడికి రాండి" అని వినిపించిన అశరీరవాణి రాజకుమారికి జ్ఞాపకం వచ్చింది. ఆమె ఆ మాటలను తన భర్తకు జ్ఞాపకపరచింది, రహస్యంగా. ఆ మాటలు మాయమాటలని ఇద్దరికీ తెలీదు. అతడు, ఆమోహంతో, మాయలో పడి, చండికా మందిరానికి వెళ్లాడు.

కంటికి కనపడకుండా ఆకాశవాణిలాగ మాటలాడినది భద్ర అనే విద్యాధరి. ఆమె ఉన్నదనే ధైర్యంతో మన్మథుడు తను నిశ్శంక మల్లుడయానని బింకం పొందాడు. ఆమె చనుకట్టు మన్మథుని విజయ గజం కుంభ స్థలంలాగ ఉంది. ఆమెకన్నులు యవ్వనమనే సరోవరంలో మొలచిన తామరపూవు రేకులలాగ వున్నాయి. ఆమె కుంతలాలు బాగా పూచిన కాంతి లతపై ముసిరిన తుమ్మెదలలాగ వున్నాయి. అలాటి ఆ విద్యాధరిని చూచి విదూషకుడు వలపులో చిక్కుకుని రాజకుమారిని విస్మరించాడు.

ఆ విద్యాధరి నివాస స్థలం సిద్ధులు రక్షించే ఉదయ పర్వతం. ఇన్నాళ్లు ఇంటికి దూరంగా వున్నందుకు, మానవుని వలచినందుకు తండ్రి కోపగించుకుంటాడని భయపడి, ఆమె అతని వద్ద సెలవు పుచ్చుకొని వెళ్లిపోయింది.

విద్యాధరి వెళ్లిపోయిన తర్వాత విదూషకుడు వెర్రివాడయిపోయాడు. విరహంతో "హా భద్రా!" అని నిరంతరం వలవిస్తూ అక్కడక్కడే తిరుగులాడాడు. తర్వాత తూర్పు దిక్కు వైపుగా వెళ్లాడు. అతని పెదవులు నిట్టూర్పులతో వాడిపోయాయి.

విదూషకుడు, విరహాతురుడై అలా వెళ్లుతూ, వెళ్లుతూ, పుండ్రవర్ధన మనే పట్టణం చేరాడు.

[illegible]
బ్రాహ్మణి అతనికి సత్కరించి, "పుత్ర, నీవు నాకు చాల ఇష్టమైన వాడివి. నా ధనం సర్వమూ నీకు ఇచ్చివేస్తున్నాను. తీసుకో. నాకింక ఎవరున్నారు? ఉన్న ఒక్క కొడుకూ దూరమయి పోతున్నాడు. ఈ జీవితం వదలి వేస్తాను." అన్నది.

విదూషకుడు ఆశ్చర్య పడ్డాడు. "అంత దుఃఖం ఎందుకమ్మా? నీ పుత్రుడు నీకు దూరం కావడానికి కారణం ఏమిటి?" అని ప్రశ్నించాడు. వృద్ధ బ్రాహ్మణి ఇలా చెప్పసాగింది.

"నాయనా, చెబుతాను విను. ఇక్కడి రాజు పేరు దేవసేనుడు. ఆయనకు చిరకాలంగా సంతానం లేదు. ఎంతో దుఃఖంమీద ఒక కుమార్తె పుట్టింది. అందువల్ల ఆయన తన కుమార్తెకు దుఃఖలబ్ధ అని పేరు పెట్టాడు. ఆ రాజకుమార్తెను ఎవరు వరిస్తాడో, వాడు మరణిస్తాడు. ఇలా ఎందరో మరణించారు. రాజుకు పట్టుదల కలిగింది. ఎందరు మరణిస్తారో చూద్దాము. ఎవరు చావకుండా ఉంటాడో వాడికే ఇచ్చి పెళ్లి చేస్తాను. అని.

"రాజు గూఢచారులు ఆమెకోసం దినానికొక పురుషుణ్ని ఇంటికొకడు వంతున అంతఃపురానికి తీసుకుని వెళ్లుతారు. చాలమంది ఇప్పటికి క్షయించి పోయారు. ఈ నాడు నా కుమారుని వంతువచ్చింది. అతనిని గూఢచారులు తీసుకుని వెళ్లుతారు. అతడు మరణిస్తే, నేనూ మరణిస్తాను. అందువల్లనే నీకు అంతా ఇచ్చివేస్తాను."

ఆ ముసలి బ్రాహ్మణి మాటలువిని విదూషకుని మనసు కరుణతో కరిగింది. "తల్లీ నీవు భయపడవద్దు. నీ కుమారునికి మారుగా నేను వెళ్లుతాను. నేను చావను." అన్నాడు. కాని, ఆ వృద్ధురాలు అతనిని వదలలేదు. అతి కష్టంతో ఆమెను వదలించుకొని విదూషకుడు చారులవెంట రాజప్రాసాదం చేరాడు.

రాజాంతఃపురం రత్నశయ్యలతోను, రత్నాసనాలతోను నవ్వుతున్నట్లు ఉంది. అంతలో ముత్యాల దండలు వేసుకొని, నవ్వుతూ రాజపుత్రి వచ్చింది. ఆమెను చూస్తే, రాహువు పట్టునుంచి నక్షత్రాలతోపాటు తప్పించుకొని భూమికి జారిన చంద్రుని సిరివలె ఉంది. ఇంతవరకు ఎవ్వరూ ఆమెను తాకలేదు. యవ్వనం పొంగులు వారుతున్నది. ముక్కుపుటాలు ఎగిరిపోయే సౌరభాలను దిక్కులకు విరజిమ్ముతూ పాతాళబిలం నుంచి పుట్టిన తీగలాగ ఉంది, జీనువేయని కాంభోజ జాతి గోడిగలాగ ఉంది.

రాత్రయింది. రాజపుత్రి శయనంపై పడుకుంది. విదూషకుడు ఏమి జరుగుతుందో చూద్దామనే కుతూహలంతో, ఎవరు వచ్చి చంపుతారో చూద్దామని శయనాగరం తలుపు చాటున నిలబడి చూస్తున్నాడు.

కొంతసేపటికి ఒక ఘోరరాక్షసుని కుడిచేయి ద్వారంనుంచి లోపలికి జొరబడి గాలించసాగింది. ఆచేయి ఏనుగు తొండంలాగ పొడుగ్గాను, కర్కశంగాను ఉంది. ఆచేయి విదూషకుని సమీపంలోను గాలించింది. విదూషకుడు ఉగ్రుడైపోయాడు. ముసలి

[illegible]
ప్రసాదంవల్ల లభించిన తన ఖడ్గంతో ఒక్కవేటుకు నరికివేశాడు.

రాక్షసుని దండ తామరతూడు తెగిపడినట్లు తెగిపడగానే, రక్తం కోడుతూ, ఆ రాక్షసుడు పరిగెత్తిపోయాడు. ఆ రాక్షసుడే రాజపుత్రి వద్దకు వస్తున్నరాజకుమారులను పట్టి చంపి వేసేవాడు.

తెల్లవారింది. దేవసేన నరపతికి విదూషకుని సాహసకర్మ చాల సంతృప్తి కలిగించింది. ఆ అద్భుత తేజశ్శాలికి తన కుమార్తెను, సంపదను దానం చేశాడు.

అరణ్యంలో ఒంటరిగా దేవవనిత లభిస్తే ఆనందించే అసురుడిలాగా, సాటిలేని ఏనుగులు కాపాడే దివ్యవాపి లభిస్తే సంభ్రమించే దేవగజంలాగ తుళువ కళ్ళు, సవిలాసమైన తామరముఖం గల ఆ కన్యను పొంది విదూషకుడు ఆనందించాడు.

విదూషకుడు కొంతకాలం దేవసేనుని అంతఃపురంలో రాజకన్యతో ఇలా కొంతకాలం గడిపాడు. మళ్లీ అతని మనస్సు విద్యాధరిభద్రమీదికి మళ్లింది. దానివల్ల అతనికి నిద్ర పట్టడంలేదు. భద్రనే ధ్యానిస్తూ అంతఃపురం వదలి వెళ్లి పోయాడు.

వెళ్లుతూ వెళ్లుతూ సముద్రతీరం చేరాడు. సముద్రం తరగలతో భయంకరంగా ఉంది అక్కడ అతనికి స్కందదాసనే వర్తకుడు మిత్రుడయ్యాడు. ఆ వర్తకుడు కోటికి పడగ ఎత్తినవాడు వ్యాపారంకోసం ద్వీపాంతరాలకు వెళ్లుతున్నాడు. విదూషకుడు అతనికి ఇష్టంగా మాట్లాడుతూ, ఆవోడ ఎక్కాడు.

వోడ నట్టనడి సంద్రం చేరింది. వోడ ముందుకు కదలలేదు. కర్ణధారుడు ఎంతో ప్రయత్నించాడు. తెరచాపను గాలికి అనుకూలంగా మార్చాడు. అయినా ముందుకు పోలేదు. వోడను నీటిలోనిదో అడ్డింది. వోడలోని వ్యాపారస్తులందరూ హాహాకారాలు చేశారు. అవి మిన్నుముట్టాయి.

వోడలో అపారమైన సంపద ఉంది. వోడ కదలక అక్కడే చిక్కుకొనిపోతే ఏమి ప్రమాదం వస్తుందోనని స్కందదాసు ఆలోచించాడు. "ఎవరు బలంతో ఈ వోడను కదిలి ముందుకుపోయేట్లు చేస్తారో వారికి ఈ వోడలోని ధనంలో సగం, పెద్దపెద్ద కన్నులున్న నా కుమార్తెనూ ఇస్తాను" అని ప్రకటించాడు.

విదూషకుని మనస్సు, ఆ పరిస్థితికి కరుణార్ద్రమైంది. వర్తకుడు అంతడబ్బు ఇస్తానన్నందుకు నవ్వి, తనను తాళ్లుకట్టి సముద్రంలోకి దింపమని సెందని, తను ఆ వోడకు కలిగిన అడ్డంకి తొలగిస్తానని అన్నాడు. ఆ ప్రకారమే కర్ణధారులు అతనిని తాళ్లుకట్టి భయంకర మకరాకరమైన సముద్రంలోకి దింపారు.

విదూషకుడు సముద్రంలో మునిగాడు. లోపల ఒక మహాకాయమైన ప్రాణిపడిఉంది. వోడ అడుగు భాగం, కణుపువంటిది, ఆప్రాణి పిక్కలో తగులుకొన్నది. విదూషకుడు, ఆ కణుపును విడిపించాడు. వోడ ముందుకు కదిలింది. ధనలోభంగా వర్తకుడు

## ...[illegible]

దాసు విదూషకునికి కట్టిన త్రాటిని కోసివేసి, వోడను ముందుకు నడిపించాడు.

విదూషకుడు నీటిలోమంచే తెలుసుకున్నాడు, ధనలుబ్ధుడైన స్కందదాసు మోసంచేశాడని. తాను చంపిన జల జంతువు తోకాలిచిప్పనే తెప్పగా చేసుకొని సముద్రం తీరంచేరాడు. అక్కడనుంచి యదేచ్ఛగా ఎక్కడికో వెళ్లాడు.

అతడు చేరిన దేశం రాజు ఆర్యవర్మ. అతని కుమార్తెను వరించినవాడుగూడ దేవసేన మహారాజకుమార్తెను వరించినవాడి పాటు పడేవాడు. ప్రతివాడూ ఆరాత్రి మరణించేవాడు. విదూషకుడు తనకుతానుగా రాజకుమారికి వరుడుగా వెళ్లాడు. ఆరాత్రి మునుపటిలాగే తలుపుచాటున దాక్కున్నాడు.

ఈసారి అతనికి అర్ధరాత్రి ద్వారంమంచి లోపలికి ఒక రాక్షసుని ఎడమచేయి వచ్చి గాలించడం కనిపించింది. విదూషకుడు "హోహో వీడు మునుపటి రాక్షసుడే అయివుంటాడు. అప్పుడేమో కుడిచేయి లోపలికి రానిచ్చాడు. ఇప్పుడు ఎడమచేయి రానిస్తున్నాడు. వీడిని చేయునరికి వదలివేయరాదు. చంపివేయడం మంచిది" అని అనుకొన్నాడు. ఆ చేతిని తప్పించుకొని మెరుపువలె ఆ రాక్షసునిపై దూకి చంపబోయాడు. ఆ రాక్షసుడు అతనిని శరణుపొంది "మహామభావా, నన్ను చంపవద్దు. నా పేరు యమదంష్ట్రుడు నన్ను వదలిపెట్టు. నీవు ఎప్పుడు తలచుకొంటే అప్పుడు వచ్చి నీకు సహాయం చేస్తాను." అని అన్నాడు. విదూషకుడు సరేనని ఒప్పుకొని ఆ రాక్షసుని పోనిచ్చాడు.

ఆర్యవర్మ విదూషకుని సాహసానికి ఆశ్చర్యానందాలు పొందాడు. తన కుమార్తెను సంపదతోసహా అతనికి యిచ్చాడు. విదూషకుడు కొంతకాలం అక్కడ గడిపాడు. మళ్లీ అతనికి విద్యాధరి భద్ర జ్ఞాపకం వచ్చింది. రాజకుమారిని లెక్కచేయకుండా ఎక్కడికో వెళ్లిపోయాడు. పారిజాతలతను మరిగిన తుమ్మెద జాజిపూవులను ఆదరిస్తుందా?

విదూషకుడు చేరిన ప్రదేశం అగమ్యమైంది. అతనికి ఇంతలో రాక్షసుడు యమదంష్ట్రుడు చేసిన వాగ్దానం జ్ఞాపకం వచ్చింది. అతనిని స్మరించాడు. తక్షణమే యమదంష్ట్రుడు ఎదుట నిలబడ్డాడు. "నేను విద్యాధరిభద్రవద్దకు ఉదయాద్రికి వెళ్లాలి. అక్కడికి నన్ను చేర్చు." అన్నాడు. యమదంష్ట్రుడు అతనిని ఉదయాద్రి సమీపంలో [illegible] "మహాభాగా, సిద్ధసేవిత[illegible]

[illegible] లేదు. నీవువెళ్లు." అన్నాడు.

విదూషకునికి అక్కడ ఒక పుష్కరిణి కనిపించింది. దాని గట్టున దివ్యవనితలు నీటికోసం వచ్చినట్లు కనిపించారు. వారి చేతుల్లో రత్నాలు పొదిగిన బంగారు బిందె లున్నాయి. వారు ఇంతమంది నీళ్లు ముంచుకొని పోవడానికి రావడం అతనికి కుతూహలం కలిగించింది. "ఈ నీళ్లన్నీ ఎవరికోసం?" అని వారిలో ఒకరిని ప్రశ్నించాడు. ఆమె ఇలా అన్నది:—

"ఆర్యా, భద్ర అనే విద్యాధర వనిత తన తండ్రికి భయపడి ఇక్కడ ఉంటున్నది. ఆమెకు పూర్వం మానవసంసర్గం కలిగింది. ఆ మానవవాసన పోవడానికి మేము ఆమెకు దినమూ ఇలా స్నానం చేయిస్తున్నాము." ఆ విద్యాధరవనిత మాటలు అతనికి అమృతవర్షంలాగ వినిపించాయి. అతడు, పూర్వం భద్రదిచ్చిన రత్నాల ఉంగరాన్ని ఆవిద్యాధరి చంకలోని బిందెలో పడవేశాడు.

భద్ర స్నానం చేస్తుండగా రత్నాంగుళీయకం ఆమెతలమీదనుంచి ఒడిలో పడింది. దానిని చూడగానే ఆమెకు తన ప్రియుడైన విదూషకుడు జ్ఞాపకం వచ్చాడు. అది ఎక్కడనుంచి వచ్చింది అని ప్రశ్నించి వివరాలు తెలుసుకొంది. వియోగబాధను భరించలేక పోయింది. అతనిని వెంటనే పిలుచుకు రమ్మని వారితో చెప్పింది. వారు అలాగే చేశారు. అతనిని మళ్లీ కలుసుకోగానే, మానవునిపై మరులు కలగడంవల్ల భద్ర విద్యాధర విద్యలన్నిటినీ మరచిపోయింది. ఇద్దరూ ఉజ్జయిని వెళ్లదామని సంకల్పించారు.

విదూషకుడు, తన మిత్రుడైన యమదంష్ట్రుని మళ్లీ స్మరించాడు. అతడు రాగానే భద్రతో పాటు అతని భుజం ఎక్కాడు. దారిలో ఆర్యవర్మకుమార్తెను వెంటబెట్టుకున్నాడు. స్కందదాసుచేసిన ద్రోహానికి శిక్షగా, అతని ధనం సర్వస్వాన్ని, అతని కుమార్తెను అపహరించాడు. తన వియోగంతో బాధపడుతున్న దేవసేన మహారాజకుమార్తె దుఃఖలబ్ధమూ పిలుచుకున్నాడు. సత్వోదారుడైన అతడు అందరితోనూ కలసి ఉజ్జయిని చేరాడు. అక్కడ ఆదిత్యసేనుని కుమారీ రత్నం, అతని పుష్కలమైన సంపద విదూషకునికోసం వేచివున్నాయి. అతనిరాకకు ఆదిత్యసేనుడు మొదలయినవారంతా మహదానందం పొందారు.

వత్సరాజు ఈకథ చెబుతూ, "సత్వవంతులైన శూరులకు విజయం చేతిలోని పని" అన్నాడు. వత్సరాజు చెప్పిన కథ విని అందరూ సంతోషించారు.

**(ఇంకా ఉంది)**

# మనిషిని చంపిన చీమలు

"బలవంతమైన సర్పము....." అన్న పద్యం మీరు విన్నారు: అది వచ్చి నిజమని తేల్చే దారుణమైన సంఘటన ఒకటి జరిగింది. కొలంబోలో నిద్రపోతున్న మానవుడిని చీమలు కుట్టి చంపేశాయట. రాత్రి ఆరుబైట పడుకున్న 58 ఏళ్ళ వ్యక్తి— తెల్లారి చూస్తే— నెత్తురు మడుగులో




వున్నాట్ట. అలాగ లెక్కలేనన్ని చీమలు లెక్కలేనన్ని వున్నాయట. రక్తనాళాలన్నీ చీమలు కొరికివేయడం వల్ల హెమరేజ్ వచ్చి— చనిపోయాడని డాక్టర్లు నిర్ణయించారు— ఇది యీ నెల పదిహేవో తేదీన జరిగింది.

*   *   *

న్యూయార్క్‌లో ఏదో గొడవలో లూసీ అనే వో గర్భవతిని పిస్తోలు పెట్టి పేలిస్తే— తూటా ఆమె కడుపులో వున్న శిశువుకు తగిలిందట. డాక్టర్లు వెంటనే ఆపరేషనుచేసి శిశువును బయటికి తీశారట. ఆ శిశువు బుగ్గకు తగిలిన తూటా నోట్లోకిపోయి, అక్కణ్ణించి కడుపులోకి వెళ్ళిపోయిందట. అంత చిన్న పసికందుకు ఆపరేషను చెయ్యగలమా అని ఆలోచిస్తుండగా ఆ తూటా దానంతటదే మలాశయంలోంచి వచ్చేసిందట. పిల్ల యింకా ప్రమాద స్థితిలోనేవుందని డాక్టర్లంటున్నారు.

*   *   *

అరూర్ తాలూకా కారుక్కారాలంపట్టి అనే వూళ్లో మైమునాబీ అనే 35 ఏళ్ళావిడ తన 50 ఏళ్ళ భర్తను, ముగ్గురు పిల్లలను వదిలి వేరే ప్రియుడితో లేచిపోయిందట. ఆమె భర్త ఖాసిమ్ సాహెబ్ ఆమెకు నచ్చచెప్పి, యింటికి తీసుకు వచ్చాడట. ఇల్లా రెండుసార్లు అయ్యిందట. మూడోసారి ఆమె మళ్ళీ ప్రియుడికోసం వెళ్ళిపోయేసరికి ఖాసిం ఆమెను దారిలో పట్టుకుని, పొడిచి చంపేశాడట. (ఖాసిం సాహెబ్‌కి ఆమె మూడో పెళ్ళాట.) సహనానికైనా హద్దొద్దూ!

*   *   *

మేడ ఎక్కి, క్రిందనున్న చోద్యం చూస్తున్న మురుగేశన్ అనే అతను కాలుజారి, మేడమీంచి పడి రోడ్డుమీద పడి, అక్కడే నెత్తురు మడుగులో చనిపోయాడట. ఇతనికి భార్య, ముగ్గురు పిల్లలూ వున్నారు. ఇది మైలాపూర్‌లో జరిగింది.

## 60 ఏళ్ల అనంతరం బహుమతి

న్యూయార్క్‌లో బయలుదేరి మూడువేల మైళ్ళు కారుమీద ప్రయాణంచేసి, ఏకధాటిగ శాన్‌ఫ్రాన్సిస్కో చేరిన వారికి వెయ్యి డాలర్లు బహుమతి యిస్తామని న్యూయార్క్ టైమ్స్ అనే పత్రిక, మరో ఆటోమొబైల్ క్లబ్ ఏర్పాటు చేసిన పందెంలో జార్జి అనే అతను గెలిచాడట. అయితే యిది జరిగింది ఇవాళా, నిన్నా కాదు. 60 సంవత్సరాల క్రితం. 1908 లో జరిగినా, యీనాటి వరకూ ఆ జార్జి అనే అతనికి యివ్వాల్సిన ప్రైజు యివ్వలేదట. అతని కిప్పుడు 95 ఏళ్ళట. "పిలుపు పై మంగళవారం (18 తేదీన) వచ్చి తీస్కో" అన్నారట ఆ సంఘ సభ్యులు.

—పాలాక్షుడు

## మహీధరోక్తులు

### మహీధర నళినీమోహనరావు

సంతకాలు, బ్లేడ్లు, స్టాంపులు, సిగరెట్లు
సంతరింతు రమిత శ్రద్ధ బాగా
వెర్రితోన వేయివిధములున్నవి గదా!
హృదయవర్తి యీ మహీధరోక్తి.



పాలకడలి తరచివచ్చిన సుధలోన
సగము రక్కసులకొసంగ వలదె?
నీతితప్పె పద్మనేత్రుండు పూజ్యుడా?
హృదయవర్తి యీ మహీధరోక్తి.

అభ్యుదయ కవీంద్రుడవనిపించుకోన నీకు
మనసు కలిగెనేని మార్గమేది?
భూసురుండు చెడపురుగని తిట్టుటే!
హృదయవర్తి యీ మహీధరోక్తి.

వ్యావహారికాంధ్రభాషలో రచియించు
యూనివర్సిటీల కొప్పదంట
తేటి మెచ్చుకున్న లోటు సంపెంగకా?
హృదయవర్తి యీ మహీధరోక్తి.

సీసపు బనియందు శ్రీనాథుడధికుండు
కందకూర తిక్క కవికి ప్రీతి
వేమనార్యుడాట వెలదికి సరసుండు
హృదయవర్తి యీ మహీధరోక్తి.

# భారత పౌరుని ఫిర్యాదు

## 'ముగ్గురు మూర్ఖులు'

'మనోహర్'

గతసంచిక తరువాయి......

'దేశంలో ప్రజలు చాలా కష్టాలపాలు సొందుతున్నారనీ, వర్తకుడు సరుకుల ధరలను పెంచివేయడమే దానికి కారణమనీ, భారత పౌరుడు ఫిర్యాదు చేసి యున్నాడు. ప్రభుత్వోద్యోగులు లంచాలను పుచ్చుకోవడం వల్లనే, తాను ధరలను పెంచవలసి వచ్చిందని అందుచేత యీ పరిస్థితి అంతటికీ ప్రభుత్వోద్యోగివైన నువ్వే కారణమని వర్తకుడు పరమేశ్వరునికి మనవి చేశాడు. అందుచేత ప్రభుత్వోద్యోగివైన నువ్వే యీ అధర్మానికంతటికీ కారణమని మేము తలంచుచున్నాము. ఇందుకు నీకు ఆక్షేపణ ఉంటే తెలుపుకొనవచ్చును.'

'పరమేశ్వరా! ఈమాటలకు నేను తీవ్రమైన ఆక్షేపణను తెలియజేస్తున్నాను' అంటూ ప్రభుత్వోద్యోగి చెప్పడం ప్రారంభించాడు.

'విచ్చలవిడిగా నేను అందరివద్దా లంచాలను పుచ్చుకొంటున్నమాట నిజమే. కాని నేను లంచాలను పుచ్చుకోవలసిన పరిస్థితి ఎందుకు ఏర్పడిందో గమనించవలసినదిగా పరమేశ్వరుని ప్రార్థిస్తున్నాను.

'మాది ఒక సాధారణ కుటుంబం. నా చదువు పూర్తి అయ్యేసరికి మాకు ఉన్నకొద్ది ఆస్తీ కూడా అయిపోయింది. అందుచేత నేనూ, నాకుటుంబం కేవలం నాజీతంమీదనే బ్రతకవలసి ఉంది'.

'ఇదివరకటి కంటే యిప్పుడు నాకు యెక్కువ జీతం వస్తున్న మాట వాస్తవమే కాని పెరిగి పోయిన ధరలతో పోల్చి నప్పుడు నాజీతం యిదివరకటి కంటే తగ్గిందని చెప్పవచ్చును.'

'నాకువచ్చే జీతం మాపెద్ద అబ్బాయి యం.బి.బి.యస్ చదవడానికి సరిపోతుంది. ఇక రెండవ అబ్బాయి యింజినీరింగు చదువుతున్నాడు. అమ్మాయి బియస్సీ చదువుతూంది. ఆఫీసర్ని కాబట్టి నేను కొంత హోదాతో జీవించ వలసి ఉంది.'

'ఇవికాకుండా నాకు ఉద్యోగం రావడానికేకొంత డబ్బు ఖర్చు అయింది. తరువాత యెక్కడకైనా నాకు ట్రాన్సఫరు కావాలంటే నేను మంత్రులకు లంచం యివ్వాలి. లేదా ట్రాన్సఫరు కాకుండా ఉండాలన్నా కూడా మంత్రులకు లంచంయివ్వాలి'.

''ప్రతినెలా ఒకరిద్దరు మంత్రులు మా ఊరికి పర్యటనకు వస్తుంటారు. అప్పుడు వారికి కావలసిన సమస్త సదుపాయాలను నేను సమకూర్చ వలసి ఉంది. నాకు తెలిసి ఉన్నంతవరకూ యేమంత్రీ తమ ఖర్చుల నిమిత్తం డబ్బుయిచ్చిన పాపాన పోలేదు. కాబట్టి ఆఖర్చులను కూడా నేనే భరించవలసివుంది.'

'ఈపరిస్థితిలో లంచం పుచ్చుకోకుండా జీవించడం సాధ్యం కాదు. కాబట్టి నేను లంచంపుచ్చుకొంటున్నాను. అందుచేత ప్రభుత్వమూ, ప్రభుత్వానికి ప్రతినిధులైన మంత్రులూ మాత్రమే ఈ పరిస్థితికి కారణం గాని నేను యెంతమాత్రం కాదు' అని ప్రభుత్వోద్యోగి పరమేశ్వరునికి మనవి చేశాడు.

'సరే! పిలు మంత్రిని' అని పరమేశ్వరుడు ఆజ్ఞాపించగానే నందీశ్వరుడు వెళ్లి మంత్రిని తీసికొని వచ్చాడు. అప్పుడు భృంగిలేచి మంత్రిని ఉద్దేశించి యిలాగ అన్నాడు.

'దేశంలో ప్రజలు చాలా కష్టపడుతున్నారనీ వర్తకుడు సరుకుల ధరలు పెంచివేయడమే దానికి కారణమనీ భారత పౌరుడు ఫిర్యాదు చేసియున్నాడు. ప్రభుత్వోద్యోగులు లంచాలను పుచ్చుకోవడం వలన తాను సరుకుల ధరలను పెంచవలసి వచ్చిందని వర్తకుడు పరమేశ్వరునికి మనవి చేశాడు. మంత్రులు తన జీతాన్ని పెంచక పోవడం వల్లను, తాను మంత్రులకు లంచం యివ్వవలసి ఉండడం వల్లను, తాను లంచాలను పుచ్చుకొంటున్నానని ప్రభుత్వోద్యోగి పరమేశ్వనికి మనవి చేశాడు. అందుచేత మంత్రివైన నువ్వే యీ అధర్మానికి కారణమని మేము తలంచుచున్నాము. ఇందుకు నీకు ఆక్షేపణ ఉంటే తెలుపుకొనవచ్చును'.

'పరమేశ్వరా! ఇది పూర్తిగా అన్యాయం' అంటూ మంత్రి చెప్పడం ప్రారంభించాడు.

నేను ఉద్యోగుల వద్ద లంచాలను తీసుకొంటున్నాను. అంతేకాకుండా బస్సురూట్లు, పర్మిట్లు, లైసెన్సులు వగైరా మంజూరు చేయడంలోకూడా లంచాలను పుచ్చుకొంటూనే ఉన్నాను. కాని నేను లంచాలను పుచ్చుకోవలసిన పరిస్థితి యెందుకు యేర్పడిందో ఆలోచించ వలసినదిగా పరమేశ్వరుని కోరుతున్నాను.

నేను చేసిన త్యాగం వల్లగాని మరొక అర్హత వల్లగాని నాకు యీ మంత్రి పదవి రాలేదు. సుమారు యేడెనిమిది లక్షల రూపాయలు ఖర్చుచేసి యీ మంత్రి పదవిని కొనుక్కొన్నాను. ఎవరైనామంత్రి కావాలంటే వారు ఒకపదిమందియమ్మెల్యేలను కొనుక్కోవలసి ఉంది. ఆ పదిమంది శాసనసభ్యులు మన ముఠాలో ఉన్నంతవరకే మన మంత్రి పదవి ఉంటుంది. లేకపోతే, లేదు.

మొట్టమొదట నేను మంత్రిని కావడానికే యేడెనిమిది లక్షలు రూపాయలు ఖర్చు అయింది. తరువాత నెలకూ పదిహేనురోజులకూ ఒక్కొక శాసన సభ్యుడు ముఠా మారిపోతానని బెదిరిస్తూ ఉంటారు. ఆలాగ బెదిరించినప్పుడల్లా నేను అతని చెయ్యి తడిచేయ వలసి ఉంది. ఈపరిస్థితిలో లంచాలను పుచ్చుకోకుండా నేను మంత్రి పదవిలో ఉండగలనా? అని నేను పరమేశ్వరుని ప్రశ్నిస్తున్నాను.'

'నేను లంచాలను పుచ్చుకోవడానికి శాసన సభ్యుడే కారణం కాబట్టి యీ పరిస్థితి అంతటికీ అతనే బాధ్యత వహించవలసి ఉంది' అని మంత్రి పరమేశ్వరునికి విన్నవించాడు.

'అయితే, పిలు శాసన సభ్యుణ్ణి' అని పరమే

శ్వరుడు ఆజ్ఞాపించగానే నందీశ్వరుడు వెళ్లి శాసన సభ్యుణ్ణి తీసికొని వచ్చాడు. అప్పుడు భృంగీశ్వరుడు లేచి శాసన సభ్యుణ్ణి ఉద్దేశించి యిలాగ అన్నాడు.

'దేశంలో ప్రజలు చాలా కష్టపడుతున్నారనీ, వర్తకుడు సరుకుల ధరలు పెంచి వేయడమేదానికి కారణమనీ భారత పౌరుడు ఫిర్యాదుచేసియున్నాడు. ప్రభుత్వోద్యోగి లంచం తీసికోవడం వలన తాను ధరలను పెంచవలసి వచ్చిందనీ వర్తకుడూ, మంత్రులు లంచాలను తీసికోవడం వలన తాను కూడా లంచాలను తీసికోవలసి వచ్చిందని ప్రభుత్వోద్యోగీ, శాసన సభ్యులు లంచాలను పుచ్చుకోవడం వలన తాను లంచాలను పుచ్చుకోవలసి వచ్చిందని మంత్రీ పరమేశ్వరునికి మనవి చేసి యున్నారు. అందుచేత శాసన సభ్యుడివైన నువ్వే యీ పరిస్థితి కంతటికీ మూలకారణమని తలంచుచున్నాము' ఇందుకు నీకు ఆక్షేపణ యేదైనా ఉంటే తెలుపు కొనవచ్చును.'

'పరమేశ్వరా'! యిది పూర్తిగా అక్రమం' అంటూ శాసనసభ్యుడు చెప్పడం ప్రారంభించాడు.

'నేను మంత్రుల వద్ద లంచాలను తీసి కొంటున్నాను. అంతేకాకుండా నీకైనంతవరకూ అన్నివిధాలా డబ్బు సంపాదిస్తూనే ఉన్నాను. కాని నేను యీ విధంగా చేయవలసిన పరిస్థితి యెందుకు యేర్పడిందో గమనించవలసినదిగా కోరుతున్నాను.'

'పరమేశ్వరా! యిదివరకు నేను యేదో సేవ చేశానని గాని యికముందు నేను యేదో సేవ చేస్తానని గాని నాకు యెవరూ వోట్లు వేయలేదు. నేను యిప్పించిన సారాయి తాగి, పులావు తిని నాకు వోట్లు వేశారు ప్రజలు. శాసన సభ్యత్వం కూడా ఒక వ్యాపారమే. నాకు యీ యెన్నికల్లో రమారమి రెండు లక్షల రూపాయిలు ఖర్చు అయింది. ఆ డబ్బు నేను యేదో ఒకవిధంగా రాబట్టు కోవాలిగదా! నేను మీకు సేవ చేస్తాను, మీ అభిప్రాయాలను నేను శాసనసభలో ప్రతిధ్వనిస్తాను అంటే నాకు యెవరైనా వోట్లు వేస్తారా? నేను ఒక్కొక్క వోటుకు యిచ్చిన పదిహేను రూపాయలను పుచ్చుకొని వోటర్లు నాకు వోటు వేశారు. అంతవరకూ యెందుకు? యిప్పుడు మీకు ఫిర్యాదు చేసిన యీ భారత పౌరునికి కూడా నేను పోయిన యెన్నికల్లో పదిహేను రూపాయలు యిచ్చాను' అంటూ శాసనసభ్యుడు భారత పౌరుణ్ణి వేలుపెట్టి పరమేశ్వరునికి చూపించాడు.

'అందుచేత డబ్బు పుచ్చుకొని వోట్లు వేసిన భారత పౌరుడే యీ పరిస్థితికి కారణంగాని నేను యెంతమాత్రం కాదు. అని శాసన సభ్యుడు పరమేశ్వరునికి మనవి చేశాడు.

అప్పుడు పరమేశ్వరుడు భారత పౌరుణ్ణి యిలాగ ప్రశ్నించాడు.

'వోటు వేయడానికి నువ్వు యితనివద్ద పదిహేను రూపాయలు పుచ్చుకొన్న మాట నిజమేనా?'

'నిజమే పరమేశ్వరా!'

'వోటు వేయడానికి డబ్బు పుచ్చుకోవడం నేరమని తెలుసా?'

'తెలుసును.'

'అందులోనూ యీ శాసనసభ్యుడు పూర్తిగా అవినీతి పరుడనీ, గత పర్యాయం యితను శాసనసభకు యెన్నిక అయిన తరువాత అవినీతి మార్గాల ద్వారా డబ్బు ఆర్జించి, మేడలు, మిద్దెలు కట్టు కొన్నాడనితెలుసా?'

'తెలుసును.'

'అయితే నువ్వు తెలిసిఉండీ యింతటి అవినీతి పరుడికి యెందుకు వోటు వేశావు?'

'ఏం చేయను? పరమేశ్వరా. నీతివంతులు యెవరూ యెన్నికల్లో పోటీ చేయలేదు. యితనికి పోటీగా నిలబడిన ఆసామీ కూడా యింతటి అవినీతిపరుడే. అతను వోటుకు పది రూపాయలు యిస్తానన్నాడు. ఇతను వోటుకు పదిహేను రూపాయలు యిచ్చాడు. అందుచేత యితనికి వోటు వేశాను.'

'సరే! ఒక మంచి వ్యక్తి నిలబడితే, అతని వద్ద డబ్బు పుచ్చుకోకుండా అతనికి వోటువేసే ఉద్దేశం నీకు ఉందా?'

దానికి భారత పౌరుడు యేమీ జవాబు యివ్వలేదు.

అప్పుడు పరమేశ్వరుడు చెయ్యి చాపగా, అతని చేతిలోనికి ఒక కాగితం వచ్చింది. దానిని పరమేశ్వరుడు భృంగి చేతికి యివ్వగా, భృంగి దాన్ని యిలాగ చదివాడు.

'ఎన్నికల్లో యిద్దరూ అవినీతిపరులే నిలబడ్డారనీ, అందులో ఒకరివద్ద పదిహేను రూపాయలు పుచ్చుకొని, తాను అతనికి వోటు వేశాననీ వాది యైన భారత పౌరుడు అంగీకరించాడు. నీతివంతులైన వ్యక్తులు యెన్నికలకు నిలబడలేదని అతడు పరమేశ్వరునికి మనవి చేశాడు. నీతివంతులైన వ్యక్తులుయెన్నికల్లో నిలబడక పోవడానికి కారణం యేమిటి? కేవలం యీ భారతపౌరుడే దానికి కారణం. ఎక్కడైనా చెదురుగా ఒక నీతివంతుడు నిలబడినా, అతనికి అతనివీధిలో వాళ్ళు కూడా వోట్లు వేయడం లేదుగదా! ఈ పరిస్థితిలో నీతివంతులు యెన్నికలకు సాధ్యమైనంత దూరంగా ఉండిపోయారు. ఇదే సమయమనుకొని అవినీతి పరులందరూ పదవులను ఆక్రమించుకొన్నారు.

'శాసన సభ్యుడూ, మంత్రీ, ప్రభుత్వోద్యోగీ, వర్తకుడూ కూడా అవినీతిపరులే. అయినా వీరందరూ, తమ వృత్తుల్లోనే అవినీతిని అవలంబించారు కాని భారతపౌరుడు, అయిదేళ్ళకు ఒకసారి తనను పాలించడానికి ప్రభుత్వాన్ని యెన్నుకొనే అవకాశాన్నే పదిహేనురూపాయలకు అమ్ముకొన్నాడు. అందుచేత వీరందరిలోను భారత పౌరుడేమిక్కిలి అవినీతి పరుడని నిర్ణయించబడింది'

దేశంలో ప్రజలు పొందుతున్న కష్టాలకూ అవినీతికీ, అధర్మానికి ప్రభుత్వమే కారణం. కాని ఆ ప్రభుత్వాన్ని మార్చడానికి అవకాశం భారత పౌరుని చేతిలోఉంది. అయినా దానిని అతడు దుర్వినియోగం చేశాడు. ఎన్నికల్లో వోట్లు వేయడం ద్వారా ప్రభుత్వాన్ని మార్చడానికి అవకాశం ఉండగా భారతపౌరుడు దాన్ని దుర్వినియోగం చేసి కొని, లోకరక్షకుడైన విష్ణుమూర్తి మీద ఫిర్యాదు చేసినాడు. ఈ పరిస్థితిలో విష్ణుమూర్తి మీద ఫిర్యాదు చేయడానికి భారత పౌరునికి యేవిధమైన హక్కూ లేదు. వోట్లుద్వారా ప్రభుత్వాన్ని మార్చగల అవకాశం ప్రజల చేతిలో ఉన్నంత వరకూ విష్ణుమూర్తి అవతారాన్ని యెత్తవలసిన అవసరం లేదు.

అందుచేత భారత పౌరుని ఫిర్యాదును కొట్టి వేయడమైనది.

ఇట్లు
పరమేశ్వరుడు.

'పరమేశ్వరా! భారతపౌరుడే యీ అధర్మానికి కారణమనీ, అతడే మిక్కిలి అవినీతిపరుడనీ, నిర్ణయించబడింది గదా! అతనిమీద నా చక్రాయుధాన్ని ప్రయోగించనా? అని విష్ణుమూర్తి పరమేశ్వరుని ప్రశ్నించాడు.

ఆ ప్రశ్నకు పరమేశ్వరుడు చిరునవ్వు నవ్వి యిలాగ జవాబు యిచ్చాడు.

'విష్ణుదేవా! నీకు తొందర తప్ప మరొకటి తెలియదు గదా! నువ్వు యితని మీద చక్రాన్ని ప్రయోగిస్తే యితడు చనిపోయి నరకానికి వెడతాడు. భూలోకంలో కంటే యిప్పుడు నరకంలోనే సుఖంగా ఉంది. అప్పుడు ఇతను చేసినదానికి ఫలితం అనుభవించడం యెలాగ? అందుచేత యితడు భూలోకంలోనే తను యెన్నుకొన్న ప్రభుత్వం చేత పాలించబడుతూ బాధపడాలి. అదే యితనికి తగిన శిక్ష.

'పరమేశ్వరా! ఇది చాలా అన్యాయం' అని భారత పౌరుడు ఒక్కసారిగా పొలికేక లేశాడు. ఆ కేకవిని పరమేశ్వరుడూ, విష్ణుమూర్తి ఒకరి ముఖాలను ఒకరు చూసుకొన్నారు.

'ఇందులో అన్యాయం యేముంది?' అని పరమేశ్వరుడు అప్పుడు భారతపౌరుని ప్రశ్నించాడు.

'పరమేశ్వరా! శివకేశవులలో యెవరి నామాన్నైనా సరే ఒకసారి స్మరిస్తే చాలును. వారి పాపాలన్నీ నశించి పోతాయి అని పురాణాలన్నీ చెబుతున్నాయి. అటువంటి పరిస్థితిలో నేను కైలాసానికి వచ్చి మీ యిరువురితో కూడా యింతసేపు వాద ప్రతివాదాలు జరిపాను. నేను యిదివరకు యెన్ని పాపాలనైనా చేసియుండవచ్చును కాని అవన్నీ నేను కైలాసంలో అడుగు పెట్టగానే నశించి పోయి ఉండాలి. అలాంటప్పుడు నేను యింకా పాప ఫలితాన్ని అనుభవించాలని తీర్పు చెప్పడం న్యాయమా? పురాణాల్లో మీ గురించి చెప్పిన మాటలు అబద్ధాలా? యీ విధంగా మీ రిద్దరూ కూడా ప్రజలను మోసగిస్తున్నారా? యీ ప్రశ్నలకు మీ సమాధానం యేమిటి? అందుచేత వెంటనే నాకు మీరు సుఖమయ జీవితాన్ని అనుగ్రహించకపోతే నేను మీ యిద్దరి మీదా కూడా జగజ్జననీ అయిన పరాశక్తి వద్ద ఫిర్యాదు చేయవలసి ఉంటుంది. కాబట్టే యే విషయమూ నాకు వెంటనే తేల్చి చెప్పండి' అని భారత పౌరుడు గుక్క

(63 వ పేజీ చూడండి

**యస్. పి. యస్, కలికిరి**

ఉన్నదానితో సంతృప్తి చెందడమే ఆనందం, లేనిదానికి అర్రులు చాచడం అవివేకం అన్నాను. లేదు. కనీసం ప్రయత్నించాలి అంటాడు స్నేహితుడు. మీరేమంటారు?

నిజమే. ఉన్నతికి పాటు పడడంలో మానవ ప్రయత్నలోపం ఉండ కూడదు.

**ఆర్. జె. యల్, కావలి**

ముందు వివాహం చేసుకుందాం. తరవాత ఉద్యోగం అదే దొరుకుతుంది అంటారు. నాకు ధైర్యగాలేదు...

దాచలేని వాడు దొంగిలించడం లాంటిది—మీ మిత్రుడు చేస్తున్న సూచన.

**వి. ఆర్. సి, కాకినాడ**

లోకం వినోదాంతమా? విషాదాంతమా?

ఆలోచించేవాళ్లకి వినోదాంతం, అనుభవించే వారికి విషాదాంతం!

**యల్. యల్. ఆర్, రాజమండ్రి**

ఇన్ని చెడ్డపుస్తకాలొస్తుంటే ఎలాగ?

పుస్తకాలు మంచివీ చెడ్డవీ అనికాదు, బాగా రాసినవీ, బాగా రాయనివీగా విభజించుకోండి సోదరా.

**యమ్. యస్. యన్. యమ్,**

**రాజమండ్రి**

పితృవాక్య పరిపాలకుడు మాతృ హంతకుడు అయిన పరశురాముడు గొప్పా? పితృవాక్యధిక్కారి అయిన ప్రహ్లాదుడు గొప్పా?

కారణ జన్ములయిన ఇద్దరూను.

స్త్రీని అబల అంటాడు నాస్నేహితుడు, సబల అంటాను నేను మరి మీరేమంటారు?

రెండూ అంటాను సోదరా, రక్షణ కోరేటప్పుడు అబల, బాధ్యతలు ధైర్యంగా బుజాన పెట్టుకునే టప్పుడు సబల.

**వి. ఎల్. కె, విశాఖపట్నం**

మాకు వివాహంఅయి ఏడాదికూడా దాటలేదు. అన్నమానూ మాటామాటా వస్తుంది మూతిముడుచుకోడాలూ మాట్లాడక పోవడాలూ ఎక్కువ అవుతున్నాయి. ఏం చెయ్యమంటారు.

**కె.సిహెచ్.యమ్. ఆర్, భవాని పాట్నా**

భయపడకు చెల్లెలా, ఈ ప్రణయ కలహాలు ప్రేమకు కొత్త చిగుళ్లే!

**యమ్. యస్. ఆర్, శ్రీకాకుళం**

చదువు అంతెక్కడ?




లేదు. నిజంగా చదువుకున్నవాడు నిగర్విగా నిత్య విద్యార్థిగానే ఉంటాడు. వినలేదా 'తెలివి యొకింత లేనియెడ తృప్తుడనై' యన్నపద్యం?

**పి. వి. డి, గుంటూరు**

స్నేహితులవల్ల ప్రయోజనం?

ప్రయోజన కారియై చేసే స్నేహాలు స్నేహాలా అవి?.......నిజంగా సజ్జన సాంగత్యం సాధించలేని దేమీ ఉండదు.

**వి. హెచ్. ఆర్. ఆర్, ఖర్గపూరు**

ఇంట గెలవలేనివాడు రచ్చగెలవ ప్రయత్నిస్తే ఎలా ఉంటుంది రామలక్ష్మిగారూ?

మైనపు తలవాడు ఎండ పడ్డట్టు ఉంటుంది రావుగారూ!

డబ్బుకోసం పెళ్లాడాలనిలేదు. డబ్బు అక్కరలేదనీ లేదు. ఏం చెయ్యాలి?

డబ్బుకోసం పెళ్లాడొద్దు కాని డబ్బున్న చోటికి వెళ్లండి సోదరా!

**యస్. ఏ. ఎస్, కలికిరి**

ప్రశ్నలు కవరులోనే వ్రాయలా? కార్డు చాలా? పోదుపో! రామచంద్రా అంటున్నారు రేడియోవాళ్లు.

పోదుం పో! అందాం బ్రదర్.

**జి. వి. ఎన్. ఎమ్, ఖర్గపూరు**

ఈ మధ్య నా మనస్సులో దూబనాచులాడిన స్నేహితురాలు చిన్ని నామీద అభిమానం కల్గి నన్ను మరచినట్లు ప్రవర్తించి ఉత్తరం వ్రాయకపోతే నా మనస్సు బాధపడుతుందని తెలిసికూడా వుత్తరం వ్రాయడం నైత్యం అని తలచే స్నేహితురాలి నెలా అర్థంచేసుకోవడమో తెలియడంలేదు చిన్నక్కా.

కొంచెం వ్యవహారం ముదిరినట్టేఉంది చిట్టితమ్ముడూ. చిన్నీ! ప్లీజ్ కరుణించు.

**ఎన్. వి. ఆర్, రాజమండ్రి**

నాకు అత్యాశ తప్పించి వేరు దుర్గుణం లేదు. నన్ను మా మేనకోడలే ఒద్దంటుంది. ఏం చేయాలి?

చాలుచాలు! అత్యాశ ఉంటే వేరే దుర్గుణం అక్కరలేదన్నారు.

**వి. వి. ఎన్. ఆర్, కాకినాడ**

గయ్యాళి భార్యని ప్రేమించే వెర్రివాడుంటాడా?

ఎందుకుండడు? "ఎంత తీయని పెదవులే ఇంతినీ? తిట్టుచున్నప్పుడు కూడ తీపిమరియు" అంటాడు— గాలిబుని అనువదిస్తూ దాశరధి,

**సి. హెచ్. ఆర్. ఆర్, ఖర్గపూరు**

భార్యా పిల్లలంటే అసహ్యంచుకొంటూ వీలైనంత సమయం ఇంటికి దూరంగా గడిపే స్నేహితునికి ఇవ్వగల సలహా ఏదైనా ఉందా?

పెళ్ళాం పిల్లలని ప్రేమించలేనివాడు ఇంట్లో అడసింహాన్ని పెంచుతూ దుఃఖాల గూడుకట్టుకుంటున్నాడన్నమాట.

**వి. కె. డి, తిరుచునాపల్లి**

డబ్బున్నవాడు కధా అని ఒప్పుకున్నావు అంటూ వేళాకోళం చేస్తున్నారు నా స్నేహితులంతా. ఈ సంబంధం కూడా వద్దంటే అమ్మ ఊరుకోదు. ఏంచేయాలి?

డబ్బుకోసం పెళ్లాడ్డంలేదు. డబ్బున్నచోటికి వెడుతున్నాను— అని చెప్పండి.

**టి. సిహెచ్, ఆత్మకూరు.**

ఆఫీసునుంచి ఇలా ఇంట్లో అడుగు పెట్టడంతో ప్రారంభిస్తుంది మా ఆవిడ కొండేలు చెప్పడం. ఈ దురలవాటు పోగొట్టడం ఎలాగ?

కొండేలు. చెప్పే అలవాటు ఉంటే వేరేపాపాలు చేయనక్కరలేదని చెప్పండి మీ ఆవిడకి!

**ఎన్. వి. కె. ఆర్, కాకినాడ**

కావలసినది సాధించేదాకా తాపత్రయ పడేవాణ్ణి లోకువగా చూస్తారెందుకు?

ఎవరు చూస్తారు?.... నిశ్చితార్థంబు వదలరు నిపుణమతులు!'

**ఎమ్. పి. ఆర్, కలకత్తా**

నస్త్రీ స్వాతంత్ర్య మర్హతి — ఏమంటారు?

'పితారక్షతి కౌమారే, భర్తారక్షతి యౌవనే, రక్షన్తి వార్ధకేపుత్రా! అప్పుడే కదా స్త్రీకి స్వాతంత్ర్యం అవసరం లేనిది!?' అవన్నీ జరిగినప్పుడు చూద్దాం. ఏమంటారు.

# మరపురాని కథ

కె. విజయమారుతి



రాత్రి 8 గంటలయ్యింది. వర్షం జోరుగా కురుస్తోంది. ఆ వానకి తోడు విపరీతమైన గాలి,వుండి వుండి ఉరుములు, మెరుపులు. కాంపౌండులో చెట్లు దెయ్యాల్లాగా వూగుతున్నాయి. రోడ్డు మీద వర్షపు నీరు ప్రక్కలకు చేరి వరదలా ప్రవహిస్తోంది.

మేము నలుగురము లోపల వెచ్చగ కూర్చొని పేకాట వేశాము. ఆరోజు ఆదివారం కావటం, నా శ్రీమతి పుట్టింటికి వెళ్లటం, మాకు మంచి అవకాశం కల్గించింది. నాయర్ చేసిన వేడి కాఫీకి తోడుగా వేడివేడి పకోడీలు తింటూ మా ఆట సాగిస్తున్నాము.

మేము బెజవాడవచ్చి రెండు ఏళ్ళు అయ్యింది. డాక్టరు శ్రీకాంత్, లాయర్ విశ్వనాథం, లెక్చరర్ కృష్ణమోహన్ నాకు క్లబ్‌లో పరిచయమయ్యారు. ఆ పరిచయం 'ఏమండీ' పలకరింపుతో ప్రారంభించి 'వురేయ్'లోకి వచ్చింది! సాయంకాలం నుంచి సాగిన ఆట విసుగు అనిపించింది.

"ఏమన్నా కబుర్లు చెప్పరా వాసూ" అన్నాడు కృష్ణ. పేకముక్కలు టేబుల్‌మీద తోసి విసుగ్గా మొహం చిట్లిస్తూ.

అందరి ముఖాలు అదే భావంతో వున్నాయి.

"ఈ వర్షం తగ్గేట్లు లేదోయ్, ఇంటికివెళ్లేది ఎట్లాగో. కనుక కాస్త మామీద దయవుంచిఏమన్నా చెప్పు"అన్నాడు విశ్వం సిగరెట్టు ఆఖరిదమ్ము పీలుస్తూ.

"నేను చెప్పడం ఏమిటి? మీరు చెప్పరాదు" అన్నా నవ్వుతూ

"సరే లేవోయ్! నీఫోజు నీవూను! నువ్వు రచయితవి. నువ్వు చెప్పనంత అందంగా మేము చెప్పగలమా"అన్నాడు శ్రీకాంత్.

వాళ్లనన్నిట్లా అడగడం మొదటిసారికాదు. కాని అప్పుడు ఏమి చెప్పనా అనుకొని అల్లాగే కూర్చున్నా.

మేముక్లబ్బులో ఆడివచ్చాక కాసేపు కబుర్లతో కాలం వెళ్ళబుచ్చికాని ఆరోజుని వెళ్ళబుచ్చము.

"ఏమిటోయ్, నీఆలోచన. ఇదే ఈ రచయితలకి పెద్ద జబ్బు" అన్నాడు కృష్ణ.

"చూడునాయనా! నన్నంటే అన్నావుకాని అంతటితో వూర్కో" అన్నా.

బయట వర్షపు మోత ఎక్కువగా వుంది.

ఆవర్షం ధ్వని చీల్చుకొని సన్నటి దగ్గుతెర వినిపించింది. అదివింటే అక్కడ ఎవరో స్త్రీ వున్నట్లనిపించి, వెంటనే లేచి వీధి తలుపు తెరిచా. ఆకారు చీకటిలో నాకు ఏమీ కనబడలేదు. వెళ్ళి వరండాలో లైట్‌వేశాను. ఆలైటు వెలుగులో నా దృష్టిని అటుతిప్పాను. వరండా మూల ఒక స్త్రీ ముడుచుకొని నుంచొంది. వర్షం జల్లు వరండాని తడిపింది. పాపం ఆమె ఆజల్లుకి తడిసి పోయి కట్టుకొన్న చీరవంటికి అతుక్కుపోయింది. నన్నుచూసి ఆమె తడబడిపోయింది. ముందుకు పడ్డ జుట్టుని ఒక్కసారి వెనక్కి తీసికొంది.

"దయచేసి లోపలికిరండి, వర్షం తగ్గాక వెళ్ళవచ్చు"అన్నా.

"థాంక్స్. ఇంకాసేపుంటే తగ్గిపోతుంది"అంది.

"ఇది ఇప్పుడు తగ్గే సూచన వున్నట్లు కన్పించటల్లేదు. రండి" అని నేను మరిమాటాడక ముందుకు నడిచాను.

నా వెనుకనున్న ఆమెను చూసి నా మిత్రబృందం పడుతున్న ఆశ్చర్యం నాకు నవ్వు తెప్పించాయి.

"నాయర్" అని కేకేశా.

కాసేపటికి నాయర్ వచ్చాడు.

"చూడు, వీరికి అమ్మగారి గది చూపు"అని ఆమెవంక తిరిగి "మీరు వెళ్ళి బట్టలు మార్చుకొని రండి"అన్నా.

ఆమెమటుకు ఈపరిస్థితి వచ్చినందుకు సిగ్గుపడుతున్నట్లు అట్లాగే నిలబడింది.

"వెళ్లండి".

ఆమె మరి మాటాడక నాయర్‌ను అనుసరించింది.

"ఏం! కథానాయకా"అని నవ్వుగా ఈలవేశాడు కృష్ణ నావంక నవ్వుతూ.

"ప్రతిదానికి ఏదో అర్థం కల్పించడం మనకు అలవాటయ్యింది. అందుకే మన ప్రగతికూడ అంత సంకుచితంగానే నడుస్తోంది. ఆమె గురించి మీకు ఎంత తెల్సో నాకూ అంతే తెల్సు.

"వర్షం బారినుండి తాత్కాలిక రక్షణకోసం మనవరండా ఆశ్రయించారు. ఆమె ఎవరో మన కెందుకు. ఆమె బాగ చదువుకున్నదిలాగ వున్నది" అన్నా

కృష్ణ నోరుతెరువబోయిఆపేశాడు. నేను వెనక్కి

తిరిగిచూశా. నా మాధవి శ్వేతనీలిరంగు చీర ఆమెకు అదనపు అందాన్ని అందిస్తోంది. ఆమెలో అందం ఆమెకళ్ళు. లైటు కాంతిలో అవి మిలమిల మెరిసి పోతున్నాయి. తడసిన జాటు భుజమంతా పరుచుకుంది.

ఆమె రాంగానే సరిగ్గా కుర్చీలో కూర్చుని, "రండి" అని ఆమెకు కుర్చీ చూపాను.

ఈలోగా నాయరు ఐదు కప్పులతో కాఫీతెచ్చి టేబులుమీదపెట్టి వెళ్ళిపోయాడు. నాయర్‌కి ఇంత తెలివితేటలు వచ్చినందుకు నాకు చాల సంతోషం కల్గింది ఆమె ముందుకు ఒక కప్పు జరిపి "తీసుకోండి"అన్నా.

ఆమె కప్పు తీసికొంది. మేము ఎల్గురం తలో కప్పు తీసికొన్నాము.

"వీళ్ళు నా ఫ్రెండ్సు. ఇతను డాక్టరు శ్రీకాంత్ ఇతను లాయర్‌విశ్వనాథం. ఇతను లెక్చరర్ కృష్ణమోహన్". అని మావాళ్ళను పరిచయం చేశా.

ఆమె చిరునవ్వునవ్వుతూ అందరికీ నమస్కరించింది.

ఆమె నవ్వుతుంటే ఆమెకళ్ళు మరీ అందంగా కనిపించాయి.

ఇంత అందమైన కళ్ళు నా కంట ఎప్పుడూ పడలేదు. "ఇంక మీ పరిచయం కావాలి"అన్నాడు కృష్ణ.

"నేను ఎం. యస్. సి, ఫైనల్‌యియర్ చదువుతున్నా. సెలవులకి ఇక్కడికి వచ్చాను ఈరోజు మా స్నేహితురాలింటికి వెళ్లి వస్తున్నాను తను అక్కడ భోజనం చేసేవరకు చంపింది వర్షం తగ్గే సూచన కనబడక రిక్షా ఎక్కాను వాడు ఆఎదురుగాలికి తొక్కలేకపోవడం గమనించా, వాడు ముసలివాడు. "పోనీలే"వెడతానని ఇక్కడదిగి వాడికి డబ్బులిచ్చి పంపేశా. వెనక్కితిరిగాను. అంతే వాడు అంత విసురు గాలిలోను రయ్యన వెళ్లిపోయాడు' అంది ఆమె.

"పోనపోయారన్నమాట" అన్నాడు కృష్ణ

"పోనీ లెండి. మీ పరిచయం కల్గింది" అంది తేలిగ్గా.

"మేము బయటికి వెళ్లాలన్నా వెళ్ళలేము. ఏమన్నా కథగాని, కబుర్లు గాని చెప్పు" అన్నాడు విశ్వం సిగరెటు ముట్టిస్తూ.

విశ్వం నడిగి సిగరెటు తీసికొని వెలిగించా. గదిలో దీపం నిశ్చలంగా తనపని చేస్తోంది. సిగరెటు పొగ గాలిలో తిరిగి విచిత్రమైన ఆకారాలు సృష్టిస్తోంది. మెల్లిగా గొంతు సవరించుకున్నా.

"సృష్టిలో మానవ జీవితం పరమ ఉత్కృష్టమైంది. భగవంతుడు ఇచ్చిన తెలివితేటలు వుపయోగించి పైకివచ్చిన వారు కొందరు. తెలివితేటలు లేకపోయినా, కేవలం అదృష్టం మీద పైకివచ్చిన వారు కొందరు. ఎన్నో తెలివితేటలుకల్గి తమ చేతులారా జీవితాలు నాశనం చేసుకునే అభాగ్యులు మరి కొందరు. ఈ చివర చెప్పినట్లు చేతులార తన జీవితం నాశనం చేసికొన్నాడు ...నా ప్రాణమిత్రుడు 'సునీల్‌బాబు'. వాడికి రానివిద్యలేదంటే మీరు నమ్మరు. ఏూ కాలేజి చాంపియన్. ఎంత బాగాపాడుతాడో అంతఅందమైన బొమ్మలు వేస్తాడు. కాని... కాని వాడిలో ఒకటే దుర్గుణం... అదేమిటంటే పిరికితమైన పిరికితనం.

మగవాళ్ళలో పిరికివాళ్ళుండరని నా వూహ. ఆ వూహలను తారుమారు చేసినందుకు వాడే నా స్నేహితుడయ్యాడు. వాడికి నేనుతప్ప ఎవరు స్నేహితులు లేరు ఆడవాళ్ళంటే చెప్పలేని భయం. వాడి పిరికితనం పోవటానికి నా శాయశక్తులా ప్రయత్నించాను. కాని ఫలితం మటుకు శూన్యం ఎంతో మంది కొత్త వాళ్ళను పరిచయం చేశా. వాళ్ళు అడిగిన దానికిబదులు చెప్పడం, వూరుకోడం ఇలాంటి వాడితో స్నేహం చేసేవాళ్ళెవరూ మిగల్లేదు.

ఆడపిల్లలువాడ్ని "బుద్ధావతారం' 'బుద్ధుడు' అన్న 'నిక్‌నేమ్'తో పిలవడం నా చెవులారా ఎన్నోసార్లు విన్నా. ఏమైనా అనబోతే నా చేయిపట్టు కొని లాక్కుపోయేవాడు.

ఒక్కొక్కసారి నేను కోపంలో 'పిరికిసన్నాసి', ఇత్యాది తిట్లతో సత్కరించేవాడ్ని. వాడు ఏమీ మాట్లాడేవాడుకాడు. తప్పు మనసైనా బాధపడ కూడదన్న సిద్ధాంతం వాడిది.

అందరూ ఆసక్తిగా వింటున్నారు. ఇదో అలవాటు వాళ్లకి. నా మాటలయందు ఆసక్తి కనబరుస్తే నాకు ఇంకా ఉత్సాహంగా వుంటుంది. అందుకే మావాళ్ళముఖం ఒకసారి పరిశీలించాను. వాళ్ళ ముఖంలో ఏభావం కనబడలేదు. నా మనస్సు దివుక్కుమని మళ్ళీ సర్దుకుంది.

'సునీల్‌కి ఫేవరేట్‌గేమ్ బాడ్మింటన్ అతను అప్పుడప్పుడు స్టేట్‌కి సెలెక్టఅయి నేషనల్స్‌కి వెళ్లేవాడు అతనికి తల్లిదండ్రులులేరు. వాడు కాలేజిలోచేరగానే ఉన్న ఒక్కమామపోయాడు అతను అతని ముసలి నౌకరు వూరికి అవతల బంగళాలో వుండేవారు. అప్పుడప్పుడు కొన్ని నెలలు అతనికోరిక మీద అతనితోనే వుండిపోయేవాడ్ని.

మెడ్రాస్‌లో 'బాడ్మింటన్ నేషనల్స్' జరిగినప్పుడు సునీల్ "టీమ్‌కెప్టెన్"గా సెలెక్టయ్యాడు నేను అతన్నిపంపేముందు స్టేషన్‌కివెళ్ళి అతనికి వీడ్కోలు యిచ్చి వచ్చాను. అప్పటినుండి అతని జీవితం మరో మలుపు తిరిగింది. అక్కడనుంచి అతను రాసిన ఉత్తరాలు చదువుతా వినండ'ని నేను లేచి బీరువాలోవున్న ఫైల్‌తీసి దానిలోవున్న కొన్ని లెటర్లు బయటకు తీశా.

'ఒకళ్ళ లెటర్లు చదివి వినిపించటం తప్పే. కాని 'సునీల్'లాంటి వారి గురించి చెప్పేటప్పుడు ఈ లెటర్ చదవక తప్పదు. అందులో చెప్పాలని మొదలు పెట్టాక ఏ విషయం ముందా అనుకొన్నా. మెల్లిగా ఫైలు తీశాను. గాలి విసురుకి అన్నీ ఒక్కసారి రెపరెపలాడాయి. వాటిమీద పేపరువెయిట్ పెట్టి ఒక లెటరు తీశా.

'ప్రియమైన వాసు,

నా లెటర్ అందేవుంటుంది. వెంటనే జాబు రాస్తూ వుండు. నా సంగతి తెల్సుగా నీజాబు లేకపోతే నాకు తిండికూడ సయించదని. వాసూ ... నాకు నాలో కాస్త ధైర్యమొచ్చింది. వురేయ్! ఒక అందమైన అమ్మాయిని చూశా! ఆడవాళ్ళని చూడనినేను ఆడవాళ్ళ అందం గురించి చెప్తుంటే నీవు ఆశ్చర్యపోతున్నావుకదూ! ఉండు. నిదానంగా రాస్తా.

వచ్చి మూడు రోజులయ్యింది. ఆ మూడురోజులు మామూలుగానే వున్నాయి. కాని ఆరోజు 4 గంటలకు 'స్టేగ్రౌండు'కి వెళ్లాను. ఎవరెవరో పల్కరిస్తున్నారు. వాళ్ళడిగినదానికి జవాబు చెబుతున్నా. అప్రయత్నంగా నా దృష్టి నాకు దూరంగా పోకచెట్టు నానుకున్న ఆమెమీదపడింది. చూడంగానే మళ్లీ చూడాలనిపించేట్లుంది. ఆమెచుటూ కూడా చాల మంది ఆడపిల్లలున్నారు ఆమె కళ్ళు చాల అందంగా వున్నాయ్. అందమంటే ఏమిటో నాకు తెలియదు కాని, ఆకళ్ళు మెరుపుకు దడిసి సూర్యుడుకూడ ముఖం చూపించలేక వెళ్లిపోతున్నాడనిపించింది. సన్నటి ఆమె పెదాలు వికసీవికసించని గులాబి మొగ్గలను గుర్తు చేశాయి. ఈ కవిత్వం చూసి నవ్వకు. ఇది ఆమెను చూశాకే చూడటానికి భయమేసి నేను రెప్పవాల్చక రెండు క్షణాలు చూశా.

కంగ్రాట్చులేట్ చేయడానికి వచ్చిన లేడీస్‌ని చూడలేని నేను ఆమెను చూశా. ఇంతలో ఆమె ప్రక్కనే ఉన్న ఒక అమ్మాయి నన్ను చూపించింది. ఆ పిల్లలంతా ఒక్కసారి ఇటు తిరిగారు. వెంటనే నేను ఏదో తప్పుచేసినట్లు తలవంచుకొన్నా. నారక్తం అంతా ఒక్కసారి గడ్డకటు కున్నట్లుఅయింది. వేరొకచోటుకు వెళ్లిపోయాను. మన వూరినుంచి వచ్చిన గోపీనాథ్ "ఏం బ్రదర్! ఆటు లేడీస్ వస్తున్నారా!" అని నవ్వాడు ఆ నవ్వుచూసి వళ్లుమండిపోయి వూరుకున్నా. ఏం చేయలేనుగా! ఆమెను ఇంకా 10రోజులుచూడవచ్చు.అదే నా తృప్తి. ఆ తృప్తితోనే ఈ లెటర్ ముగిస్తున్నా.

నీ సునీల్'.

అనిముగించి రెండవ లెటరు తీశా.

'ప్రియవాసు,

నాకు తెల్సురా నువ్వు మెచ్చుకుంటావని. ఆమె విశేషాలు రాయమన్నావుకదూ. విను. ఆమె బొంబాయి నుంచి వచ్చిందట. వాళ్లు మన ప్రాంతం వాళ్ళట ఆ టీమ్ లేడీస్ ఒకసారి నాచుటు చేరి నన్ను కంగారు తినిపించారు. అందులో ఒక గడుగ్గాయి "మీ పరిచయంకోసం వస్తే మీరు అలా అలా పరుగెత్తుతారేమిటండీ!" అంది. ఆమె పేరు సప్న. ఇంత ఇదిగా మాట్లాడటం చూసి నాకు ఎంతో భయం వేసింది (కోప్పడక)

ఈరోజు నాలుగు టీములన్ని పడగొట్టాము. ఈసారి మనమే 'విన్నర్స్' రావచ్చు ఇంకోవారం రోజుల్లో నీదగ్గరుంటా. వాసూ .. ఆమెను ఎన్నోసార్లు దరిగ్గా దగ్గరగా చూద్దామనుకున్నా.. మాట్లాడదామనుకున్నా. కాని ఏ ఒక్కటి చెయ్యలేకపోయా. ఇంక 'మాచ్‌టైం' అయ్యింది వుంటా.'

"మొత్తానికి సునీల్ కూడ ప్రేమికుడయ్యాడన్నమాట. చివరికి 'కామెడీ ఏగా బాబూ'"అన్నాడు శ్రీకాంత్.

సునీత మటుకు ఏకొనాన్ని మింగేస్తోంది.

ఆమె ఇక్కడవున్న మనిషి ఇక్కడున్నట్లనిపించలా. ఆకళ్లు అటుఇటు కదలాడుతున్నాయి. ఆ కళ్ళల్లోని సన్నటి నీటిపొర నా దృష్టిని తప్పించుకోలేక పోయింది.

మా కథా గమనంలో వర్షం కాస్త తెరిపించటం గమనించలేదు. శ్రోతలు కూడా ఆ విషయం పట్టనట్లు కనుపించారు. "మన కథలో వర్షం తగ్గటం

# మరపురాని కథ

గమనించలేదు" అన్నా.

"సరే ముందు తరువాత చెప్పవోయి" అన్నాడు కృష్ణ.

ఆతని ఆదుర్దా నాకు తృప్తి కలిగించింది.

ఇంకో లెటరు తీశా....

'నా వాసు,'

ఆమెను చూస్తే నాకు ఈర్ష్యగా వుందన్నావు' నిన్ను మర్చిపోవడం నాకు సాధ్యమా వాసూ! ఈ రోజు మూడు 'టెన్నిస్' మీద గెల్చాం. ఆమెతో పరిచయం చేసికోమన్నావు. లాభంలేదు వాసూ. మేము గెలిచినప్పుడల్లా ఆమె తన సంతోషం వ్యక్తపరిచేది. ఉదయం గ్రౌండుకి రాంగానే ఆమె చిరునవ్వు నవ్వుతూ 'విష్' చేసేది. బదులుగా నవ్వుకూడ నా పెదిమలమీద రానీయటల్లేదు నా పిరికితనం. ఈ ఆలోచనలలో రాత్రి నిద్రలేదు. లెటర్ రాయి.

నీ సునీల్.'

అందర్నీ పరిశీలించి, వారి ఉత్సాహాన్ని గమనించి మరో ఉత్తరం తీశాను.

'ప్రియవాసు!,

ఈరోజు గేమ్ చాల 'టఫ్'గా వుంది. వాళ్ళు మొదటి గేమ్ కొట్టారు. మా టీమ్ చాల గేమ్సు ఆడటంవల్ల కాస్త అలిశారు. నాకు కూడా ఆశ పోయింది గెలుస్తామని. ఎందుకంటే ప్రతిగేము మేము 'విన్' అయ్యేవాళ్ళం. మరి రోజు అలా జరిగింది. మా వాళ్ళు కాసేపు రెస్టు ఇచ్చారు. నేను ప్రేక్షకుల వేపొకసారి చూశా.

ఆమె కన్నులు భయంతో నిండివున్నాయి. పెదాలు సన్నగా వణకడం నేను చూశా. సూర్యుని కిరణాలను తప్పించుకోడానికి ఒక చేయి అడ్డు పెట్టుకుంది. చీర కొంగు తలమీద జార్చివుంది. ఇంక ఆమెను ఆట్టే సేపు చూడలేక నా వాళ్ళకి కొన్ని పాయింట్లు చెప్పి మళ్ళీ ఫీల్డులోకి వెళ్ళాను నాకు ఎంతో పట్టుదల వచ్చింది. నా పేరు పోకుండా వుండాలంటే ఆడాలి. అదేచాలు నాకు. వెంటనే వాళ్ళు 'ఫైన్ హాండ్స్' నాశనం చేశా. ఆ తరువాత నీకు తెల్సుగా. 'ఆంధ్ర విన్నర్స్'గా వచ్చాము. అంతా నన్ను ఎత్తేశారు.

అంతా సద్దుమణిగాక కొందరు లేడీస్ వచ్చారు. వాళ్ళను చూడంగానే నా గుండెలు గబగబ కొట్టుకున్నాయి. ఆమెను నేను చూడలేదు. అల్లాగే తల వంచుకున్నా.

"ప్రత్యేకంగా తెలుపుదామని వచ్చామండి" అంది గడుగ్గాయి.

నేను ఏమి బదులు చెప్పలేదు.

"మీ ఆటలో మమ్మల్ని చంపేశారు. ముఖ్యంగా ఈమెకళ్ళవెంట నీళ్లనుకూడ తెప్పించారు" అంది.

"థాంక్స్" అని గొణిగా.

"దేనికండి. ఏడ్పినందుకా" అని నవ్వింది.

"అబ్బే! కాదండి....." అని గబగబ అనేసి అక్కడ నుండి ఇవతలకి వచ్చేశా.

నా వెనుక "పిరికిమనిషి" అన్న మాట నా చెవులకు తగిలింది. మా గదికివచ్చి కరువుదీరా ఏడ్చా. నువ్వుఅనే వాడివి— ఆడపిల్లగా పుట్టమని.

నీ సునీల్.'

'ప్రియమైన వాసు,

పిలిటరందలేదు. కారణం ఏమిటో నాకు తెలీదు. ఆమెను చూడకుండ వుండలేనని ఈ 10 రోజులలో అనిపించింది. మొదటినుండి నేను చాల దురదృష్టవంతుడ్ని. నాకు వూహ రాకముందే తల్లిని, వూహ వచ్చి తండ్రిని గుర్తుపట్టేసరికి ఆయన్ని, నన్ను పెంచి పెద్దచేసి నా భవిష్యత్‌కి అందమైన రూప కల్పనలు చేసి అవి ఆచరణలో పెట్టబోయేసరికి మా మామయ్యను పోగొట్టుకొన్న దౌర్భాగ్యుణ్ణిరా.'

ఇది చదివి ఆపేశాను. ఇంక చదవలేక కిటికీలో వున్న కూజా దగ్గరకు వెళ్ళి నీళ్ళువంచి కాస్త గొంతు తడుపుకున్నా. మళ్ళీవచ్చి అసంపూర్తిగా వదిలిన లెటర్ చేతిలోకి తీసుకొన్నా.

'నువ్వుచాల అదృష్టవంతుడివిరా. నిన్ను ప్రేమించే వాళ్లమధ్య వుండి వాళ్ళ ప్రేమను అందుకొంటున్నావు. దేముడు చివరికి ఈ విషయంలో నన్ను అన్యాయం చేశాడురా. రేపు ఒక్కరోజు ఆమెను చూసేది. రాత్రినుంచి ఎంతో ధైర్యం నాలో నేను కల్గించుకున్నా, కనీసం ఆమె అడ్రసు అడుగుదామని. ఆడపిల్ల.... ఆమెకు ధైర్యంలేదు. మగవాడినైన నాకు అసలే ధైర్యంలేదు. రేపేమాకు ప్రైజులు, పార్టీ ఇచ్చేది. ఆమెతో మాట్లాడే అవకాశం మళ్ళీ రాదని నిశ్చయించుకున్నా. నేను అనుకున్న సమయం కాలం వచ్చింది. కాని నాకు కావల్సిన ధైర్యం వస్తుందో ......లేదో!'

'ఆమె ఆకుపచ్చని చీరమీద సమువ్వ పచ్చబోర్డరున్న చీర కట్టుకుంది. అదే రకం జాకెట్టు వేసుకుంది. జడలో ఒక గులాబి. ఆరోజు ఆమె ఎప్పుడూ కన్పించనంత అందంగా కన్పించింది. ప్రైజులు ఇచ్చారు. ఆ తరువాత పార్టీ!

'పౌర్ణమి కనుక వెన్నెలలోనే పార్టీ ఏర్పాటు చేశారు. ఆ ప్రదేశం కబుర్లతోను, నవ్వులతోను మారు మ్రోగుతుంది. సర్వర్లు ప్లేట్లు సప్లయి చేస్తున్నారు.

వెన్నెల వెలుగు నేలమీద పర్చుకొంది. రంగురంగు చీరల అమ్మాయిలు ఆకాశంలోని నక్షత్రాలను వెక్కిరిస్తున్నట్లున్నారు. అందరు గుంపులు గుంపులుగ చేరి, జరిగిన, జరుగబోవు విషయాలని చర్చిస్తున్నారు.

నేను ఒక్కణ్ణి అలా కుర్చీలో కూర్చుండిపోయా. 'ఆమె' నాకు ఎక్కడా కనుపించలేదు. వాళ్ళు వెళ్ళిపోయారేమోనని కంగారెత్తింది నాకు. ఒకసారి లేచి నిలబడి చుట్టుచూశా. దూరంగా ఆకుపచ్చటి పమిట గాలికి ఎగురుతూ కనిపించింది. "అవును.... ఆమె.. నాకు ఎంతోసంతోషం కలిగింది. నేను 'చాంపియన్'గా వచ్చినప్పుడు కూడా ఇంత సంతోషం పొందలేదు.

ఆనాడు నాకు ఆమె మొట్టమొదటగా ఎక్కడ కన్పించిందో అదేపోక చెట్టునానుకొని నుంచున్నది. చంద్రుని చల్లటి కిరణాలు పోక ఆకులను సందు చేసికొనివచ్చి ఆమెమీద పడుతుంటే ఆమె శరీరం వెన్నెలలో పాలరాయిగా మెరుస్తుంది. ఇదే సమయం. మాట్లాడాలని నా హృదయం తొందర పడసాగింది. గబగబ అడుగులేశాను.

అంతచల్లటిగాలి వీస్తున్నా చెమటలు పోశాయి నాకు. ఇంక అక్కడ నిలబడే శక్తి లేక వెనక్కి తిరిగా,

"పాడండి" అన్న అతిమధురమైన కంఠం నన్ను ముందుకు ఒక్కఅడుగు వేయనీయలేదు. వెనక్కి తిరిగి ఆమెను చూశా.

ఆమె కళ్ళల్లోని నీరు చంద్రుని కిరణాలకు ముత్యాల్లాగ మెరిసిపోతున్నాయి. నాకు తెలియకుండానే "అరే మీరు.....మీరు" అని ఏమిమాట్లాడాలో తెలియక అల్లాగే వుండిపోయా.

'ఆ కంటినీరు తుడువలేను' అని నాకు తెల్సు.

"అబ్బే! ఏంలేదు. అదినరే. మీరు ఎందుకు వచ్చారు. ఎందుకు వెళ్తున్నారు?" అంది నవ్వుతూ.

ఆనవ్వు వెన్నెలంత చల్లగావుంది.

ఎన్నో మాట్లాడాలనివచ్చిన నేను ఏమీ మాట్లాడలేక, వెళ్ళలేక అల్లాగే నిలబడ్డా.

'కూర్చోండి' అంది తాను కూర్చుంటూ.

మాట్లాడకుండా కూర్చున్నా. ఆమె చెట్టునాను కొని కూర్చుంది. చల్లటిగాలికి ఆమెముఖంమీదకు జుట్టువస్తోంది. వాటిని వెనక్కి తీసికొంటూంది. మా చుట్టు ఆకుపచ్చటిగడ్డి తివాసి పరిచినట్టుంది. ఆకు పచ్చటి చీరెలో ఆమె వనదేవతలా వుంది. గడ్డిని నోటి దగ్గరకు చేర్చి కొరుకుతోంది. నేను అల్లాగే కూర్చున్నా.

"మేము రేపు వెళ్తున్నాము" అంది.

"మేముఅంతే." అని తల ఎత్తిచూశా. నాకిష్టమైన ఆమె కళ్ళు నన్ను చూశాయి. వెంటనే తల వంచుకున్నా. ఆమె సన్నటి వేళ్ళు పర్సు తీయడం, దానిలోని ఆటోగ్రాఫు తీయడం చూశా. ఆమె దాని నిచ్చి సైను చేయమంది. దేవుడగుపించిన భక్తుడు లాగ ఆమె చెయ్యమన్నట్లు చేశాను. నాకు తెలియని శక్తి నన్ను ప్రశ్నిస్తోంది. "అవకాశం వచ్చినపుడు పోగొట్టుకోకు. ఆ అవకాశం మళ్ళిమళ్ళి నాకసలు రాదని"

ఆమెను తలెత్తిచూసే ధైర్యమేలేదు. ఇంకేమి మాట్లాడను. ఆమెపేరుకూడ అడిగి తెల్సికోలేని నేను అడ్రసు ఎట్లా అడుగుతాను. గొంతు పెగల్చుకొని మాట్లాడబోయా. ఇంతలోగా నాపేరు 'మైకు'లో 4, 5సార్లు వినబడింది. "పదండి"అని ఆమె లేచింది నేనూలేచి నిలబడ్డా. ఇద్దరం కొంచెం దూరం వచ్చాక గోపీనాథ్ ఎదురయ్యాడు.

"ఇక్కడున్నావా! నీకోసం వెతకలేక చచ్చాం అనుకో"అని ఆమెను చూశాడు నాకు ఎంతో సిగ్గేసింది. మమ్మల్ని చూసి ఏమనుకుంటాడు.

"ఎందుకు"అన్నా. నా అతిచొరవకు నన్ను నేనే తిట్టుకున్నా.

"ఎందుకేమిటి! పాడాలి. మన ఆంధ్రపేరు నిల బెట్టాలి".

"నేను ఇప్పుడు పాడలేను. నన్నిబ్బంది పెట్టకు" అన్నా.

"ఏమిటి! మీరు పాడుతారు కూడానా?" అంది ఆశ్చర్యంగా.

'ఒక్కపాట ఏమిటండి! వీడికి రాని విద్యలేదు. పద పద అంతా నీకోసం చూస్తున్నారు"అన్నాడు.

'ప్లీజ్, గోపీ నేను ఎప్పుడు పాడలేదు."

"మీపాట వినాలనుంది. దయచేసి పాడండి" అంది ప్రతిమాలుతున్న ధోరణిలో.

జీవితం ఆమె కోర్కె తీర్చాలనుకున్నా.

ఇంతవరకు ఏ స్పెషిమీట్, పాడని నేను ఆమె కోసం పాడాను. నాచేత వాళ్ళు మీళ్ళు ఒక గంటసేపు పాడించారు. అంతా మెచ్చుకున్నారు. ఆమె నాచేయ్యి పట్టుకొని 'బాగా పాడారు' అంది. ఆమె వేళ్ళల్లో నా చేయి! వెంటనే కంగారుగా ఒకసారి ఆమె చేతిని మృదువుగా వదిలించుకున్నా. అది చాలనిపించింది నా జీవితానికి.

ఆ సమయాన రాత్రి 12 అయ్యింది. అంతా రోడ్లమీదకూడ ఆడుతూ పాడుతూ బయలుదేరారు. అనుకున్న పనయ్యింది. ఇప్పుడు ఏ బాధ మనస్సుకు లేదు. గెలిచినా, ఓడినా...... ఆరోజు అందర్ని ఒకళ్ళనొకళ్ళు వదలి వెళ్ళాలంటే బాధే ఇవన్నీ రైలు స్నేహాలు, బస్ స్నేహాలుగానే అయిపోతాయి.

"ఒకళ్ళనొకళ్ళు మర్చిపోకండి. మర్చిపోకండి" అని హెచ్చరికలు.

ఇవి వినే స్థితి నాకులేదు. గోపీనాథ్ నన్ను పలకరించాలని నా మౌనం చూసి వూరుకున్నాడు. ఇదే ఆఖరి రాత్రి. ఆమెను విడిచి రాలేను. ఉండి చేసేదేమీ లేదు. ఒకసారి..... ఆఖరుసారి..... తృప్తిగా ఆమెను చూద్దామనుకున్నా.

వాళ్ళున్న 'లేడీస్ హాస్టల్'దాటాకే మేమున్నగది. 'హాస్టల్'వచ్చేస్తోంది.ఈరోజున నాకోసం..అందులో నాలాంటి చరిత్ర హీనుడుకోసం ఆగదుగా. 'లేడీస్ హాస్టల్'దాటాను. నా వెనుక 'లేడీస్'గొంతులు వినబడలేదు. ఆమె నా కోసం వుంటుందనిపించింది. అందుకే వెనక్కి తిరిగి చూశా.

ఆమె గుమ్మానికానుకొని అల్లాగే చూస్తోంది. నన్ను చూడంగానే ఆమె చేయి వూపింది. వెన్నెలలో ఆమె చేయి బంగారు తీగలాగ అటుఇటు కదిలాడుతోంది. ఆమె అందమైన కన్నులను తృప్తిగా ఒక్కసారి చూసి నా చేయిని ఆమెకు సమాధానంగా వూపి వెనక్కి తిరిగి వచ్చేశాను. ఆ చూపులు నన్ను వెన్నాడుతునే వున్నాయి. నేను రేపు బయలు దేరుతున్నా—

నీ సునీల్'

అని చదివి వూపిరి పీల్చుకొన్నా.

"ఆతరువాత ఏమయింది? సునీల్‌బాబు ఆమెను కలిశాడా? ఇప్పుడు సునీల్ ఎక్కడ వున్నాడు?" అని వరసగా ప్రశ్నల వర్షం కురిపించాడు కృష్ణ.

ఆ తరువాత సునీల్ వచ్చాడు. వెళ్లేముందువెళ్ళిన సునీల్‌కి, ఇప్పుడు కనబడుతున్న సునీల్‌కి పోలికే లేదు. అతను చాల కృశించి పోయాడు. కళ్ళలోతుకు పీక్కుపోయి పిచ్చివాడుగ వున్నాడు. అక్కడ విశేషాలు' ఆమె గురించి చెప్పాడు. ఆమెను చూడాలని వుందిట. అతనికళ్ళు ఎప్పుడు దేనికోసమో వెతుకుతున్నట్లు వుండేవి.

అదినాకు తెల్సు. ఆమెకోసం వాడి మనస్సులో ఆమెకు ఉన్నతమైన స్థానం వుంది. వాణ్ణి చూసినకొద్దీ నాకెంతో భయం వేసేది. నేనే ఎన్నో కబుర్లు చెప్పేవాణ్ణి. ఆతరువాత దాని గురించి అడుగుతే "ఏమిటి' అని వెర్రిచూపు చూశేవాడు.

తానురాను వాడు కుర్చీలో కూర్చోలేక పోయేవాడు. మంచం మీద అన్నీ. వాడి పక్క నేను వాణ్ణి వదలలేకుండా వుండేవాణ్ణి.

ఒకరోజు నన్ను తన దగ్గర కూర్చోపెట్టుకొని నా చేయి తీసికొన్నాడు.



**గమనిక**

ఉత్తరాల శీర్షికకి రాసేవారు ఈ కింది నియమాలు పాటించాలని మనవి: 1. ఉత్తరాలు వీలయినంత చిన్నవిగా ఉండాలి 2. రాసేవారి పూర్తిపేరు, చిరునామా ఇవ్వాలి 3. ఇంగ్లీషు లిపిలో అక్షరాలు రాయరాదు 4. కాగితానికి ఒకవయిపునవే రాయాలి. 5 సిరాతవే రాయాలి. —సం॥

# మరపురాని కథ

"బాబూ— అందరూ నన్నొదిలి పెట్టినా నువ్వు నన్నొదలలేదు. అప్పుడంతా నీ పేరుమీద రాశాను. బాబూ.... ఆ సునీల్ కోర్కె తీర్చగలవా? నేను ఇంక ఎక్కువ రోజులు వుండను. ఒక్కసారి చివరిసారిగా ఆమెను చూడాలిరా" అన్నాడు. అతని కళ్ళంబడి బొటబొట నీళ్ళు కారి నా చేయిమీద పడ్డాయి.

అందమైన సునీల్ రూపురేఖలు లేవు. అతని నిండైన విగ్రహం కృశించి పోయింది. నాకు ఆ సమయాన ఆమెను తల్చుకుంటే చంపేద్దామనుకున్నంత కక్ష కల్గింది. వీడి స్థితికి కారకురాలు ఆమె అనిపించింది. వాడి సన్నటి వేళ్ళను నాచేతులతో నిమిరాను.

"ఏం వాసూ, మాట్లాడవు" అన్నాడు.

"ఆమెను వెతికి తప్పకుండా తీసికొస్తా"అన్నా. లోతుకుపోయి వెలుగంటుపోయిన ఆకళ్ళలోకి కాస్త కాంతి వచ్చింది.

మనం అనుకున్నవి జరిగితే దేవుణ్ణి గుర్తుంచుకోము. మనిషే దేవుడవుతాడు. అందుకే దేవుడు మనకా శక్తివ్వలేదు.

ఏదో ఆశ, ఆమె కనబడకపోతుందాని. ఈ ఆశఅనేది లేకపోతే మానవజీవితం దుర్భరం. లాటరీలో ఒకసారి పోయినా.... ఈ మాటు వస్తుందన్న ఆశతో మళ్ళీ కడ్తాము. అదే ఆశ నాలోను బయలు దేరింది. ఎట్లాగో అట్లా తంటాలుపడి ఆమె అడ్రసు కనుక్కున్నా. తీరా అక్కడికి వెళ్ళితే తాళం వేసిన డోర్ స్వాగతం పల్కింది. పక్కవాళ్ళను అడిగితే వాళ్ళు ట్రాన్సఫరు అయారని చెప్పారు.

రెండురోజులు. సునీల్‌కి ముఖం చూపించాలంటే భయమేసింది. కాని అతనున్న స్థితిలో అతనిని వదలకూడదు. అందుకే వెళ్ళాను.

నన్ను సునీల్ చూసి ఒకనవ్వు నవ్వాడు. అదినన్ను దహించి వేసింది. "నాకు తెల్సు. నీవు ఆమెను తేలేవన్నట్లుంది."

'ఆతరువాత అతను ఎక్కువ రోజులు బతకలేదు. "ఆమె కనబడితే నన్నామెకు గుర్తుచేయి" అన్నాడు. అంతటితో సునీల్‌జీవితం ఆఖర్—' అని బాధగా ముగించాను.

ఒక్కసారి అందరు బరువుగ నిటూర్చారు. ఎవరికి ఏమి మాట్లాడాలో తెలియలేదు.

'ఇది నువ్వు చెప్పావు కాబట్టి నమ్మాను' అన్నాడు కృష్ణ నన్ను చూస్తూ.

సునిత వెక్కివెక్కి ఏడుస్తుంది. "మీరు ఇంత సున్నిత హృదయులైతే చెప్పక పోదును"అన్నా.

ఆమె ఏమీ మాట్లాడలేదు. ఇలాంటిస్థితిలో ఏమి చేయాలో నాకు తోచలేదు. ఆమె ఏడవడం నాకు చిత్రమనిపించింది. ఆ సమయాన ఆమెను కరువుదీర ఏడవనిస్తే మంచిదనిపించింది.

"వర్షం తగ్గింద"న్నా. అప్పటికన్నా ఆమె సర్దుకుంటుందని.

ఆమె నా వంక కళ్ళెత్తి చూసింది. ఎర్రగా జ్యోతుల్లాగా వున్నాయి ఆమెకళ్ళు. ఆ కళ్ళకి తోడు నుదుట ఎర్రటిబొట్టు. రూపం చూస్తే విపరీతమైన భయం వేసిందినాకు.

**ఇంతకుముందు ఆమె కళ్ళలోని మెరుపును చూశా, ఇప్పుడు జ్యోతుల్లాగ ప్రకాశిస్తున్న కళ్ళను చూడలేక పోయాను.**

నేను లేచి కూజాలోని నీరు గ్లాసులో పోసి ఆమెకు యిచ్చాను. ఆమె అందుకొని గడగడ త్రాగేసింది. కాస్త సర్దుకొని కూర్చుంది. ఆమె కళ్ళలోని ఎరుపుజీర రానురాను తరిగిపోయి మునుపటి అందాన్ని పంచుకొంటోంది.

'అమ్మయ్య' అనుకొన్నా.

"ఇంతకీ ఆమె కనబడిందా"ని అడిగాడు కృష్ణ.

"లేదని" తలూపా.

"ఎందుకు కనపడుతుంది. హాయిగా పెళ్ళిచేసికొని భర్తతో వుండివుంటుం'దన్నాడు కసిగా విశ్వం.

సునిత లేచినుంచుంది. "ఆమె సంగతి మీకుతెల్సినట్లు మాట్లాడుతున్నారే! ఆమెకు పెళ్ళయిందని మీకు తెల్సా?" అని అడిగింది సునిత.

నిత్తరపోయి 'లేదని' తలూపాడు విశ్వం.

"మరి ఎందుకట్లా మాట్లాడారు" అంది.

ఈమె ప్రవర్తన ఏమిటో? అయోమయంగావుంది. మా అందర్నీ హడలు గొడ్తోంది.

"మీరందరూ అదే అనుకుంటున్నారా?" అంది.

ఎవరూ మాట్లాడలేదు.

ఒక స్త్రీ ముగ్గుర్ని పట్టుకు దబాయిస్తుంటే మేము చచ్చు దద్దమ్మల్లాగ వుండిపోవడం నాకే నచ్చలా. అధికారం చలాయించే ఆమెను చూస్తే అసహ్యమేసింది. అందుకే ధైర్యంగా చెప్పాలనుకున్నా.

"నా సునీల్‌ని చంపింది ఆమె. ఆమె ఎక్కడ కనబడ్డా నా కక్ష తీర్చుకోవాలనిపిస్తుంది" అన్నాను. 'పెళ్ళిచేసికొని సుఖంగావుంది ఎక్కడో' అని రెట్టించినట్టుగా నవ్వాను.

'ఇంతసేపు కథ చెప్పారుగా. నన్ను గుర్తించలేదా మీరు నేనే సన్నని! ఇప్పుడు చెప్పండి, అందరు చెప్పండి. నేను హాయిగా వున్నానా? నేను మీకు అలా కనబడుతున్నానా? ఆ సునీల్‌బాబుని నా ప్రాణంతో సమానంగా ప్రేమించా. ఇప్పుడాయన లేరని తెలిసింది. ఇంక నేనూ లేనని" గబగబ వెళ్ళిపోయింది.

ఆమె చెప్పిన మాటలు నా చెవుల్లో గింగురుమంటున్నాయి. ఇలా ఎప్పుడైనా జరుగుతాయా! ఇది నిజమా? కాదా? ఆమె నిజంగా సన్నా? ఏమిటో! అంతా అయోమయం.

వెంటనే తేరుకుని ఒక్కసారి వీధిలోకి పరుగెత్తా. కాని ఆమెనాకు ఎక్కడా కనబడలేదు.

ఇంట్లోకి అడుగుపెడ్తుంటే ఆతృతగా అడిగాడు కృష్ణ "ఆమె కనబడిందా" అని.

"లేదు. ఎలా వచ్చిందో అలా వెళ్ళిపోయింద"న్నా.

"ఆ వచ్చినావిడ కాస్త ముందువస్తే సునీల్‌బాబు బ్రతికేవాడేమో"అన్నాడు ఆశగా శ్రీకాంత్.

విశ్వం ఇంకా తేరుకోలా. అతన్ని చూస్తే జాలి వేసింది.

"అసలు సునీల్‌బాబు అనేవాడుంటేగా"అన్నా.

"ఏమిటీ!!" అన్నారు అందరూ.

"మీరు నన్ను క్షమించాలి. మీకు నేను చెప్పిన కథ, ఈ ఉత్తరాలు— నేను రాయబోయే కథకి 'ప్లాట్' అన్నా సునిత గురించి ఆలోచిస్తూ. ●

# పరీక్షా ఫలితాలు



రిజల్ట్సు వచ్చిన రోజున స్నేహితులం ముగ్గురం ఫొటో తీయించుకున్నాం. - మధ్యలో వాడు
తప్పాడులే!


ఐదు నిముషాలు ఏడ్చి తర్వాత ఐదు నిముషాలు నవ్వుతున్నావ్ - నీకేమన్నా పిచ్చా!
ఏమంటే- పరీక్ష సగం పాసయ్యాను!
ఇంకా స్కోప్ వుందిగా


అతనికి గుండె జబ్బు గదా! పరీక్షా ఫలితాలు చూపించొద్దు!


నాన్నా పరీక్ష పాసయ్యావా అనడిగితే - లాగి లెంపకాయ కొట్టాడు - అదేవిటో మరి!


ఏడుస్తున్నావెందుకే?


అబ్బే! ఏం లేదమ్మా - కంట్లో నలుసు పడింది
గుండెల్లో రాయి పడింది
పరీక్షా ఫలితా


నువ్వు ఎంచేత పరీక్ష తప్పావో నాకేం అర్థం కావడం లేదు రాజూ!
LOVE




**జరిగిన కథ**

చాలా చిన్నప్పట్నుంచీ శ్రీనివాస్ తల్లి చని పోయింది. తండ్రి గోపాలం వ్యసనాల పుట్ట. అతను రెండో వివాహం చేసుకుంటాడు అంత సమయమువాడితో తనకి వివాహం జరిగినందుకు సత్యద లోలోన కుమిలిపోతుంది. ఆ కసిని గోపాలం కూతురు సరస్వతిమీద తీర్చుకోవాలని చూస్తుంది. సరస్వతి శ్రీహరిని నమ్ముకొని మోసపోతుంది. సత్యద శ్రీనివాస్ చదువుకు సాయం చేయాలను కుంటుంది గోపాలం చనిపోతాడు. శ్రీనివాస్ రాజ మండ్రిలో జానకిరామయ్యగారింట్లో వుండి చదువు కుంటుంటాడు.

## 4

రెండు నెలలు తిరిగేసరికి శ్రీనివాస్‌కి రాజమండ్రి కొత్త పరిసరాలు అలవాటైపోయింది గోదావరి ... చూస్తూ, ఆ ... ఆనందంగా, వెలుగు నిమిషాల్లో గడిపేస్తున్నాడు చీకటి ముసురుకునేందుకు యింకా చాలా వ్యవధి వుంది. ప్రతి బుధవారం అవధానిగారి యింటికి వెళ్ళాలి అరవై నిండి పండి పోయిన ఆయన్ని చూస్తుంటే శ్రీనివాస్ హృదయం పల్లవించిన అనురాగంతో మునిగిపోయి చిందులు తొక్కుతుంది. ప్రాక్పశ్చిమాల నాగరికతని ఆకళింపు చేసుకున్న ఆయనకి శ్రీనివాస్ పక్కనే భోజనానికి కూర్చుంటేగానీ తోచదు. మెల్లగా యినుపకటకటాలు తెరిచి నెమ్మదిగా అడుగులో అడుగు వేసుకుంటూ వరండా దూరం చేరుకున్నాడు.

'చూడు అన్నపూర్ణా! మన శ్రీనివాస్ వచ్చేస్తున్నాడు. త్వరగా వడ్డించేయాలి. నీదే ఆలస్యం ప్రొద్దున్నుంచీ కరకరలాడు తోందినుమా', భోజనంచేశాక కాల్చుకుం దుకి పొగాకు దట్టంగా బిగిస్తున్నారు అవధానిగారు.

పండు ముత్తయిదువులా పార్వతీదేవిలా వున్న ఆవిడవైపు కన్నార్పకుండా చూస్తుండిపోయాడు శ్రీనివాస్.

'నేను అప్పటినుంచి మొత్తుకుంటూనే వున్నాను. మీరు వుండలేరు వాడు యేం పనిమీద వున్నాడో యేమో అని, ఈ ఒక్క రోజు తినేయండి అని చెబితే విన్నారా? పోనీండి యిప్పటికైనా వచ్చేశాడు' అన్న పూర్ణకి గర్భశుద్ధి అయిందేతప్ప పిల్లడు మాత్రం దక్కలేదు శ్రీనివాస్ ఆ ఇంట్లో అడుగు పెట్టిన రోజునే అనుకుంది. 'బహుశా పాతికేళ్ళనాడు చచ్చిపోయిన తన కొడుకు యిలా వచ్చాడేమో.' అని.

ఆమాటే భర్తతో అంటే ఆయన నవ్వి 'పిచ్చి అన్నా, మన కంత అదృష్టం కూడానా. అయినా ఆభావంకూడా మంచిదే. లేమితో మన యింట్లో కంచం వేసుకునే ఆ పిల్లడికి కడుపు నిండిపోతుంది. వాడికి కూడా వుండాలికద యిటువంటి అభి ప్రాయం' అన్నారు. మనసులోనే భార్యని ఆకాశానికెత్తుకున్నారు. మమత నిండి పోయిన ఈ మాతృహృదయాన్ని ఆపిల్లడు గ్రహించకపోడు అని.

'నేను నిమిషం అటో యిటో లవు తాను. మీరు భోజనం చేసేయకపోయారా? నల్లమందు అలవాటున్నారుకదా బాబాయ్' శ్రీనివాస్ కాళ్ళు కడుక్కొని పీటమీద కూర్చున్నాడు.

వారు వడ్డిస్తూ అంది అన్నపూర్ణ! 'మీ నోటితోనే చెప్పేయండి. వాడు మీ మాట కాదనడు'

భార్యవైపు వోసారి చూసి గొంతు సవ రించుకుని 'శ్రీనివాస్ నీకో సంగతి చెప్పా లోయ్' అన్నారు.

'చెప్పండి బాబాయ్'

'ఏవీ లేదు నీకు యిష్టం అవుతే యిప్పుడే వెళ్ళి మాట్లాడివస్తాను.

శ్రీనివాస్ తలెత్తాడు

'రాధని నువ్వు చేసుకుంటే బాగుం టుంది. మీ పిన్ని మరీ మరీ అంటోంది.'

'బాబాయ్!'

'ఎందుకురా ఆశ్చర్యం?'

తల విదిలించి నెమ్మదిగా అన్నాడు శ్రీనివాస్. అతని కనుకొలుకుల్లో నీటి బిందువులు అంతకంతకు లోపలికే యింకి పోతున్నాయి: 'మీకువున్న సహృదయత ప్రపంచంలో యెంతమందికి వుంటుం దంటారు? రాధ తలితండ్రులు యీయ వారంచేసుకున్నా అది వాళ్ళకి యిబ్బెట్టుగా అనిపించదు కానీ...

'చెప్పు నీ వుద్దేశ్యం'

'మీరు శ్రమపడి చెప్పినా లాభం

వుండదు. అనవసరంగా ఆశలు పెంచు కుంటున్నామేమో మనం.

'అయినా ప్రయత్నించి చూద్దాం యివాళ మంచిరోజు నేను వెళ్ళి అడిగి వస్తాను.'

'నేను యింకా చదువుకోవాలి. పిన్నీ, చెల్లీ నామీద యెన్నో ఆశలు పెట్టుకున్నారు. వాళ్ళని నేను పోషించాలి. నాకు శక్తి లేదు కుటుంబాన్ని యింకా పెద్దది చేసుకుంటే.,

'నీకు వుద్యోగం దొరికేవరకూ మన యింట్లో వుంటుంది శ్రీనివాస్: నువ్వు మళ్ళీ మాలో నొకడివి కావాలి అంతే,' అన్నపూర్ణ భర్తని తొందరచేస్తూ నిలవ నీయడంలేదు. శ్రీనివాస్ తల్లి బ్రాహ్మణ పిల్ల అని ఆ దంపతులకి తెలుసు. అవధాని గారు హరికెన్ లాంతరు చేత్తో వుంచుకుని మెట్లు దిగారు రాధ యింటిముఖంగా అడుగువేస్తూ.

* * *

'పిన్నీ! అన్నయ్య మనమాటే మరిచిపోయాడు యింకా యెన్నాళ్ళు యిలాగ'? సరస్వతి కళ్ళల్లో యించుమించు కన్నీళ్ళు కదులుతూ 'వూఁ' అంటే రాలిపడేటట్లున్నాయి.

సుభద్ర వంటయింటి గుమ్మంముందు చతికిల బడిపోయింది.

'నాకు ఆకలి చెప్పలేనంత బాధగావుంది. యేదైనా తెచ్చిపెట్టు పిన్నీ.' మంచానికి అతుక్కుపోయిన సరస్వతిని వోదార్చేందుకు సుభద్రకి వోపికా సహనం పూర్తిగా నశించిపోయాయి. గోపాలం వున్న రోజుల్లో నాలుగు యిళ్ళల్లో ట్యూషన్లు చెప్పి. లేకపోతే నలుగురిదగ్గర సర్దుబాటుచేసి కుటుంబాన్ని యెలాగోలాగ యీడ్చుకు వచ్చాడు. మగదిక్కులేని అబల లిద్దరూ వొకళ్ళ నొకళ్ళు వోదార్చుకుంటూ శ్రీనివాస్ వెళ్ళిన ఆరునెలల్నా గడిపారు. కాని రోజుగడవడమే కష్టం అయిపోతూంటే తనదే తప్పేమో అనుకునేది సుభద్ర వొక్కొక్కసారి. శ్రీనివాస్ దగ్గర నుంచి వచ్చే డబ్బు నానాటికీ తగ్గిపోతోంది. సుభద్ర యెదురు చూడడం మానేసింది.

'అతనికేం సుభద్రా నువ్వు పొరబాటు చేశావు'' అంతరాత్మని మళ్ళీ వొరెత్తించేది



# మొగలి పొదలు

కాదు. పైకి కఠినంగానే అనేది. 'అతను మనల్ని మరిచిపోయేడు. తోడబుట్టిన అప్పచెల్లెలూ మరో ఆడమనిషి దిక్కులేక అగచాట్లు పడుతున్నారని అనిపించివుంటే తప్పకుండా వచ్చేవాడు. మనఖర్మ మనమే అనుభవించాలి' నీళ్లబిందె భుజాన వేసుకుని బయటికి నడిచింది.

తిండికే మొహం వాచిన సుభద్రకి అభిమానం పూర్తిగా సడలిపోయింది. తూరుపు రేఖలు తెల్లబడకముందే పక్కింటి జగదీశ్ చదువు చెవుల్లోకి వినిపిస్తూంటే గోపాలం ప్రతిమ కళ్లల్లో కదిలింది. 'తప్పేం వాడు నా స్టూడెంట్ ఫరవాలేదు అడుగు సుభద్రా. నేను నీకు కానీ మిగల్చలేదనే బాధ నాకు లేదంటావా? వెళ్లు, వెళ్లి అడుగు. చెప్పానుకదా. నువ్వుచేసిన యేపని అయినా నాకు యిష్టం అయితీరుతుందని.'

కాళ్లు రెండుసార్లు మెట్లు ఎక్కిదిగి యికదిగలేక ముందుకు కదిలిపోయాయి.

'నేను .నేను లోపలికి రానుటయ్యా జగదీశ్ !'

కొంచెం తడిసి ముద్ద అయిపోయిన జాకెట్టులోంచి సుభద్ర బ్రహ్మదేవుడు సృష్టించిన అపురూపమైన స్త్రీని గుర్తుకు తెస్తోంది.

జగదీశ్ తల పుస్తకంలోనే వుంది:

'చెప్పవయ్యా నేను లోపలికిరానా'

'రండి, రండి' కంగారుగా అనేసి లేచి నిలుచున్నాడు సుభద్ర స్వరాన్ని తగ్గించేసి అంది 'నేను నీతో చాలా అవసరంవుండి వచ్చాను మీ మాష్టారే వుండి వుంటే నేనిలా రాకపోయేదాన్ని'

'చెప్పండి అసలు విషయం యేమిటో.'

'శ్రీనివాస్ వెళ్లాక వుత్తరాలు అడపా తడపా వస్తున్నాయే తప్ప అతని భోగట్టా తెలీడంలేదు తిండిగింజలు లేక నానా యిబ్బంది పడుతున్నాం మా శ్రీనివాస్ వస్తే తప్పకుండా ఈ ఋణం తీర్చుకుంటాను. ఒకవేళ మాట తప్పివుంటే అది మీ మాష్టారికి యిచ్చావనుకో ఈ పేద వాళ్లపట్ల మీలాంటివాళ్లు సహాయం చేయకపోతే'

జగదీశ్ కళ్లు ముడుతలు పడ్డాయి. అప్పటికే అతని స్మృతిపేటిక పని చేయడం ప్రారంభించి చాలాసేపు దాటిపోయింది. ఆ పేటికలో రకరకాల చిత్రాలు రీళ్లు తిరుగుతున్నాయి—

'ఆయన వచ్చేవేళ అయింది కూర్చో. యిప్పుడే శ్రీనివాస్ బయటికి వెళ్లాడు. అంతవరకూ ఈ పుస్తకం చదువుతూ వుండు,' సుభద్ర చాప పరచి మంచినీళ్ల చెంబూ, గ్లాసూ వుంచింది.

'పరేనండి,' జగదీశ్ బుర్ర వూపాడు.

ఇరవై నిండిన జగదీశ్‌లో ప్రకృతి లక్షణాలు స్తంభించిపోలేదు. అతని కళ్లు ఆ పిల్ల చుట్టూ పరికిస్తూనే వున్నాయి. తెల్లగా మిసమిసలాడిపోతూవున్న ఈ పిల్ల వొళ్లు ఆ ముసలాడి బాహుబంధాల్లో నలిగిపోతోందనే వూహ రాగానే చిత్రంగా కదిలింది అతని మనసు

'అతనికంటే బుద్ధి, జ్ఞానం లేకపోవచ్చును. ఈ శ్రీనివాస్ యెంత ఫూల్?'

సుభద్ర స్నానం ముగించి యింట్లోకి వెడుతూంటే పచ్చగా దబ్బపండుచ్ఛాయలో కదిలిపోతున్న ఆవిడ అణువణువూ అతన్ని రెచ్చగొడుతోంది. జగదీశ్ మనసు నిద్ర లేచింది. వెళ్ళి ఆవిణ్ణి కౌగిట్లో బంధించేయాలనే పైశాచిక తలంపు అతన్ని బానిసను చేసుకుంటోంది.

సుభద్ర అదృష్టం ఆరోజే మంటగలిసిపోయేది ఏమూలో అడుగంటని సౌశీల్యానికి రక్షగా నిలిచేందుకు శ్రీనివాస్ వచ్చేశాడు గుమ్మంలోకి అడుగు పెడుతూ.

జగదీశ్‌లో ఉప్పెనలా పొంగిన ఆంతర్యాలు ఒక్కసారిగా దిగంతాలకు జారిపోయాయి. అతను కూర్చున్నచోటే కూలబడిపోయాడు

శ్రీనివాస్‌కి బాగా తెలును అందుకే ఆ కళ్లు యిటు త్రిప్పి ఒక్కచూపు విసిరాడు. అంతే శ్రీనివాస్ ఆ ఛాయల్లో, ఆ పొలిమేరల్లో వుండగా జగదీశ్ యేనాడూ ఇటువంటి సాహసం చేయలేదు అందుకే అతను అజ్ఞాతంగా వుండిపోయాడు యిన్నాళ్లూ.

రీళ్లు తిరగడం క్రమేపీ ఆగిపోయాయి.

అంతే అతను యదార్థంలోకి జారాడు. సుభద్ర యింకా నిలబడేవుంది ఎదురుగా..

'ఒక్క పదిరూపాయలు వున్నాచాలు అతను రాగానే యిచ్చేస్తాను'

సుభద్ర జబ్బ పట్టుకున్న జగదీశ్‌ని

[illegible] గా చూస్తూండి పోయింది, 'వదా...పది రూపాయలా నువ్వు కోరేది సుభద్రా వెర్రి దానివి. నాలాంటి ఆఫ్ఫీసర్ల దగ్గర వేలు కాకపోయినా వందలు వసూలు చేయాలి నువ్వు వట్టి అమాయకురాలివి' అతను బహువచన ప్రయోగం మరిచే పోయాడు కళ్ళు వత్తుక్కి యుదార్థాన్ని మింగేయిస్తున్నాయి

'జగదీశ్' సుభద్ర కళ్ళు నిప్పు కణికల్లా మారిపోయాయి.

'ఛప్ ! నీ సంగతి అందరికీ తెలుసు. కొడుకునే వుంచుకున్నదానివి'

అతనిపళ్ళు రాలిపోలేదు 'ఎంతమాట అంటున్నావు నేను అలాంటిదాన్నా ?'

'నువ్వూ నేనూ యిద్దరం కాదు. ఈ ఘడియ, ఈ క్షణం అలాంటివి.'

'జగదీశ్ నీకు పుణ్యం వుంటుంది నన్ను నవ్వులపాలు చేయకు. గతిలేక వచ్చానని నన్ను నాశనం చేయకు. నువ్వేదో ఆదు కుంటావని నాకేదో సహాయం చేస్తావని అనుకున్నాను. కాని యిలా...'

'ఇప్పుడు చేయనని యెవరన్నారు?'

'ఒద్దు జగదీశ్ నీకూ, నీ సహాయానికీ నమస్కారాలు నన్ను వెళ్ళనివ్వు'

'సుభద్రా నమ్ముతావా? ఎన్నాళ్ళనుంచో తపిస్తున్నాను ఈ ఘడియకోసం, ఈ విని యోగం కోసం. నేను నిన్ను కోరుకుంటున్నాను వాతో రా.'

'గోపాలంతో యేముందని చేసుకున్నావు అతను బహుశా మీ తాతగారి ఈడువాడు అయివుంటాడు. అతన్ని పెళ్ళిచేసుకున్నావు బాగానే వుంది. ఏం సుఖపడ్డావు? అతన్ని పోగొట్టుకున్నావు. నీకు యిప్పుడు జరిగింది కూడా యేమీలేదు. నా మాట విను నిన్ను ఐశ్వర్యంలో ముంచెత్తుతాను.'

'హైదరాబాదు, కలకత్తా, ఢిల్లీ, మద్రాసు వీటిలోనే మన కాపురం. కాలు క్రింద పెట్టనివ్వను నేను ఈ బట్టల్లో నీ అదృష్టాన్ని మలినం చేసుకోకు. నీ అందాన్ని నా ద్వారా రక్షించుకో. నీ నొసట బొట్టు పెడతాను 'కా'దంటే నిన్ను రిజిస్టర్ పెళ్ళి చేసుకుంటాను.

'తప్పేం. ఎంతమందిలేదు యిలా ప్రపంచంలో.'

'జగదీశ్', సుభద్ర శరీరం వణ్కుతూని [illegible]. ఆ పురుష స్పర్శ [illegible] వ్యాపించి విచలితని చేస్తున్నాయి. పక్షవాతం వచ్చి ఆ పార్శ్వం పడిపోయినంత యమబాధ పడుతోంది. 'నన్ను క్షమించు జగదీశ్. నన్ను వెళ్ళనివ్వు,' సుభద్ర ప్రాధేయపడు తోంది అతనిలో యే మూలో మాన వత్వం పురివిప్పింది సుభద్ర మెట్లుదిగి ముందుకు దూసుకుపోయింది.

* * *

నిలుచున్నా, కూర్చున్నా ప్రతి సెకెండూ రింగుమంటూనే వున్నాయి ఆ మాటలు సుభద్ర చెవుల్లో సముద్ర ఘోష పెడుతూ. 'నీ అందం మంటి కలిసి పోకూడదు. చెరిగిన నీ నుదుటి రేఖలు శాశ్వతం చేస్తాను. రా సుభద్రా నావోయ్ నా బంధాల్లో యిమిడి పో. నా కౌగిట్లో కరిగిపో. నిన్ను కాలు క్రింద మోపనివ్వను ఈ దారిద్ర్యంలో నువ్వు యెన్నాళ్ళు బాధ పడతావు? నాతోరా బొంబాయి, కలకత్తా' తల విదిలించి చెవులు మూసుకుంది కానీ ఆ మాటలు ఈటెల్లా హృదయ కుహరంలోకి దూసుకుపోయి అక్కడ వటి వృక్షంగా పాతుకుపోతున్నాయి అవి శాఖోప శాఖలుగా గిరి నలువైపులా వ్యాపించి రక్తనాళాల గుండా శరీరం అంతా పాకి ముద్దలా పేరుకు పోతున్నాయి విడదీసేందుకు వీల్లేకుండా. సుభద్ర అవహోయంగా చూస్తోంది. ఆ పురుష స్పర్శలో తీయదనాన్ని తను మరీమరీ గుర్తుకు తెచ్చుకుంటూంటే వొంట్లో నిస్సత్తువ వ్యాపించి తను కూపంలోకి కుదించుకుపోతున్నట్లు నిస్సహాయురాలిగా వుండి పోయింది ఆ ఘడియ మరుపుకు రావడం లేదు.

* * *

బట్టూ దిగి లోపలికి వచ్చి అన్నాడు శ్రీనివాస్: 'నన్ను క్షమించాలి పిన్నీ. మిమ్మల్ని మరిచి పోయానని సరస్వతి యేమేమో అంటోంది. నిజం చెప్పాలంటే ఆయన నన్ను కదల నిచ్చేరుకాదు', శ్రీనివాస్ కళ్ళల్లో అవధానిగారు మెదిలారు.

శ్రీనివాస్ యింత హఠాత్తుగా రావడం సుభద్రకు అసలు నచ్చలేదు. జగదీశ్ తను ఆ తెల్లవారు ఝామున వచ్చిన సంగతి చెప్పేస్తే?

'మీరు యెలా [illegible] తో [illegible] యీ [illegible] కొంతలో కొంత సంపించ గలిగాను. నన్ను మన్నించండి. ఏం చేయను.'

'నువ్వు యేమీ చేయక్కర్లేదు. [illegible] వరి వొడ్డున ఏం సుఖాలు అనుభవించావో మేము చూడలేదు కదా. దారిద్ర్యం అయితే నువ్వేతూ అనుభవించవచ్చును. ఈ శరీరంలో వోపిక తగ్గిపోయి నేను యిలా మంచానికి అతుక్కుపోయి...దిక్కులేక పడి వుంటే'

'సరస్వతీ' శ్రీనివాస్ కంఠంలో నీళ్ళు గరగరలాడాయి 'నన్ను క్షమించమ్మా నీకు తెలీదు నేను అనుభవించిన సుఖం. దాను దాను మావయ్య దారి చూపించాడు తాడిచెట్టు యెక్కేవాడిని మనం యెంతదూరం యెక్కించగలం?'

'యింక యెంతో కాలం లేదు. రెండు నెలలు. క్షణంలో గడిచేస్తాయి మామయ్యే వుద్యోగం యిప్పిస్తానన్నాడు ఆ రెండు నెలలూ వోపిక పడితే .

'మనం స్వర్గ సుఖాల్లో వోలలాడి పోతాం అంటావు నాకు చాపాలనుందన్నయ్యా,' సరస్వతి భోరున యేడుస్తోంది.

సుభద్రకి దుఃఖం ఆగిందికాదు. 'హెక్కు పెట్టుమీగా యెన్ని జరిగాయని' సరస్వతి రోగిష్ఠి దై పోయింది మందుకి డబ్బులేదు. నేను తేగల్గే స్థితిలో లేను అక్కడికీ జగదీశ్ ని అడిగాను'

శ్రీనివాస్ నెత్తిమీద పిడుగుపడింది ఆ దెబ్బకి అతను స్థాణువై పోయాడు: 'మీరు...ఆ వెధవ దగ్గరకి అప్పుకి వెళ్ళారా పిన్నీ'

సుభద్ర చాలా జాగ్రత్తగా విసిరింది అస్త్రాన్ని సమయం చూసి. సవితి కొడుకు అంటే ఆవిడకు గౌరవంతో బాటు భయం కూడా వున్నదనే మాట అక్షరాలా నిజం. అందుకే పిలుపూపి నిజం చెప్పేసి మన సుని కడిగేసుకుంది.

'యెవరైనా ఆ స్థితిలో అదే పని చేస్తారు. అభిమానం, ఆత్మగౌరవం అడ్డుపడాలంటే డబ్బు పుష్కలంగా వుండాలి శ్రీనివాస్. నాకూ తెలుసును. నేను ఆ రోజు అలా వెళ్ళి వుండకూడదనే సంగతి.'

'మరి యిప్పుడా?'

'లేదు!'

## రచయితలకు మనవి

మా కార్యాలయం చేరే ప్రతిరచనతోనూ దానిరచయిత గాని, రచయిత్రిగాని అది తమ స్వంతరచనేనని, దేనికీ అనుకరణ కాదని హామీ వ్రాసి పంపాలి. ఇటువంటి హామీలేని రచనలను ప్రచురణకు స్వీకరించలేము.

సంపాదకులు
ఆంధ్రసచిత్రవారపత్రిక

## మొగలి పొదలు

'ఏందుకని?'

'వివరిస్తే తెలుస్తాయి అంతరంగాలు.'

'ఆ సంగతి తెలిపి మీరు వెళ్ళడం బాగు లేదు. యింక అటువంటి పని చేయకండి'

'నువ్వు ఆ అవసరం రానివ్వకు,' సుభద్ర ఆశ్చర్యపోయింది, తనేనా యిన్ని మాటలు అనగల్గింది?

శ్రీనివాస్ నిశ్చలంగా విన్నాడు. తప్పు తనదే అయినపుడు 'కా'దన గలిగే ధైర్యం అతనిలో లేకపోయింది. అంతే సరస్వతి మంచంమీద కూర్చొని చాలా సేపు మాట్లాడి బయటికి నడిచాడు. అప్పుడే అంది సుభద్ర. సరస్వతి మానసికంగా దిగజారి పోవడానికి కారణం శ్రీహరి నీరు పోసి పెంచి పెద్దచేసిన ఆశాలతని పీకి పారేయడం అని. శ్రీనివాస్‌కి ఆ పాల్గొన ఆడ గెందుకు తగిన ఆర్థిక సామర్థ్యత లేక పోయింది.

* * *

సెలవులకి వచ్చిన శ్రీనివాస్ పదిహేను రోజులవరకూ అడుగు బయటకు వేయ లేదు. సుభద్ర ప్రొద్దువే లేచింది మొదలు సరస్వతికి ఉపచర్యలు చేయడం యింటిపని వీటితో ప్రొద్దుని పడమటికి మళ్ళిం చేస్తోంది.

భోజనానికి కూర్చున్న శ్రీనివాస్‌ని చూస్తూంటే సుభద్ర కళ్ళు యికా మధ్య రెప్పవేయడం మానుకున్నాయి అతని విశాల వక్షస్థలం మరో స్త్రీకి అంకితం చేయబడు తుందనే ఊహ యే మాత్రం మెదిలినా సుభద్రలో దాగిన స్త్రీ ఈర్ష్యతో కుంచిం చుకు పోతోంది.

'అన్నం', అప్పుడు పులిక్కి పడుతుంది. పెరట్లో చెంబేలి మొగ్గలతో, పువ్వులతో భూమితో కంటా కృంగుకు పోతోంది. సరస్వతి మంచానికి అతుక్కుపోయింది బల్లిలా 'ఐశ్వర్య వంతులకి కేటాయిస్తే బాగుండి పోయేది ఈ రోగాలు. ఈ దారి ద్ర్యంలో నాకు టి. బి. యేమిటి పిన్నీ', అని యేడుస్తూంటే సుభద్ర వోదారు స్తుంది జాలిపడుతూ.

పూలన్నిటినీ కోసి మూలగా చేర్చి పదే పదే చూస్తున్న సుభద్రని చూస్తుంటే సరస్వతి బాధపడింది. చేత్తో సైగచేసి దగ్గరకి పిలిచి చాలా రహస్యంగా అంది. క్షణం యింట్లో మూడోమనిషి లేరు పిన్నీ. నిన్ను చూస్తూంటే జాలివేస్తోంది. యెవరూ చూడరు పెట్టుకో.'

సుభద్ర చిత్రంగా చూసింది.

'నేను తమాషా చేయడంలేదు. నీకు నాన్న తిలకం దిద్దలేదు. అయినేమీ నీకు పూలు తురుమలేదు అది మనం పుట్టు కతో తెచ్చుకున్న సౌభాగ్యం నాకు నలు గురూ అనే ఈ భేషజం మాటలు వట్టి గాలికబుర్లే అనిపిస్తాయి. దేవుడి మీద ఒట్టువేసుకుని చెబుతున్నాను. నువ్వు పెట్టుకున్నావని నేనేమీ ఆక్షేపించను.'

సరస్వతి కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. 'స్త్రీ'ని సంఘం యింత కఠోరంగా శాసించకూడదు సుభద్ర కోరిక కోరికగా మిగలకూడదు.

సుభద్ర కట్టుబడిపోయింది. తెల్లని చెంబేలిలు తలనిండా ఆక్రమించుకున్నాయి. రాత్రి క్షణంలో పడిపోయింది. పౌర్ణమి పువ్వుపువ్వులాంటి వెన్నెలని ప్రకృతిలో పోలకపోస్తోంది.

శ్రీనివాస్ మల్లె పందెకట్టుకుని బసిమ నేసుకుని వెల్లకిలా పడుకున్నాడు. ఆకాశం మీద రంగురంగుల నీడలుపడి అక్కడ అతనికి రకరకాల ఊహలు పేర్చి పెడు తున్నాయి సుభద్ర దాదాపు రెండుగంటల నుంచీ అక్కడే కిటికీదగ్గర నిల్చుని బయట వెన్నెలనీ, శ్రీనివాస్‌నీ చూస్తోంది. పాతికేళ్ళైనా లేని సుభద్రకి యిప్పుడు విచక్షణాజ్ఞానం పూర్తిగా పోయింది.

'కొడుకు' యెవరో అంటున్నారు.

'నేనేమీ కనలేదు,' కటువుగా అంది.

'అయినా అతనిరక్తం నీలో పురకలు వేస్తోంది.'

'అందువల్ల అన్నాచెల్లెళ్ళం కాలేము.'

'అందుకే అంటున్నాను భార్యాభర్తలు యెందుకు అవకాశం లేదని'

టక్కున అదిమేసింది మనస్సాక్షి, వోడి పోయింది శారీరక చాపల్యానికి.

సుభద్ర అతని ఛాతీమీద చేయివేసి ఆ పెదవులవైపు ఆత్రంగా చూసింది. శ్రీనివాస్ నిశ్చలంగా నిద్రపోతున్నాడు. అవిడ పెదాలు దగ్గరగా చాలా దగ్గరకి వచ్చేశాయి. వేడినిట్టూర్పు రైలుయింజను సెగలా వచ్చేసి అతని ముఖాన్ని మాడ్చే స్తూంటే పులిక్కిపడి లేచాడు శ్రీనివాస్. 'పిన్నీ మీరు ఎంతపని చేశారు.'

'శ్రీనివాస్', సుభద్రగొంతు వొణికింది.

'ఇది చాలా అసంభవం పిన్నీ. మీరు... మీరు యెందుకిలా అయిపోయారు ? మీరు —మీరేనా?' నమ్మలేక పోతున్నాడు.

'నన్ను.. నన్నేం చేయమన్నావు ?'

అతని కంఠం రోళ్ళని బ్రద్దలు చేస్తోంది. 'అట్టే వేషాలు వెయ్యొద్దు యింట్లోకి వెళ్ళండి. మీకు చిన్నతనం తెలియక పోవచ్చును. నేను నాన్నా అమ్మా అనే పదాలకి విలువ యిస్తాను. మీరు నాకు అమ్మలాంటి వారు'

సుభద్ర అహం దెబ్బతింది. 'శ్రీనివాస్ ఈబుద్ధినీకేవున్నట్లైతే తండ్రిమసాన్ని వూరేగుతూంటే చూస్తూ కూర్చొవు ఆ రోజు యేమైపోయింది నీ కొమగతనం ? నేను తల్లిలాంటిదాన్నే', హేళనగా నవ్వింది. 'మీ నాన్న యింకో పదేళ్ళు బ్రతికి నాకంటే కూడా అయిదారేళ్ళ చిన్నపిల్లను చేసుకుని వుంటే ఆపిల్ల నీకు తల్లే అయేది, నా యీడువారు అమ్మమ్మలూ అయేవారు'

'పిన్నీ'

'మీకు కావలసింది యింటి చాకిరీ చేసేందుకు పనిమనిషి మీ నాన్నలాంటి వాళ్ళకి గౌరవంగా కలిసివచ్చే మనుషులం మేము. మా గురించి మీకు అవసరంలేదు. యిన్నేళ్ళూ నా బాధ మీరు వొక్కరు—మీలో వొక్కరైనా గ్రహించారా ! మీ నాన్న నన్ను పేరుకు పెళ్ళిచేసుకున్నారు తరువాత యేమనుకున్నారో..

'క్షమించండి పిన్నీ ఈ రాత్రివేళ మనం యిద్దరం యిలా తర్కించుకుంటూ వుంటే నలుగురూ నాలుగు మాటలు అంటారు. నన్ను వదులనివ్వండి !' శ్రీనివాస్‌కి వాదనకి దిగడం యిష్టంలేక పోయింది.

'నీయిష్టం అదే అయితే సరే!' సుభద్రలో ఆరని అగ్నిజ్వాలలు బయలుదేరుతున్నాయి. వాటిసెగలూ, పొగలూ తనను తానే కాకుండా చుట్టుపక్కలకి ప్రాకించేసి దగ్ధం చేస్తున్నాయి వాటిని తప్పించుకుని శ్రీనివాస్ బయటికి వెళ్ళిపోయాడు వైళ్ళు దాటేసి.

'ఆ రోజు యిస్తానన్న డబ్బు యివాళ యివ్వు జగదీశ్. నేను వెళ్ళిపోవాలి !' సుభద్ర అంతకంతకు పాతాళంలోకి జారిపోతోంది, రాలి ఆకు పండిపోయి, పండిపోయి, గాలికి దొర్లిపోయి నశ్చిపోయి కలిసిపోయినట్లు.

'యిందు,' జగదీశ్ అందిస్తూనే సుభద్రని దగ్గరకి తీసుకున్నాడు. సుభద్ర కన్నకలలు రూపం దాల్చాయి. అతని విశాల వక్షస్థలంమీద తలవుంచి అతను అన్న రకరకాల మాటలని మననం చేసుకుంటోంది. ఆవిడ పెదవుల్లో అమృతం అతను జార విడుచుకోవడంలేదు. ఆకలి గొన్న పులిలా వున్నాడు.

సుభద్రకిక నిశ్చింత. రోగిష్ఠి సరస్వతి మంచం దిగలేదు పాపిష్ఠి శ్రీనివాస్ తన దారికి అడ్డంగాలేదు.

సుభద్ర మైమరచి యేమేమో అడుగుతోంది. అతను అందుకు తగిన విధంగా సమాధానాలు యిస్తున్నాడు. సుభద్ర తను పొందలేని సుఖాన్ని పురుషుడినుంచి కోరుకుంటూ కోరుకుంటూనే అపాత్రుడికి దానం చేసింది. తెలివి వొచ్చాక దిక్కులు బ్రద్దలయ్యేలా యేడుస్తోంది. జగదీశ్ విసిరిన పదిరూపాయలు గాలికి రెప రెప లాడుతూంటే కడుపులో ఆకలి బాధకు తట్టుకోలేక సుభద్ర కొంగులో ముడేసుకుని పైటచెంగు అడ్డంగా మొల పక్కకి దోపుకుంది,

'డబ్బు కావాలంటే నీకు నేను వున్నాను. నువ్వు అనవసరంగా యేడవకు. అన్నిటికీ నేను వున్నాను', అతని మాటలకి పెన్నెత్తి జవాబు యివ్వలేదు. నలుగురూ చూడకుండానే పట్నంలో కాలుపెట్టింది.'

'మందుతీసుకో సరస్వతీ', సుభద్ర అందిస్తూంటే సరస్వతి అటుతిరిగి అంది. వొద్దు పిన్నీ. నన్ను చావనివ్వు, చాలు. నింక యెంతోకాలం బ్రతకను. మందుల కోసం చేసే ఖర్చు యింక దేనికైనా పెడితే లక్షణంగా బ్రతికేయవచ్చును'

'యివాళే పంపాడు శ్రీనివాస్. ఈ యాభై చాలు. నీ ఆరోగ్యం తరువాతే మిగతా అన్నీ'

'అన్నయ్యా', సరస్వతి కనురెప్పలు ముడేసింది. మనకి యాభై పంపాడు. నన్ను లేకుండా వున్నాను. పోనీ రసీదు చూపించు పిన్నీ మనియార్డరు ది. దేనికోసం పంపాడో యేమిటో ?'

'నీకు ఆరోగ్యం బాగులేదని తెలిసిన మనిషి దేనికి పంపుతాడు? నీ పిచ్చిగాని'

'నేను నమ్మలేను పిన్నీ. అన్నయ్య వుద్యోగం చేస్తూంటే అది వేరేమాట. వాడు హఠాత్తుగా వచ్చేసి అడుగుతే మనం యెక్కణ్ణుంచి తేగలం. నాకు యేమీ వొద్దు. నన్ను విసిగించకు', సరస్వతి మంచంమీద వుందికానీ నిజానికి అన్నీ సంగతులూ చెవిని పడుతూనే వున్నాయి. తూరుపురేఖలు తెల్లబడకముందే వెళ్ళి



# మొగలి పొదలు

అంతలోనే నవ్వేసి సుభద్ర దేనికి జాలి అయిపోతోంది? నలుగురు చేత సరస్వతికి విపులంగా చెప్పేస్తే అర్థం చేసుకోలేనంత అవివేకి కాదు. సుభద్రని వారించేందుకుగానీ, అడిగేందుకు గానీ సిగ్గుపడింది. ఆ సుభద్రలో యే పిశాచం ఆవహించిందో అర్థంగాక వెర్రిదానిలా మంచానికి అతుక్కుపోయింది. ఆ పాపిష్టి డబ్బును తనుమాత్రం వుపయోగించుకోకూడదన్న వుద్దేశ్యంతో తన గుండెల్లోనే దాచుకుంది ఆ రహస్యాన్ని.

తను వొక్కతే ఆ డబ్బుతో బ్రతకాలనే వుద్దేశ్యం సుభద్రకి యేనాడూ లేదు. కోరికలు త్రాచుల్లా పగపట్టి కాటు వేస్తూంటే వాటికి దూరంగా పారిపోలేకపోయింది. ఆ కాటుకి బూడిదై, మసై, మసైపోయింది. అంతర్గతంగా సుభద్ర రెండు భాగాలుగా విడిపోతోంది యెప్పటికప్పుడు. మంచీ చెడూ చెరో పక్కగా నిల్చుని వాగ్వివాదం ప్రారంభిస్తాయి. ఒక్కొక్కసారి ఈ కలహంలో 'మతి' పోదు కదా అనుకుంటూనే వుంటుంది.

'మనం స్వతంత్రులం. ఒకసారి జరిగిందేదో దాన్ని బ్రతికినన్నాళ్ళూ అనుభవించాలి తప్పదు. తప్పుడు గుర్తుల్లో సుఖం లేదు. నీతిగా బతికే బ్రతుకులో నీ పూర్తి మనశ్శాంతి వుంది.'

'ఛస్! అవన్నీ సిద్ధాంతాలు. మునిమేపి ముక్కు మూసుకుని అడవుల్లో వుంటూ కందమూలాలు తిని బతకడం లేదు ఈ జీవితాన్ని సన్యాసుల్లా దొర్లించేందుకు. నావల్ల కాదు. నేనేం చేయను? నన్ను ఈ కోరికలు సర్వనాశనం చేస్తున్నాయి.'

'ఆ సంగతి నీ భర్త వుండగానే గ్రహించావు గుర్తులేదూ. అప్పుడే అతని సమక్షంలో వొప్పేసుకుంటే క్షమించేవాడేమో'

'అదెలా సాధ్యం?'

'ఎందుకు కాదు? నీ భర్త అతను. నిన్ను అర్థం చేసుకున్నాడేమో వొకసారి గుర్తుకు తెచ్చుకో.'

'లేదు అలా ఏం జరగలేదు'

'అబద్ధం. నువ్వు ఏదిచేసినా తనకు యిష్టం అన్న మనిషి నిన్ను అర్థం చేసుకోలేదనే అంటావా?'

'నువ్వు అన్నది నిజమే కానీ ఆయన దగ్గర నోరెత్తేందుకే ధైర్యం లేకపోయింది నాకు. ఆయన వచ్చిపోయినా, నేను జగదీశ్‌ని చేసుకున్నానని తెలుస్తే నొప్పుకుండా తృప్తిపడతారు.'

నవ్వింది అంతరాత్మ చాలా చిత్రంగా 'పిచ్చి సుభద్రా! జగదీశ్ నీలో యేంచూసి చేసుకుంటాడు? అయినా అతన్ని అడిగి కనుక్కో నిన్ను చేసుకునేది లేనిదీ. అతను మనిషి నీకన్నా మామూలు మనిషి మగవాడోయ్ సుభద్రా అతను మగవాడు. తుమ్మెద యెప్పుడూ ఆలోచించదు పువ్వు భారంగా వొంగి ఫలానికి లొంగిపోతోందనీ, రెక్కలు పోగొట్టుకుని భూమిలో కలిసిపోతోందనీ.'

'నన్ను భయపెడుతున్నావు అనవసరంగా. అతను స్పష్టంగా చెప్పాడు. నన్ను పెళ్లి చేసుకుంటానని!'

'అదే అక్కడే పొరబడుతున్నావు సుభద్రా! అతను నీలో యేంచూసి చేసుకుంటాడు?'

'అతను బాగా చదువుకున్న ఇంజనీరు. అతనికివున్న సంస్కారం మామూలు మనిషికి లేదు!'

'వెర్రిదానా! మామూలు మనుషులే ఆలోచిస్తారు పాపపుణ్యాలు. చదువుకున్నవాళ్లు విజ్ఞానాన్ని ఆకళించుకుని దేవుణ్ణి, మరి దేనికో ముడిపెట్టి దేవుడు మిథ్య, పాపపుణ్యాలు మిథ్య అనేసి వొళ్ళు దులుపుకుంటారు. ఇంజనీరు అంటున్నావు. అతను మాత్రం, తన గృహ ప్రాంగణానికి వేసినంత దిట్టమైన పునాది మరో యింటికి వేయడోయ్! నీ నమ్మకం చూస్తే జాలి వేస్తోంది. అదే నిజమైతే నీ అదృష్టం పండింది. నిన్ను అభినందిస్తున్నాను. చేసిన పని సరిదిద్దుకో. వెంటనే ఆ ప్రయత్నంతో వుండు పో. కదులు. వెళ్ళు.'

'సరస్వతి?' బేలగా అంది సుభద్ర

'అవి బంధాలు మార్గం వెతికావు. కదులు ముందుకి నీకూ ఈ యింటికీ జగదీశ్‌తో సంబంధం కలిసిన రోజునే, ఆ క్షణానే తెగిపోయాయి సంబంధాలు'

'అయితే నాకు పిల్లలు యేమీ కారా?'

'ఎలా అవుతారు? నీకు యిక్కడ వుండేందుకే అర్హతలు లేవు సుభద్రా. వాళ్ళు నీతోటి మనుషులు అంతే.'

'సరస్వతి, శ్రీనివాస్ లేకుండా నేనెలా బ్రతకగలను?'

'జగదీశ్ వుంటాడు కదా'

'అతన్ని ఎలా నమ్మడం?' సుభద్ర కళ్ళల్లో నీళ్ళు సుళ్ళు తిరుగుతూ చెంపలు తడుపుతున్నాయి.

'చూశావా! నీకే నమ్మకంలేదు అతని మీద. న్యాయానికీ; నీతికీ కట్టుబడి బ్రతకాలి సుభద్రా సంసారాన్ని పాడుచేయడం కాదు మన పని'

'అయ్యో నేను యేమైపోను? నాకు యిప్పుడు ఏది దారి?' సుభద్ర నిలువునా నీరైపోయింది. పక్కమీద సరస్వతి గాఢ నిద్రలో మునిగిపోయింది. సుభద్ర గది గుమ్మం దాటి రెండేసిమెట్లు వొక్కొక్కసారి దాటేస్తూ జగదీశ్ గదివైపు పరుగులు పెడుతోంది. (ఇంకా ఉంది)





ఎవరిపనులు వారు చేస్తూవుంటే ప్రజ లందరికీ సుఖం కలుగుతుంది. ఎలాంటి సమస్యలూ తలయెత్తవు. అంచేతే మన ప్రాచీన స్మృతికర్తలు కొన్నిపనులు కొందరికి ఏర్పాటు చేశారు. తాము చెయ్యవలసిన దాన్ని బాధ్యతతో నెరవేర్చడమే స్వధర్మ నిర్వహణ అన్నారు తమపనులు తాము చేస్తున్నప్పుడు ప్రాణాపాయం వచ్చినా జంకకూడదనీ, ఇతరుల ధర్మాలజోలికి పోవడం భీతినే కలిగిస్తుందనీ 'స్వధర్మే నిధనం శ్రేయః, పరధర్మో భయావహః' అనే వాక్యమే తెలియజేస్తూ ఉన్నది

ఈ ఉద్దేశంతోనే వివిధ వృత్తులకు వేర్వేరు జాతులు నియమించబడ్డాయి అందువల్లనే చాతుర్వర్ణ్య వ్యవస్థ ఏర్పడింది. వృత్తుల్లో ఎక్కువ తక్కువ భేదాలు లేవు ఆ వృత్తులను నిర్వహిస్తున్న జాతుల్లో కూడా ఎక్కువ తక్కువలు లేవు ఆ భేదాన్ని పాటించే వారెవరైనావుంటే వారికి యీ తత్త్వం అవగాహన కాలేదన్నమాట !

కర్షకుడు కృషి చెయ్యకపోయినా, కార్మికుడు వస్తూత్పత్తిని విడిచినా, తక్కినవాళ్ళు తమతమ విహిత కృత్యాలను నెరవేర్చకపోయినా జనుల నిత్యజీవితం స్తంభించి పోతుంది క్షత్రియుడు స్వధర్మాన్ని నిర్వహించాలని బోధిస్తూ భగవానుడు అర్జునుడిని యుద్ధానికి ప్రోత్సహించాడుగదా !

దేశం భవిష్యత్తు విద్యార్థులమీద ఆధారపడి వుంది. వీరు శ్రద్ధగా విద్యాభ్యాసం చేసి, ఆయా విషయాల్లో విజ్ఞానాన్ని సంపాదించి, తమ విజ్ఞానాన్ని దేశాభ్యున్నతికి వినియోగిస్తేనే దేశం బాగుపడుతుంది. విద్యా సముపార్జన సమయంలో ఏకాగ్రత ఉండాలి. తతిమ్మా విషయాల్లో జోక్యం కలగజేసుకుంటే విద్యాభ్యాసం కుంటుపడి పోతుంది.

1930 లో జాతీయోద్యమం చాలా ముమ్మరంగా ఉండే రోజులు జూలైనెల రెండోవారంలో కాశీ విశ్వవిద్యాలయం వేసవి సెలవులకి తర్వాత తెరవబడింది. కాని వారంరోజులు గడిచేసరికి రాజకీయ నాయకుల ప్రోద్బలంవల్ల విద్యార్థులు కొందరు అధ్యాపకులను లోపలికి రాకుండా అడ్డగించారు. కాలేజీ భవనాల మెట్లమైని కొందరు వలంటీర్లు పడుకొన్నారు. చొరవ చేసుకుని లోపలికి వెళ్ళడానికి కూడా అవకాశం యివ్వలేదు. ఇలా నెలరోజులకు పైగా గడిచింది. తర్వాత ఒకరోజు జాతీయోద్యమ ప్రచారం కోసం మాన్యులు విఠల్ భాయి పటేలుగారు వచ్చారు.

శివాజీ హాలులో పెద్దసభకు ఏర్పాటు జరిగింది. మాళవ్యాగారు అధ్యక్షత వహించారు. పటేలుగారు జనరంజకంగా పెద్ద ఉపన్యాసం యిచ్చారు విద్యార్థులు చదువులుమాని రాజకీయాల్లో పాల్గొనాలనీ, లేకపోతే స్వతంత్ర భారతంలో వారికి అప్రతిష్ఠ అనీ హెచ్చరించారు.

అధ్యక్షత వహించిన మాళవ్యా పండితులు విద్యార్థులకు విద్య ముఖ్యమనీ, విద్యాభ్యాసం చేస్తున్న సమయంలో ఇతర విషయాల్లో జోక్యం కూడదనీ, విజ్ఞానం సంపాదించాక తమ యిచ్చవచ్చిన రీతిలో దేశాభ్యున్నతికి పాటుపడాలని సంగ్రహంగా బోధించారు.

ఆ మర్నాటినుంచీ కాలేజీలు సక్రమంగా జరగడం ప్రారంభమయింది. ఉద్రేకం వున్న ఏ కొద్దిమంది మాత్రమే కాలేజీలకు రావడంలేదు.

చదువుకొంటున్న కాలంలో చదువుకు స్వస్తిచెప్పి ఇతరరంగాల్లో ఉద్రేక పూరిత హృదయంతో ప్రవేశించినవారి భవిష్యత్తు—ఎక్కువమందిది కష్టపూరితంగనే కనబడుతున్నది. ●






అనుకోకుండా నాంపల్లి స్టేషనులో నిర్మల కనబడింది. మొదట్లో నేను గుర్తు పట్టలేకపోయాను. మనిషి కొంచెం లావయింది. ముఖంలో మునుపటి మార్దవానికి బదులు, ఇప్పుడు వయసు తెచ్చిన గాంభీర్యం ఆమెకు అదొక రకమైన వింత ఆకర్షణ తెచ్చిపెట్టింది.

నేను వెనకాడటం చూసి ఆమే నవ్వుతూ పలకరించింది 'బావున్నావా?' అని. బాగానే ఉన్నానన్నట్లు తలూపి 'ఇదేమిటే, ఇక్కడ ప్రత్యక్షమైనావని' అడిగాను.

'చిక్కడపల్లిలో మా కజిన్ మ్యారేజికొచ్చాను. ఇప్పుడు ఇంటికి వెళ్తున్నాను'

'కర్నూలులోనే ఉంటున్నారా?'

'లేదు. మావారికి ప్రమోషన్ మీద గుంటూరుకు ట్రాన్స్‌ఫరై ఏడాదయింది. బ్రాంచి మేనేజరుగా పని చేస్తున్నారు'

'పెళ్లికి ఎలాగూ పిలవలేదు. ఇప్పుడైనా చూపిస్తావా మీ ఆయన్ని?'

'సారీ, ఆయన రాలేదు. ఒక్కదాన్నే వచ్చాను.'

ఆ తర్వాత అందరి ఆడవాళ్లలాగానే నిర్మల గూడా వాళ్లాయన్ని గూర్చి కాసేపు స్తోత్రం చదివింది. ఆయన అందరిలాంటివాడు కాదుట ఆవిణ్ణి విడిచి ఒక్క క్షణం గూడా ఉండలేడుట. (ఎవరైనా అంతే అందామని అనిపించింది) ఈ నాలుగు రోజులు నుంచి ఏం బాధపడి పోతున్నారో అని ఆయన్ని తల్చుకుని బాధపడింది.

నిర్మల అదంతా నాతో ఎందుకు చెబుతున్నదో అర్థం చేసుకోగలను. నన్ను పూర్తిగా మర్చిపోయినానని పరోక్షంగా

నాకు తెలియజెయ్యటానికే, వాళ్ళయన్ని ఆకాశానికెత్తేస్తోంది.

నిర్మల, వాసు, నేను, ముగ్గురం క్లాస్ మేట్స్‌ం. అప్పట్లో చదువుతోపాటు మిగిలిన కార్యకలాపాల్లో గూడా, మేం ముగ్గురం మిగిలిన వాళ్ళందరి కన్నా కాస్త ముందుండే వాళ్ళం అందువల్ల మా ముగ్గురిదీ ఒక 'యూనిట్'. క్రమంగా ఆత్మీయత పెరిగింది. చనువు గూడా ఏర్పడింది. ఒక ఏడాది గడిచేటప్పటికి ఆ చనువు వాళ్ళిద్దరి మధ్యా మరో రూపం దాల్చింది.

నిర్భయంగా సినిమాలకీ, షికార్లకీ జంటగా తిరగటం, రూంలో ఇద్దరూ కూర్చుని గంటలకొద్దీ బాతాఖానీ కొట్టుకోవటం లాంటివి, మిగిలిన స్టూడెంట్సు, లెక్చెరర్ల దృష్టిలోకూడా పడ్డయి అసలు ఇలాంటివి గోప్యంగా సాగించుకోవాలని వాళ్ళ అనుకున్నట్లు లేదు.

ఆ మైకంలో వాళ్ళకు వొళ్ళుతెలియక పోవచ్చుగాని, కోతి మూకలాంటి స్టూడెంట్స్ తల్చుకుంటే వాళ్ళని అల్లరిపాలు చెయ్యటం ఖాయం. ఈమాటే ఒకటి రెండుసార్లు చూచాయగా అంటే ఇద్దరూ చెరోక వైపునుంచి నామీద విరుచుకుపడ్డారు. ఆనాడు వాళ్ళ అన్నమాటలు ఇప్పటికీ నా చెవుల్లో గింగురుమంటూనే ఉన్నయి.

'మేం అన్యోన్యంగా ఉంటే, ఆత్మీయుడవైన నువ్వు, మా జంటనుచూసి హర్షిస్తావనుకున్నానుగాని, రాళ్ళురువ్వే వాళ్ళలో మొదటివాడివి నువ్వేనని అనుకోలేదు' అన్నది నిర్మల.

ఇహ వాడు 'మేం ప్రేమించుకుంటున్నాం. చదువు పూర్తయ్యాక పెళ్ళి చేసుకుంటాం. ఎవడెలా ఏడ్చి చచ్చినా ఇది జరిగితీరుతుంది' అన్నాడు.

నేను చెప్పింది వాళ్ళ సరిగ్గా అర్థం చేసుకోలేదుగాని, నాకుమాత్రం అంతకంటే కావాల్సిందేముంది ? వీళ్ళకా ధైర్యాన్ని సడలకుండా చూడమని ఆనాడు నిండుమనసుతో భగవంతుణ్ణి ప్రార్థించానని వీళ్ళిద్దరికీ తెలియదు.

చదువులు పూర్తయినయి. ఎటువాళ్ళం అటు వెళ్ళిపొయ్యాం. తర్వాత నిర్మలకు పెళ్ళయిందని తెల్సింది కానీ వాసును మాత్రం చేస్కుకోలేదు. కారణం నాకు తెలియలేదు. నాసుకు రాసినా సమాధానం రాలేదు.

ఇన్నాళ్ళతర్వాత ఇప్పుడు నిర్మల కనబడింది. పెళ్ళయ్యాకగూడా పాత స్నేహితుణ్ణి గుర్తుపట్టి తనే ముందు పలకరించింది అదే ఒక విశేషం.

రైలు ప్లాట్‌ఫారంమీద కొచ్చింది సెకండ్ క్లాసు కంపార్టుమెంటులో కూర్చుంది. నేను కిటికీదగ్గర నిలబడ్డాను.

'ఇందాకటినుంచి నేనే వసపిట్టలా వాగానుగాని నువ్వు నోరు విప్పనేలేదు. ఇంతకీ నీపెళ్ళి అయిందా?'

'లేదు'

'ఏం? ఆడపిల్ల లెవరూ నచ్చలేదా?' అంటూ నవ్వింది.

'ఏదీ, ఇంకా వేట మొదలుపెట్టలేదు. ఆఫనిమీదే వచ్చే ఆదివారం పూరికెడుతున్నాను. రిజర్వేషనుకనే ఇటొచ్చాను.'

'ఎన్నివేలమీద ఉంది పాట?'

'ఇంతవిలేదు. ఎవరు ఎక్కువపాడితే వాళ్ళకే కొట్టేస్తాను.'

'పిల్ల ఎలా ఉన్నా సరేనా ?'

'పిల్ల లేకపోయినా ఫరవాలేదు.'

నవ్వింది- 'నీ చిలిపితనం ఇంకా పోలేదు, కృష్ణా'

నిర్మల దగ్గర నాకెంత చనువు ఉన్నప్పటికీ, వివాహమైపోయి గుట్టుగా కాపరం చేసుకుంటున్న ఆమెను 'నువ్వు వాసును ఎందుకు చేసుకోలేదు?' అని అడగటానికి మనసు ఒప్పుకోవటంలేదు. ఊరుకోవటానికి అంతకన్నా ఇష్టంలేదు. ఇలా ఒంటరిగా కల్సుకునే అవకాశం మళ్ళీ రాదుగూడా.

రైలు బయలుదేరటానికి టైం అయిందేమో గంటకొట్టారు. ఇంజను పొగ వొదులుతున్నది. జనం రద్దీతో పాటు కాఫీ, టిఫిన్లు అమ్మే కుర్రవాళ్ళ కేకలు గూడా ఎక్కువయినయి. నాలుగు ఆపిల్ పండ్లు కొని నిర్మలకు అందించాను.

'దేనికివి ?'

'తింటానికి'

'బావుంది సమాధానం' నాచేతిలోని పండ్లు తీసుకుని పక్కనున్న సూట్‌కేసు మీద పెట్టింది.

'నువు వచ్చినట్లుగా ముందుగా తెలియదు. లేకపోతే మా ఇంట్లో ఒక పూటన్నా చెయ్యి కడుక్కోండే వెళ్ళనిచ్చే వాణ్ణి కాదు'

'నువ్వు శక్రటేరియేట్‌లో పనిచేస్తున్నావని తెల్సుగాని, ఆ మహాసముద్రంలో నిన్ను వెతికి పట్టుకోవటం సాధ్యమవుతుందా?'

'నేను ఇక్కడ పనిచేస్తున్నట్లు ఎలా తెల్సు ?'

'గుంటూరొచ్చాకే నమకుంటాను ఒకసారి సంగమేశ్వరరావు కనిపించి చెప్పాడు.'

'అన్నట్లు వాసు సంగతులేమైనా తెలుసున్నయా నీకు ?' చివరకు ఉండబట్టలేక అడిగేశాను: వాసుపేరు వినగానే ఆమె ముహంలో రంగులు మారటం గమనించాను.

'అబ్బే, నాకేం తెలియదే' మామూలుగానే కనిపించాలని బలవంతాన నవ్వు తెచ్చుకోవటానికి ప్రయత్నంచేసి విఫలమైంది.

'బొంబేలో ఉంటున్నాడు. అడపాదడపా నాకు ఉత్తరాలు రాస్తూనే ఉన్నాడు'

చేతిగాజుల్ని లెక్కపెట్టుకుంటూ కొన్ని క్షణాలు మౌనం వహించి, తర్వాత ఏమాత్రం కుతూహలం లేనట్లు చాలా నిర్లిప్తంగా అడిగింది 'ఏం చేస్తున్నాడటా?' అని.

'ఆటమిక్ ఎనర్జీతో పనిచేస్తున్నాడు'

చాలాసేపు ఆమె ఏమీ మాట్లాడలేదు. అంతటితో ఆ ప్రసంగం ఆగిపొయ్యేదే గాని, నేను ఆమె దగ్గరనుంచి కొంత రూపే లాగాలని సంభాషణ సాగించాను.

'వాడికీ పెళ్ళికాలేదు ... అలాగే ఉండిపోతా నంటున్నాడు.'

నిష్టూరంగా ఉన్న ఆ మాటలకు కష్టం తోచిందేమో, చటుక్కున తలెత్తి క్షణకాలంపాటు నా కళ్ళల్లోకి చూసింది. ఏదో చెప్పబోయి ఆగిపోయింది. కొంత నిముషాలుండి, తనే మొదలుపెట్టింది.

'ఏ పరిస్థితుల్లో నేను అతన్ని చేసుకోలేక పోయినానో ఎవరికీ అర్థంకాదు. అతనే అర్థం చేసుకోలేదు. పైగా నన్ను నాశనం చెయ్యాలని చూశాడు.'

'ఏం చేశాడు ?'

'తెలిసీ తెలియని స్థితిలో నే నతనికి రాసిన ఉత్తరాలన్నీ కట్టగట్టి సరదాగా రోజుల పండగ వెళ్ళకముందే మా ఆయన పేరు పార్సెలు చేశాడు. భార్య అలాంటి

పని చేసిందని తెలిస్తే పరువుగల మగవాడు ఎవడైనా ఏం చేస్తాడు కృష్ణా ? నా సంసారంలో నిప్పులు పొయ్యాలనేగా అతనీ పని చేసింది ?'

నేనేమీ జవాబు చెప్పలేక వూరుకున్నాను. వాసు ఇంత దౌర్భాగ్యపు పని చేశాడంటే ఒక పక్కనుంచి నమ్మలేక పోతున్నాను.

'నా అదృష్టం తిన్నగా ఉండబట్టి ఆయన నా మాటలు నమ్మారు గాని లేక పోతే ఈ నాడు నిర్మల నీకిలా కనబడేది కాదు' ఆమె గొంతులో దుఃఖం సుళ్ళు తిరిగింది.

'ఛ, ఛ, ఆ వేం మాటలు, ఊరుకో నిర్మలా...ఆయామ్ సారీ. అనవసరంగా ఇదంతా గుర్తుచేశాను.'

'దాని దేమిటిగాని, పెళ్లిచేసుకోకుండా, అలాగే ఉండిపోతే, అందరూ ఆయన్ని చూసి జాలిపడాలటనా ?'

'......................'

'బతికిన నాలుగురోజులూ నవ్వుతూ గడిపెయ్యాలిగాని, ఏడుస్తూ, ఎదటి వాళ్ళని ఏడిపిస్తూ బతకడం ప్రయోజకత్వం కాదు. ఏమంటావ్ ?'

'నిజం ?'

రైలు గట్టిగా కూతపెట్టి, బలాన్నంతా పుంజుకుని, బరువుగా కదిలింది.

'వస్తాను మరి' నవ్వుతూ చెయ్యి ఊపింది.

# అంతఃకరణ

'విష్ యు ఫీర్ ఫరెవర్'

'థాంక్యూ'

రైలు వెళ్ళిపోయింది. నేను వచ్చే ఆదివారానికి బెర్త్ రిజర్వు చేయించుకుని స్టేషనులో నుంచి బయటకు వొచ్చాను.

నిర్మల చెప్పింది ఎంతవరకు నిజమా అన్నప్రశ్నే నా మనసులో మెదులుతున్నది. చదువుకున్నవాడు, సంస్కారం ఉన్నవాడు, ఎంతో వివేకంతో ప్రతిదీ ఆలోచించేవాడూ, వాడే ఇలాంటి పనిచేస్తాడా ? ఏమో, తనకు కాకుండా పోయిందన్న కసికొద్దీ ఈ బ్రహ్మాస్త్రం వేశాడేమో? లేకపోతే నిర్మల తనకై తాను అలాంటి అబద్ధాన్ని కల్పించి చెప్పాల్సిన అవసరంలేదు.

మర్నాడు మధ్యాహ్నం ఆఫీసులో ఎంతో బిజీగా ఉన్నప్పుడు టెలిఫోను వచ్చింది. తీరా చూస్తే వాసు. ఫలానా హోటల్లో దిగాను రమ్మనమని చెప్పాడు. ఎక్కడపని అక్కడ వదిలేసి వెళ్ళాను. మామూలు పరామర్శలన్నీ అయ్యాక వాడే అన్నాడు.

'మా బ్రాంచి ఆఫీసు ఒకటి పెట్టారు ఇక్కడ, ఆ ఆఫీసులో ఏదోపనుండి క్యాంప్ వచ్చాను.'

'ఎంతసేపయింది వచ్చి'

'నేనొచ్చి నాలుగు రోజులయింది'

'వచ్చిన నాలుగు రోజులకా నాకు ఫోను చెయ్యటం ?'

'ఇంకో ఆఫీసరుతో కల్సివచ్చాను. పొద్దున్నే ఎనిమిదింటికి ఊరిబయట నున్న ఆ ఆఫీసుకు పోవటం, రాత్రి ఎనిమిదింటికి రూంకు రావటం. మధ్యలో ఒకగంట ఉడాయిద్దామని చూస్తే వదిలితేనా ? మధ్యాహ్నం 'ప్లేను'లో బొంబాయి పంపించాను ఆ శనిగాణ్ణి. ఈవినింగు ట్రయినుకు నేను బండెక్కాలి.'

'అఫెరాలించినట్లే ఉంది. ఈ గంట భాగ్యానికి నన్నెందుకు రమ్మన్నట్టు?'

'నువ్వు రాకపోతే, నన్నింత ప్రేమగా తిట్టేవాడెవడున్నాడ్రా, ఈ హైద్రాబాద్‌లో' అన్నాడు నవ్వుతూ నా భుజం మీద చెయ్యివేసి.

'నీకాభయమే ఉంటే, వచ్చేముందు ఉత్తరమే రాసేవాడివి.'

'చెప్పానుగా, నేను ఎలా వచ్చిందీనూ.'

'నాన్సెన్సు, నాకవన్నీ అనవసరం'

'అయితే, ఏమిటంటావురా ఇప్పుడు'

'రెండురోజు లుండిపో. నీకోసం నేనూ శలవు పెట్టేస్తాను. హాయిగా కబుర్లు చెప్పుకుంటూ, తనివితీర తిరుగుదాం'

'అబ్బే, ఈవేళ వెళ్ళకపోతే లాభంలేదు. ఇహనుంచి వొస్తూనే ఉంటాగా'

'ఎప్పుడొచ్చినా ఇంతేగా'

'లేదులే, ఈసారి ముందే లెటరు రాస్తాను.'

కాఫీ, టిఫెన్లు తెప్పించాడు. ఆరగించి, సిగరెట్లు వెలిగించాం. సుతారంగా పొగ వదులుతూ, మంచం మీద వెనక్కివాలి 'ఇహ చెప్పరా, సంగతులు' అన్నాడు.

'ఏమున్నయి. మామూలుగానే గడిచి పోతున్నయి రోజులు'.

'మన పాతస్నేహితులు ఎవరెక్కడున్నారో ఏమన్నా తెల్సా ?'

'నువు తప్ప మిగిలినవాళ్ళు ఎవరు చచ్చారో, ఎవరు బతికారోగూడా నాకు తెలియదు'

'భానుమూర్తి స్టేట్స్‌కు వెళ్ళాట్ట'

'కలవారిపిల్లను చేసుకుంటే, అల్లాంటి కష్టాలు తప్పవు మరి'

'వాడేం కష్టపడటంలేదు. హైద్రాబాద్ బౌండరీలు దాటలేక నువ్వే బాధ పడు తున్నావు'

'నిలువెత్తు ధనంపోసినా, నాకు తెలుగు



'వాళ్ళ మధ్యనున్న స్నేహము మతో పోట రాదురా'

'మై సింపతీస్ ఆర్ విత్ యు'

'ఐ డోంట్ వాంట్ యువర్ బ్లడీ సింపతీస్'

సిగరెట్టు పారేసి, వాచీ చూసుకున్నాడు. 'టైమయిపోతోంది. ఇంక నేను తయారవ్వాలి. కాసేపు సరదాగా మాట్లాడతావని పిలిస్తే, వచ్చి పోట్లాటకు దిగితివి.'

'మరి నేను వచ్చీరాకముందే, నువ్వు వెడుతున్నావని మొదలు పెడితివి'

'చెప్పవలసిన చెప్పేయి ఇంకేమన్నా కబుర్లు'

నిన్న నిర్మల నాంపల్లి స్టేషనులో కనబడిందని చెబితే, వాడు ఉలిక్కి పడతాడని తెల్సు. అయినా అంత సూటిగా చెప్పెయ్యటం నాకు ఇష్టంలేదు. ముందు వాడు చెప్పేదేదో వింటే, తర్వాత చెప్పాలో, అక్కర్లేదో నిర్ణయించుకోవచ్చు.

'నిర్మల ఏమంటోం దేమిటి ?' చాలా తాపీగా అడిగాను.

'ఏ నిర్మలా ?' అన్నాడు ముహం చిట్లించి, ఆమె ఎవరో తనకు గుర్తు లేనట్లు.

'ఒకనాటి నీ స్నేహితురాలు. సన్నిహితురాలు గూడా.'

'మైగాడ్, ఆవిడ సంగతా ? నువ్వింకా మర్చిపోలేదన్న మాట?'

'అంత తేలిగ్గా మర్చిపొయ్యే పరిచయం కాదే మనది. అసలు మీ రెండుకు పెళ్లి చేసుకోలేదు ? దీనికి సమాధానందొరక్క ఇన్నాళ్లనుంచి చస్తున్నాను'

'దానికి సమాధానం నీకెంత తెల్సో, నాకూ అంతే తెల్సు. ఎప్పుడైనా, ఎక్కడైనా తటస్థపడితే, ఆవిడ్నే అడిగి తెల్సుకుని నాకు వ్రాయి' లేచి నాకు ముహం చాటుచేసి నిలబడ్డాడు.

'అయితే ఆవిడ ఇప్పుడు ఎక్కడుంటున్నదీ గూడా తెలియదా నీకు?'

'ఎక్కడున్నా ఒకటే, ఆవిడ్ని మర్చి




ఇది అమెరికాఖండాల్లో ఉండే విషసర్పం. సుమారు 3, 4 అడుగుల పొడవుఉంటుంది. ఎలకలు, ఉడతలు చుంచులు, పక్షులు దీని ఆహారం. ఎండాకాలంలో విచ్చలవిడిగా తిరిగినా చలికాలంలో రాళ్లల్లో దూరి తలదాచుకొంటాయి—చలి భరించలేక.

అన్నిపాముల్లాగే రేటిల్ పాము కూడా పొరవిడుస్తుంది. అలావిడిచినప్పుడు తోకదగ్గర, ఒక ఖాళీ చక్రం వరాదితిగా నిలిచిపోతుంది. అలా కొన్ని కలిసి "రేటిల్" ఏర్పడుతాయి. పాముకు ఉద్రేకం వచ్చినప్పుడు, ఈరేటిల్‌ను పైకి ఎత్తి, ఆడిస్తుంది. అప్పుడు గలగలా శబ్దం వస్తుంది. ఒకవిధంగా శత్రువులకు ఇది హెచ్చరిక! ఈ రేటిల్, ఆపాము వయసు చెప్పినా పరామరికగా నిర్ధారణకాదు. ఉంగరాలు ఊడిపోవడానికి, ఏడాదికి రెండు మూడు హెచ్చు ఏర్పడడానికి అవకాశం ఉంది.

అమెరికాఖండాలు దాటి ఇలాంటి పాములు కనపడవు. వీటిదగ్గర బంధువులే మనరక్తపింజరి మొదలైనవి.

—జమ్మి కోనేటిరావు

## అంతఃకరణం

పోయి చాలాకాలమయింది' టవలు భుజాన వేసుకుని బాత్‌రూంలోకి వెళ్ళాడు.

వీడి ప్రవర్తన మరీ విడ్డూరంగా ఉంది. ఏదో దాస్తున్నాడనిపిస్తోంది. దీన్నిబట్టి చూస్తే, వీడు నిర్మలమీద పగబట్టినమాట యదార్థమేనని తోస్తున్నది. చివరకు వీళ్ల ప్రణయగాథ ఇలా పరిణమించిందన్న మాట!

లేచి అద్దం దగ్గరకువెళ్లి తల దువ్వుకున్నాను. యాదాలాపంగా డ్రెస్సింగ్ టేబులుమీదనున్న పుస్తకం చేతిలోకి తీసుకున్నాను అకాడమీ ఎవార్డుపొందిన నవల అది. పేజీలు తిరగేశాను. ముందుపేజీలో కలంతో రాసిన మాటలు నా దృష్టిని ఆకర్షించాయి.

'పొందిన వస్తువుమీద ప్రేమ క్రమంగా సన్నగిల్లిపోతుంది. పోగొట్టుకున్నదానికోసం మనసు ఎప్పుడూ పరితపిస్తూనే ఉంటుంది. ఆ పరితాపంతో ప్రేమ పదిరెట్లు పెరుగుతుంది' అని వ్రాసి దాని కింద నిర్మల సంతకం చేసింది. నిన్నటి తారీఖు వేసివుంది.

ఇదెలా సంభవం? నిన్న నిర్మల వీణ్ని కల్సుకుందా?

వాడొస్తున్న చప్పుడువిని, చటుక్కున ఆ పుస్తకం తీసినచోటనే పెట్టి, ఇవతలకొచ్చి నిలబడ్డాను. వాను బొడ్డింగు సర్దుకుంటూ, టేబులుమీద పుస్తకాన్ని తీసే ముందు నావైపు ఒకసారి క్రీగంట చూశాడు. నేనది గమనించనట్లు కిటికీలో నుంచి బయటకు చూస్తున్నాను.

అప్పుడు నాకంతా అర్థమైంది. నిర్మల కేవలం పెళ్లికనే రాలేదు. వాను ఆఫీసు పనిమీదా రాలేదు. ఇక్కడ ఇలా ఒంటరిగా కల్సుకోవాలని ఏర్పాటుచేసుకునే వచ్చారు. ఒకర్నొకరు మర్చిపోయినట్లు లోకానికి భ్రమ కల్గిస్తున్నారుగాని, అంతరాంతరాలలో అనుక్షణం ఒకరి ప్రతిబింబాన్ని మరొకరు చూసుకుంటూనే ఉన్నారు.

నిర్మల పుస్తకంలోరాసిన మాటలు నిజం. పోగొట్టుకున్నదానికోసం మనసు ఎప్పుడూ పరితపిస్తూనే ఉంటుంది. ●




'కొంతకాలం సాగే సరికి పెళ్ళిళ్ళు అన్నీ ఇలాగే తయారవుతాయా?' అడిగింది దమయంతి. 'పన్నాలుగేళ్ళయింది పెళ్ళి అయి. నా వారు ప్రేమగా మాట్లాడ్డం సంగతి దేవు డెరుగు మాట్లాడ్డంకూడా మరిచిపోయినట్లుంది. పైపెచ్చు నేను ఇదివరకు లాగా తనతో ఉండడం లేదనీ ఇదనీ అదనీ సాధిస్తారు! అంతేగాని తమ నాపై శ్రద్ధ తగ్గించిన సంగతి గుర్తించరు. ఎప్పుడో అరుదుగా గాని ఎక్కడికీ కలిసి వెళ్ళం. ఎప్పుడేనా ఒంట్లో బాగుండక పోతే కనీసం ఇప్పుడెలా ఉంది? అనేనా అడగరు (సాధారణంగా మగవాళ్ళందరికీ ఉండే జబ్బే ఇది!...ఒక స్నేహితురాలు ఈ విషయంలో ప్రశ్నిస్తే, 'చూస్తూనే ఉన్నానుగా — బాగుండడం? పైగా అడగడం ఎందుకు? అని అడిగాడా పెద్దమనిషి. ఇంత చిన్న విషయం భార్యకి వీనుగంత ఉత్సాహాన్నిస్తుందన్న చిన్న విజ్ఞాన్ని ఎరుగని పసివాడు!)

పోనీ అని నేనే చెప్తాను 'మీరు మటుకు మారలేదా? ఇదివరలో ఎంత ఉత్సాహంగా ఉండేవారు?' అంటూ మా ఇద్దరికీ సన్నిహితం అయిన సంగతులు జ్ఞాపకం చేసినా, నవ్వేసి ఊరుకోవడమో, నీకేమైనా మతిపోయిందా అన్నట్లు చూడడమో చేస్తారు...శారీరకంగానూ మానసికంగానూ కూడా అసంతృప్తిగా జీవితం గడిచి పోతుంది. ఇంత ఇంతేనా? అసలు అన్ని వివాహాలూ కొంతకాలం సాగితే ఇలాగే గానుగెద్దు జీవితాల్లాగా తయారై పోతాయా?' అంటుంది దమయంతి.

దమయంతి కొత్తగా కనిపెట్టిన లోటు—ప్రతి వివాహంలోనూ ఏర్పడేది. వివాహపు పునాదులను సహితం ఒకొక్కప్పుడు కదలించి వదిలే స్తబ్ధత—ఉత్సాహం, నెచ్చదనం లేమి, అన్నీకూడా—మగవాడు తన ప్రేమను, అభిమానాన్ని ప్రదర్శించడానికి, ఆడది ప్రదర్శించడానికి ఉన్న విపరీతమైన భిన్నత్వాన్ని చూపుతుంది. క్లుప్తంగా చెప్పాలంటే—పురుషుడు సెక్సు ద్వారా తన ప్రేమని ప్రదర్శిస్తాడు స్త్రీ ప్రేమకు ఫలితంగా మాత్రమే సెక్సుని గుర్తిస్తుంది. ఈ దృక్పథ భేదంవల్లనే సంసారం సాగను సాగను స్త్రీకి నిస్సారం గానూ అసంతృప్తిగానూ తోస్తే పురుషునికి తన భార్యలో ఈ అసంతృప్తికి కారణం ఏమిటో అర్థం కాకుండా పోతుంది. భార్యా భర్తలిద్దరూ ఈ దృక్పథ భేదాన్ని గుర్తించి దానికి తగినట్లు తమ ప్రవర్తన మలచుకుంటే జీవితం నిస్సారం కాదు సరికదా నిత్యనూతనంగా ఉంటుంది. ఆయన గారు ఆదరణగా అనునయంగా భార్యను చూసి ఆమె ఉనికిని గుర్తించినట్లు ప్రవర్తిస్తే చాలు—ఆమెలో కొత్త ఉత్సాహం తలెత్తుతుంది. తనను ఇంకా ప్రేమించే వ్యక్తి తనతోపాటే ఉన్నాడని ఉబ్బిపోతుంది. దాని ఫలితం ఏమిటి? భర్తపట్ల ఆమె ప్రవర్తనలో ఎంతో తేడా వస్తుంది—తన ప్రేమని ఆయనపై ఆయన కోరిన రీతిని కురిపించడానికి వెనుదీయదు. పురుషుడు అంతకంటె కోరుకునేదేముంటుంది?... తనను లోకంగా ప్రేమించే భార్య కంటె భర్త ఇంకేమి కోరుకుంటాడు?

జీవితాలు నిస్సారంగా తయారైతే బాధ్యతలు మరీ భారంగా తోస్తాయి. బాధ్యతలు ఉత్సాహంతో నిర్వహించడం ఎంత ఆనందమో, భారంగా తప్పనిసరిగా నిర్వహించడం అంత విసుగ్గా ఉంటుంది. భార్యభర్తలిద్దరికీ సంసార రథం పూలబాటపై నడిపించడానికి బాధ్యత ఉంది. ఆ సారథ్యం ఇద్దరూ సరదాగా వహిస్తే... జాలీగా ఉంటుంది. లేకుంటేనే—కుటుంబం జైలులాగా తయారైపోతుంది. ఒకరినొకరు దెప్పుకొంటూ అసహ్యించుకుంటూ కూడా రథాన్ని కుంటి నడక నడిపించవచ్చు. కాని అది కోరుకోతగ్గదా అని? భార్యాభర్తల మధ్య అనురాగ, అనునయాలు ఆకర్షణలు తగ్గిపోకుండా జీవితాన్ని నిత్యనూతనంగా గడపడం నేర్చుకొంటే — వివాహ జీవితం విసుగనిపించదు. మీరిది విన్నారా? ఒక భర్త మున్ఫయి సంవత్సరాల వైవాహిక జీవితం తరువాత పత్రికలో ప్రకటించాడట: నా భార్య కోరి ఏం కొన్నా, ఆ అప్పులు తీర్చే బాధ్యత నాది' అని. ఎందుకు? అంటే— ఇన్నాళ్ళు ఆమె అందరి బాధ్యతా ఉత్సాహంతో మోసింది— సరదాలకి టైము లేక పోయింది! అన్నాడట—నిజమైన అనురాగం కల జంటల జీవితం కాలంతోపాటు బలపడుతుందేగాని—సడలిపోదు. ●






### జరిగిన కథ

కృష్ణమోహన్‌కి కళ్ళు కనిపించవు అతని గుడ్డితనాన్ని కప్పిపుచ్చి చెల్లెలు భానుమతి నిచ్చి పెళ్ళి చేస్తాడు రవికాంత్. నిజం తెలిసిన తర్వాత కూడా భానుమతి చలించదు. భర్తే దైవంగా కృష్ణ మోహన్‌ని పూజిస్తూ అతని ఆదరణలో మురిసి పోతూ వుంటుంది. కృష్ణమోహన్ చెల్లెలు మాధవి. భానుమతిలో సహనశక్తి, మనో నిబ్బరం మాధవిని ఆశ్చర్యపరుస్తుంది. ఇద్దరూ ఎంతో అన్యోన్యంగా వుంటుంటారు. కృష్ణమోహన్ కళ్ళు పరీక్షించే నిమిత్తం ఫారిన్‌లోవున్న తమ్ముడ్ని రప్పిస్తుంది భానుమతి. ఒక పెద్ద డాక్టర్ని సంప్రదించి ఆపరేషన్‌కి ఏర్పాట్లు చేయిస్తా-.

## 5

హాస్పిటలుకు వెళ్ళినతర్వాత కృష్ణమోహన్ను ఆపరేషన్ థియేటరులోనికి తీసికొని వెళ్ళేప్పుడు వచ్చాడు రవికాంతుడు. చెల్లెలివంక చూడగలిగినంత ధైర్యం లేదతనిలో. కృష్ణమోహన్ దగ్గరకెళ్ళిఅన్నాడు.

'కృష్ణా! భయపడకు. భానుకెప్పుడూ శుభమే జరుగుతుంది'

కృష్ణమోహన్ కను కొలకుల్లో నీరు నిలిచింది.

భానుమతి తుడిచింది పైట చెరగుతో.

'భానూ!' దుఃఖంతో కృష్ణమోహన్ గొంతు పూడిపోయింది. ఆమె చేతులను తన కళ్ళపై వుంచుకుని అన్నాడు.

'నీ అదృష్టం ఎలావుందో? నిన్ను చూడగలనా? లేక నీ మాటకూడా వినలేనంత దూరం...'

ఆమె చేతోతే అతని నోరుమూసింది కళ్ళు వత్తుకుని

'అదెప్పటికీ జరగదు' అన్నదామె దుఃఖాన్ని దిగమ్రింగి. తర్వాత థియేటరులోకి తీసికొనివెళ్ళారు. సారధి భానుమతికి ధైర్యంజెప్పి లోనికి వెళ్ళి తలుపులు మూశాడు.

వెంకట్రామయ్యగారు స్థిమితంగా ఒక చోట కూర్చోలేక పోతున్నారు. వరండా అంతా కలయతిరగ సాగాడాయన.

మాధవి వదినప్రక్కన శిలావిగ్రహంలా కూర్చుండి పోయింది. అంతలో శ్యామల వచ్చి భానుమతి వంకచూసి మాధవిని అవతలకుపిలిచి అడిగింది మెల్లగా.

'భాను ఇవాళ రోజేమైన తిన్నదా?'

'లేదు. రాత్రినుంచీ కటిక వుపవాసం' అన్నది మాధవి. శ్యామల మనస్సులో బాధ అలలా లేచిపడిందామాట విన్న వెంటనే. నిట్టూర్చివచ్చి కూర్చుంది.

లోపలినుంచి ఎంత చిన్నశబ్దం విన్పించినా వెంకట్రామయ్యగారు ఉలిక్కిపడి తలుపువంక చూస్తున్నారు. ఆ పిత్రు హృదయం ఆందోళనతో వుడికిపోతోంది భానుమతిమాత్రం కూర్చున్న చోటునుంచి కదలనే లేదు.

ఆ మమతాపూర్ణ హృదయంలో ఎంత భయానకమైన తుఫాను చెలరేగుతుందో, ఎన్నివేల ఆలోచనలు లేచి పడుతున్నాయో! కాని ఆ గంభీర వదనంలో ఏ మాత్రం మార్పు గోచరించలేదు.

'గరళము మ్రింగుమనియె సర్వమంగళ తన మంగళసూత్రము మదినెంత నమ్మెనదో' అన్నట్లు సర్వమంగళగా మారిపోయింది భానుమతి' అనుకున్నది శ్యామల లోలోన.

డాక్టర్ విల్సన్ బయటికి వచ్చాడు. అందరూ ఆతురతతో లేచి నిలబడ్డారు. ఆయన 'నర్స్!' అని పిలిచి మళ్ళీ తలుపులు మూశాడు.

నర్స్ తొందరగా పరుగెత్తింది లోనికి. అందరి హృదయాలు వణికి పోతున్నాయి.

'మళ్ళీ రెండు నిమిషాలకే ఆ నర్సు తలుపులు తెరిచి హడావిడిగా పరుగునవెళ్ళి ఇంజక్షన్ బాటిల్ ఒకటి పట్టుకుని తిరిగి లోనికి వెళ్ళిపోయింది.

వెంకట్రామయ్యగారు గోడకు చేరగిలబడి పోయారు. భానుమతి తలుపువంకే చూస్తూండి పోయింది.

'అక్కా!' అన్న సారథి పిలుపువిని అందరూ త్రుళ్ళిపడ్డారు

'రథీ!' అన్నది భానుమతి లేచి నిలబడి.

'భయపడవలసిన అవసరం లేదక్కా!' అన్నాడతడు.

'యూ ఆర్ ఎ లక్కీవుమన్' అంటూ బయటికి వచ్చాడంతలో డాక్టర్ జాన్సన్.

కృష్ణమోహన్‌ను మరొక రూమ్‌కు తీసికొని వెళ్ళమని చెప్పాడు డాక్టరు.

భానుమతి భర్తదగ్గరకెళ్ళి చూసింది.

ఆమె సజలనేత్రాల దృష్టిలో అతడు పునీతుడయ్యాడనిపించింది.

వెంకట్రామయ్యగారు కన్నీటితో నిండిన వ్యాకుల నయనాలతో చూస్తూండి పోయారు.

రవికాంతుడు భారంగా నిశ్వసించాడు.

'వచ్చే శనివారంనాడు కట్లు విప్పి చూస్తామని' సారథి చెప్పాడు.

అందరి మనసులూ కొంతవరకు కుదుటబడ్డాయి. దృష్టిరావచ్చునని డాక్టర్ జాన్సన్ అన్నాడు.

భానుమతి సాయంత్రంవరకూ భర్త దగ్గరే వుండిపోయింది. కృష్ణమోహన్ అన్నాడు ఆమెతో—

'భానూ! నీలో ఏదో మహత్యంవుంది'

'బహుశః మీనుండే దొంగిలించావేమో' అన్నదామె. చిన్నగా నవ్వుకున్నాడతడు.

'దృష్టివస్తే నాకేమిస్తారు?'

'ఏంకావాలి భానూ? అయినా యింకా నీదికానిది నాదగ్గరేముంది?'

'అయితే శిబిచక్రవర్తులయ్యారన్న మాట'

'వే నవ్వలేదు. నువ్వేచేశావు'

'అంటే-బలవంతంగానా?'

'బలవంతం! ఆ మాటకూడా అన గూడదు నీముందు. అనురాగ పూర్ణమైన నీ హృదయాన్ని కానుకగా యిచ్చి నన్ను పూర్తిగా స్వీకరించావు అన్నాడతడు.

'గొప్పదానేమే లభించిందయితే' సంతృప్తి నిండివుందా బవాబులో.

'గొప్పదో, కాదో నీకే తెలియాలి' అంటూ భానుమతి చేతుల్ని తన గుండెలపై వుంచుకున్నాడతడు.

శనివారం వచ్చింది. రవికాంతుడన్నాళ్ళ అక్కడే వుండిపోయాడు. సాయంత్రం కట్టువిప్పదీస్తారని సారథి చెప్పాడు. భాను



సతి, మాధవి మూరెదుగాని వెళ్ళారు వాళ్ళు టలుకి వంట అదీ చేయకుండానే.

సారథిని కట్లువిప్పమని ఆదేశించారు డాక్టర్ జాన్సన్.

'ఆగు! సారథీ! భామా! ఏదీ? ఎక్కడ' అన్నాడు కృష్ణమోహన్. భాను మతి భర్తదగ్గరకువచ్చి నిలబడింది.

భానుమతి నడుముచుట్టూతా చేతు లుంచి ఆమె కతి సన్నిహితంగా జరిగిఅన్నా డతడు.

'దృష్టి రాకపోతే'— నిరాశ ధ్వనించిం దతని స్వరంలో.

'వేనువ్నాను. మీకా భయంవద్దు' అన్న దామె.

'నువ్విలాగే వుండు. నన్ను వదిలిపోవద్దు భామా!'—

'ఆ! సారథీ! విప్పు' అన్నాడు.

'కొంచెం యివతలకు జరుగు బావా!' అన్నాడు సారథి.

'వుహూ! జరగలేను. ఏం జరుగు తుందో?' అన్నా డతడు వుద్విగ్న కంఠంతో.

భానుమతి భర్తముఖాన్ని గట్టిగా గుండెల కదుముకుంది పసిబిడ్డలా అలు ముకు పోయాడతడు.

'కొంచెం అవతలకు జరిగింది భానుమతి. సారథి కట్లు విప్పదీసి చూడమన్నాడు.

'చూడను చూడలేను సారథీ! నాకెం దుకో భయంగావుంది' భానుమతిని కౌగి లించు కున్నాడు కళ్ళు మూసికొని.

అందరి హృదయాలు కదిలి నీరయ్యాయి.

'చూడుబావా? ఏం భయంలేదు'

'యస్! లుక్ హియర్ మైడియర్ బోయ్' అన్నాడు డాక్టరు విల్సన్.

'నా చేతిలో ఏంవుందో చెప్పబావా?' అన్నాడు సారథి చేతిలో పెన్నువుంచుకుని.

కళ్ళు విప్పాడతడు.

'భామా!... భా... మా! పెన్...' అంటూ అమాంతంగా మంచంమీదినుంచి క్రిందికి దూకాడతడు సంతోషంతో.

ఆ వుజ్జ్వల దీపకాంతిలో భానుమతి నేత్రాలు పరిపూర్ణ సౌందర్యంతో మెరిసి పోయాయి. మనస్సులో శతకోటి వందనా లర్పించింది మాధవునికి.

వెంకట్రామయ్యగారు ఆనందభాష్పాలు తుడుచు కున్నారు.

మాధవి, భానుమతి చేతుల్లో వాలి పోయింది. రవికాంతుడు సంతృప్తిగా నిశ్వ సించాడు.

'నాన్నా!' తండ్రిని కౌగిలించుకున్నాడు కృష్ణమోహన్. ఆనందంతో మాట్లాడ లేక పోయిందా పితృహృదయం. కొంతసే పయిన తర్వాత కోడలివంక చూస్తూ అన్నాడాయన.

'కృష్ణా! భగవంతుడు కరుణా విభ వుడు. అమృతంనింపి వుంచుతాడు కొన్ని హృదయాల్లో'

'సారథీ! నీకెంత యిచ్చినా ఋణం తీరదు' అన్నాడు కృష్ణమోహన్ సారథి వంక చూసి.

'నాకొద్దుబావా? నువ్వు ఋణపడింది అక్కకు' అన్నాడు సారథి.

'అది తీర్చలేనిది నాయనా!' అన్నారు వెంకట్రామయ్యగారు వాత్సల్యంగా కోడలి వంక చూసి.

మాధవి ఫ్లాస్కులోనుంచి కాఫీవంచి వదినకిచ్చింది త్రాగమని.

'ఇంటికెళ్లిన తర్వాత తీసుకుంటాను' అని ఆమె కాఫీగ్లాసును తిరిగి మాధవిచేతి కిచ్చింది.

'ఉదయాన్నుంచి ఏమీ తినలేదన్నాయ్ వదిన!' అన్నది మాధవి.

'ఏమిటా పిచ్చిపని భామా!'

'పిచ్చిపనిగాదు కృష్ణా! ఆమె ఆచ రిస్తున్న వ్రతనియమం అది' అన్నారు వెంకట్రామయ్యగారు. తరువాత అందరూ వెళ్ళిపోయారు. భానుమతిమాత్రం అక్కడే వుండిపోయింది.

'అమ్మయ్య!' నిట్టూర్చాడు కృష్ణ మోహన్.

'ఏం? ఏమయింది దొరగారికి' ప్రశ్నిం చింది భానుమతి.

'నువ్వుకూడా వాళ్ళతో వెళ్ళిపోతావేమో ననుకున్నాను'

'ఎలావెళ్ళగలనీ చిలిపికళ్ళను తప్పించు కుని? అయినా శ్రమపడిన తరువాత ఫలి తాన్ని తృప్తిగా కనులారా చూడనైనా చూడ వద్దా'

'అసలు వెళ్ళనిచ్చేవాడి వేమిటి?'

'ఏం చేయగలరు?' అన్న దామె.

'ఏం చేయగలనా?' అంటూలేచి అత డామెను తన గుండెలమీదికి తీసికొన్నాడు.

'తెలిసిందా? ఏం చేయగలిగిందీ?' అన్నాడతడు ఆమె కళ్ళల్లోకి చూస్తూ.

'నేనేమీ పసిపాపనుగాదు. తెలియక పోడా నికి' అంటూ లేచికూర్చుంది భానుమతి.

తర్వాత కృష్ణమోహన్ ఆమె భోజనం చేయాలేదన్న సంగతి జ్ఞాపకంవచ్చి యింటికి వెళ్ళమని చెప్పాడు. అంతలో సారథీ, రవి కాంతుడు వచ్చారు. భానుమతి యింటికి వెళ్ళింది.

* * *

రెండవరోజున ఆ గృహం ఆనందంతో కళ కళ లాడుతోంది. వెంకట్రామయ్య



గారు భార్యఫోటో ముందు నిలబడి అనుకున్నారు ఆనందాశ్రువులు తుడుచుకుంటూ—

'మాణిక్యం! నీ గృహం సర్వ సంపదలతో సౌభాగ్యవంతమైంది దీనాటికి'

తరువాత రవికాంతుడు సెలవుదీసికొని వెళ్లిపోయాడు. సారథి 'మహాబలిపురం' వెళ్దామని సూచించాడు ఆ మధ్యాహ్నం. భానుమతి అతని వుత్సాహాన్ని భంగంచేయలేక పోయింది. ,వెంకట్రామయ్య గారింటి దగ్గరే మిగిలిపోయారు.

టాక్సీ ఒకటి తీసికొని బయలుదేరారు

మాధవి వుత్సాహానికీ, అల్లరికీ అంతులేకుండా పోయింది.

మధ్యలో డ్రైవరు దిగివెళ్లాడు నీళ్లు తెచ్చుకోవాలని. మాధవికూడా దిగింది.

'అబ్బ! కాళ్లు ముడుచుకోలేక యిదయిపోయాను! అంటూ ముందుకు నాలుగడుగులు వేసింది.

డ్రైవరు తిరిగి రావడంతో కారు దగ్గరికివచ్చి ఎక్కబోయింది. తాను కూర్చున్న స్థలంలో సారథివున్నాడు.

వదిన వంక చూసింది. ఆమె యిదేమీ గమనించనట్లు మరోకవైపుకు చూస్తోంది.

'వుహూ! తెలిసిందిలే!' అనుకుంది మాధవి మనస్సులో. విధిలేక సారథి ప్రక్కనే కూర్చుంది. కారు కదిలింది. ఆ కుదుపుకు

# రాగమయి

ఆమె సారథిని కౌగిలించుకోవలసి వచ్చింది. అతడు ప్రకృతి సౌందర్యారాధకుడిలా వంగి మరీ చూస్తున్నాడు.

మాధవి లేచి సర్దుకుని అన్నది కోపం అణచుకుని.

'కొంచెం అవతలకు జరుగువదినా?'

'ఏం? మా తమ్ముడు కొరుక్కుతింటున్నాడా తల్లీ నిన్ను?' అన్నదామె పరిహాసంగా.

కోపం దాగలేక పోయిందామె కన్నుల్లో. పట్టలేక భానుమతి చేతిని గిల్లింది.

'అహా! యిది కూడా నేర్చుకున్నావన్నమాట! వుండు!' అంటూ భానుమతి వంగి సారథి చెవిలో ఏదో రహస్యాన్ని వూదింది.

మాధవిముఖం క్రోధంతో కందగడ్డ అయింది

మహాబలిపురం రావడంతో సంభాషణ ఆగిపోయింది. భానుమతి, కృష్ణమోహన్‌లు, సిరికాంతిలో మెరిసి పడిపోతూన్న సంద్రంవంక ముగ్ధులై చూస్తూండి పోయారు

'ఎలావుంది?' అన్నది భానుమతి.

'ఏమిటి? సముద్రమా? నీ సౌందర్యమా?'

'ఏదో మీకే తెలియాలి!'

'నాకు తెలిసింది యిది'—

బంగారం కరిగి మనోహరమూ, మహాద్భుతమైన రూపాన్ని సంతరించుకుని సాక్షాత్కరించింది సజీవంగా. నవ్వునిండి వెలిగిపోతూన్న కన్నులు, అమృతం దాచుకున్న అధరాలు—'

'యింకా—' అన్నది భానుమతి మందహాసంచేసి 'ఈ సముద్రంకన్నా విశాలమూ గంభీరమూ అయిన—'

'ఆ! ఆ! ఇక ఆపండి స్తోత్రం! సాగరుడికి ఆగ్రహంవచ్చి మీద విరుచుకు పడుతున్నాడు' అంటూ లేచి నిల్చుందామె అల ఒకటివచ్చి పాదాలను తడిపిపోవడం వలన.

మాధవి శిల్ప సౌందర్యాన్ని చూస్తూ తనను తాను మరిచిపోయింది.

'క్లిక్' మన్న శబ్దంతో వులిక్కిపడింది. తిరిగి చూసేసరికి ఎదురుగా నిల్చున్నాడు సారథి నవ్వుతూ, కెమేరాతో.

'అరే! వదిన ఏది?'

'అరుగో! సముద్రతీరాన' అన్నాడు సారథి.

'రండి! వెళ్దాం!' అని వెళ్లబోయింది మాధవి.

'మాధవీ! ఆగు! ఒకమాట. వాళ్ల ఏకాంతాన్ని భంగంచేయడం ఔచిత్యం కాదనుకుంటాను' అన్నాడు

ఆగిపోయింది మాధవి వెంటనే తిరిగి వస్తూ అతనివంక ఆశ్చర్యంగా చూసింది.

ఆశ్చర్యంతో విప్పారిన ఆమె నేత్రాలను చూస్తూ అన్నాడతడు.

'మనసు నొప్పించానా మాధవీ?'

'దేనికి?' ద్వంద్వార్థం స్ఫురించింది.

'తెలిసే ప్రశ్నిస్తున్నావ్‌గదూ?' అన్నాడతడామె కెదురుగావున్న రాతిపై కూర్చుని.

'ఎలా అడిగినా సమాధానం చెప్పవలసే వుంటుంది.'

'మాధవీ! అని చనువు తీసుకున్నందుకా? లేక అధికారిలా ఆగిపొమ్మని అజ్ఞాపించినందుకా? మనస్సు నొచ్చుకుంది?'

'నొచ్చుకుందనే ఎందుకనుకోవాలి? సంతోషపడిందని అనుకోగూడదా?' అన్నదామె.

'అయితే అక్కడ జోస్యం యదార్థమైంది' అన్నాడతడు వుత్సాహాన్ని కప్పిపుచ్చి.

కించిత్ విస్మయం గోచరించిందామె

మన పక్కింటి పంపాపతి పార్టీ మారాడు! వెంటనే మంత్రి అయ్యాడు - మీరూ పార్టీ మారకూడదూ??





వెంకట దుర్గాప్రసాద్ గారి M.L.A

వదనంలో ఆమాట వినగానే ఆశ్చర్యంతో తల ఎత్తి చూసింది.

'మీరన్నదేమిటో సరిగా అర్థం గాలేదు' అన్నది.

మందహాసంచేసి అన్నాడు సారథి.

'మాధవి హృదయంలో అదృష్టవంతుడొకడు దాగివున్నాడ—'

ఆమె కళ్ళు అతని కళ్ళల్లోకి సూటిగా చూశాయి.

'అని అన్నది అక్క' అని పూర్తిచేశాడు వాక్యాన్ని.

ఆమె వదనంలో యౌవనలావణ్యం మెరుపులా మెరిసింది. సిగ్గుతో చెక్కిళ్ళు ఎర్రబారాయి. కనులు క్రిందికి వాలిపోయాయి. కొంతసేపటివరకు యిరువురూ మౌనంగానే వుండిపోయారు. ఎవరి మనస్సుల్లో ఏ మధురరహస్యం దాగివున్నదో ఆ ఉభయులకీ అవగతమయ్యింది.

కానీ పైకి వెల్లడించలేకపోతున్నారు

'ఆ అదృష్టవంతుడెవరో తెలుసుకోవచ్చునా? బహుశః వాడి సాహసమే గావచ్చును. కానీ యిందులో తప్పేమీ లేదనుకుంటాను అక్కతో చెప్పారుగదా యీనా సాహసకృత్యాన్ని' అన్నాడతడు.

'చెప్పడానికేం జరిగిందసలు? అయినా అంత భయంవున్న వారెలా అడిగారు?'

'ఏమడిగాను మాధవీ?'

'మీ ప్రశ్నే మీకు జ్ఞాపకంలేదన్నమాట అయితే'—

'నా మనస్సిక్కడలేదనేగా మీరు అనబోతున్నది?'

ఆమె మాట్లాడకుండా అతని వంక చూస్తోంది.

'ఎవరు దొంగిలించారని అడగరేమిటి?' అతడే ప్రశ్నించాడు.

'అది సాహసమౌతుందేమో' అన్నదామె.

'అహ! నా బాణం నాపైకే విసిరావన్నమాట.' నవ్వాడతడు.

'నీ సాహసాన్ని మన్నిస్తాను. అడగవచ్చు' అన్నాడు.

'అడక్కపోయినా చెప్పడం మీకలవాటేమో?'

'నిజంగా తెలివైన అల్లరిపిల్లవంటే నువ్వే మాధవీ?'

'మీకంటేనా?'

'కన్పించడంలేదా? ఇంత సుదీర్ఘ సంభాషణ జరిగినా నీ మనస్సులోనిది మాత్రం అక్షరంకూడా వెలికిరానీయవు. నన్ను మాత్రం వాగుడుపెట్టెలాజేసి వినోదం జూస్తున్నావ్' అన్నాడతడు నిందాపూర్వకంగా.

'నేను మంత్రగత్తెనుగాదే? మనుష్యుల్ని వాగుడుపెట్టెలుగా మార్చివేయడానికి' అన్నదామె.

'కాకపోతే యీ డాక్టరు హృదయాన్నెలా దొంగిలించగలిగావ్? పోనీ యిప్పుడయినా అంగీకరిస్తావా? యింకా ఆడించి చూడాలా మాధవీ?'

'ఏం అంగీకరించాలి?'

'భగవాన్' నుదుటిపై కొట్టుకున్నాడతడు. నిగ్రహించుకోలేక మాధవి నవ్వులో మునిగిపోయింది.

'ఏదీ మళ్ళీ నవ్వండి' అన్నాడతడు.

'వుహూ! నవ్వితే—'

'మనస్సులోని మధురరహస్యం బయటపడిపోతుందా?' అంటూ మాధవిని నవ్వించాడతడు.

'మాధవీ' అతడామె చుబుకాన్ని పట్టుకుని ఏదో అడగబోయాడు.

'వదిన! వదిన వస్తోంది' అన్నది మాధవి గాభరాగా.

'రానివ్వు! నేం జెప్పుతానేఁ' ఆమెను పట్టి కూర్చోబెట్టి ప్రక్కనే కూర్చున్నాడతడామె అన్నది అబద్ధమని గ్రహించి.

'ఏం చెపుతారు?'

'అక్కగారూ! మాధవికి త్వరగా వివాహ ప్రయత్నాలు చేయడం మంచిది. లేనిచో—'

'ఈ డాక్టర్ మహాశయులు ఫారిన్ పారిపోతారేమో అనికూడా చెప్పండి. అయ్యో! డాక్టరుగారూ! మీరిక్కడ కలలు గంటూ కూర్చోండి. నేను వెళ్ళొస్తాను' అంటూ గభలున లేచి సారథికి అందకుండా వేగంగా పరుగెత్తింది మాధవి.

నవ్వుతూ చూస్తూండిపోయాడతడు.

**(ఇంకా ఉంది)**

# రచయితలకు మనవి

## కథలు, వ్యాసాలు

ప్రచురణకి స్వీకరింపబడని తమ వ్రాతప్రతులని తిప్పిపంపగోరే రచయితలు వ్రాతప్రతులతోబాటే తగుమాత్రం తపాలాబిళ్ళలు అతికించిన, స్వంత చిరునామాగల కవరు కూడా పంపాలి. స్టాంపులు మాత్రం పంపరాదు. స్టాంపులు మాత్రం పంపించినట్లయితే వ్రాతప్రతులు తిప్పిపంపబడవు. వ్రాతప్రతులతో గాక విడిగా స్వంత చిరునామా, తగుమాత్రం పోస్టేజికల కవర్లు పంపినా వ్రాతప్రతులు తిప్పిపంపబడవు.

ప్రచురణకి స్వీకరింపబడని వ్రాతప్రతుల విషయంలో ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపబడవు.

## నవలలు

ప్రచురణకి స్వీకరింపబడని నవలల వ్రాతప్రతులు మేమే తిప్పి పంపిస్తాము. వ్రాతప్రతులతో స్వంత చిరునామాగల, తగుమాత్రం పోస్టేజి అతికించిన కవర్లు పంపనవసరం లేదు. 100 ఆరఠావు పేజీలయిన ఉన్న వ్రాతప్రతులే నవలలకింద పరిగణించ బడుతాయి.

## కార్టూన్‌లు

ప్రచురణకి స్వీకరింపబడని కార్టూన్‌లు తిప్పి పంపకోరేవారు కార్టూన్లతో స్వంత చిరునామాగల, తగుమాత్రం పోస్టేజి అతికించిన కవర్లు జతపరచి పంపాలి. స్టాంపులు మాత్రం పంపరాదు.

షరా: వ్రాతప్రతులనీ, కార్టూన్లనీ వీలయినంత భద్రంగా తిప్పిపంపే ప్రయత్నాలు చేస్తాము కాని, వాటి విషయములో ఎటువంటి బాధ్యతనీ స్వీకరించలేము. ఈ షరతుని గమనించి రచయితలు తమ రచనలు, కార్టూన్‌లు పంపగలరు.

*సంపాదకుడు*

*ఆంధ్రసచిత్రవారపత్రిక*

# వారఫలం

## 5-7-1968 శుక్రవారం మొదలు 11-7-1968 గురువారం వరకు

**మేషం:** భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. వారం మధ్యలో అన్నివ్యవహారాల్లోను చికాకులు యేర్పడతాయి. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**వృషభం:** వ్యాపారంలో పోటీవారితో పోటీ పెరుగుతుంది. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. వారం ఆఖరులో అన్నివ్యవహారాల్లోను శ్రమకు గురి కాగలరు. ఉద్యోగంలో యెవరినీ విశేషంగా నమ్మడం తగదు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉండదు. అధిక వ్యయం జరుగుతుంది.

**మిథునం:** మీకు మున్ముందు లాభించ గల వ్యవహారాల్లో అభివృద్ధిని సాధించగలరు. పోటీవారితో మాటపట్టింపులు తగవు. వ్యాపారంలో ప్రయోజనం గల వ్యక్తులను కల్సుకొంటారు. ప్రయాణాలు కొంచెం శ్రమ మీద ఫలిస్తాయి.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కర్కాటకం:** సామాన్యమైన పనులకు కూడా విశేషమైన ప్రయత్నం చేయవలసి వస్తుంది. నూతన వ్యవహారాలు శ్రమ మీద ఫలిస్తాయి. విద్యావైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణించగలదు. రాజకీయ విక రంగాల్లో మీ కృషి రాణించగలదు. రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్షాల సంచలనం పెరుగుతుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. శుభ కార్యాలు నెరవేరుతాయి.

**సింహం:** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభించగలవు. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు. మిత్రులకు సహాయం చేస్తారు.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. పోటీవారితో గౌరవం లభిస్తుంది.

**కన్య:** వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరుతాయి. సాహిత్య కళారంగాల్లో మీ కృషి రాణిస్తుంది. రాజకీయ వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

**తుల:** వృత్తి వ్యాపారాల్లో యిదివరకు యేర్పడిన చికాకులు తొలగిపోతాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. ఉద్యోగంలో గౌరవప్రాబల్యాలు బాగా ఉంటాయి. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. సజ్జనసాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**వృశ్చికం:** వారం ప్రారంభంలోనే వృత్తి వ్యాపారాల్లో చికాకులు యేర్పడి తరువాత సర్దుకొంటాయి. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. వ్యాపారంలో ఆదాయం బాగా ఉంటుంది. సాంఘిక వ్యవహారాల్లో మీ ప్రాముఖ్యత పెరుగుతుంది. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉండదు. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**ధనుస్సు:** వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. సమయానికి యేదో ఒకవిధంగా డబ్బు చేతికి వస్తుంది. వారం మధ్యలో ఆకస్మికంగా చికాకులకు గురి కాగలరు. మీ విలువైన వస్తువులు పోయే ప్రమాదం ఉంది. అధికవ్యయం జరుగుతుంది.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**మకరం:** ఆదాయం మాట యెలాగ ఉన్నా, అన్ని వ్యవహారాల్లోను గౌరవప్రాబల్యాలు బాగా ఉంటాయి. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. వారం ఆఖరులో అనుకోని చికాకులకు గురి కాగలరు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. అలంకార వస్తువులు కొంటారు.

**కుంభం.** వృత్తి వ్యాపారాల్లో అనుకూలమైన మార్పులు వస్తాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. ప్రయాణాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. స్థిరాస్తి వ్యవహారాల్లో మీ ప్రయత్నాలు ఫలించగలవు. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**మీనం:** కొంతమంది వ్యక్తులు మిమ్మల్ని నమ్మించి మోసం చేయడానికి ప్రయత్నిస్తారు. వ్యాపారంలో శ్రమ కలుగుతుంది. వారంమధ్యలో అనుకూల పరిస్థితి యేర్పడుతుంది. వృత్తిలో ఆదాయం బాగా ఉంటుంది. పోటీవారిలో గౌరవం లభిస్తుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉండదు. శుభ కార్యాలు నెరవేరుతాయి.

—మహేష్ ●



# వ్యవసాయాభివృద్ధిలో అగ్రతాంబూలం ఫార్మోజాది



సన్ ఎట్ సేను జ్ఞాపకార్థం ఆయన పేరుతో నిర్మించిన హాలు.

తాయివాన్ లేక ఫార్మోజా అనేది చైనా దేశం. కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని పీకింగ్‌లో మావో ఏర్పాటుచేశాక ఫార్మోజాలో తిష్ఠ వేసుకొని మార్షల్ చాంగ్‌కైషేక్ చైనా రిపబ్లిక్ అధిపతిని నేనే నంటున్నాడు. ఎప్పటికైనా పీకింగు నాచేతికివస్తుంది. ఆ ప్రజలు కమ్యూనిస్టుపాలన అంగీకరించరు అంటున్నాడు. ఒకనాడు చైనా ప్రజలకు ఏకైక నాయకుడై ఆసియాలోని పెద్దదేశానికి అధిపతై ఎంతో గౌరవప్రతిష్ఠలుగల అగ్రనాయకుడు చాంగ్‌కైషేక్. మన నెహ్రూజీకి ఒకప్పుడు ప్రియతమ నాయకుడు. మావో అధికారంలోకి వచ్చాక ఈయనపైన చులకన భావం కలిగింది, నెహ్రూకి.

తాయివాన్ ముఖ్యపట్టణము తాయిపై. తాయివాన్ జనసంఖ్య ఒకకోటి ముప్పై లక్షలు తాయిపై జనాభా 12–15లక్షల మధ్య ఉంటుంది. విశాలమైన వీధులు మంచిహోటళ్లు, భవనాలు, ఆధునిక సౌకర్యాలతో నగరం అందంగా ఉంటుంది. తాయిపై విమానాశ్రయంలోనే 1942లో దూరప్రాచ్య దేశాలలో భారత స్వాతంత్ర్యం కొరకు కృషిచేస్తున్న స్వామి సత్య నారాయణపూరి, జ్ఞాని ప్రీతంసింగు, నీలకంఠ అయ్యరు, కెప్టెను అగ్బరుఖాను, విమాన ప్రమాదంలో మరణించినారని జపానీయులు ప్రకటించారు.

1945 ఆగస్టు మాసంలో నేతాజీ సుభాస్ చంద్రబోసు విమాన ప్రమాదం కూడా యిచటనే సంభవించిందని జపానీయులు ప్రకటించారు. కనుక ఈ పట్టణాన్ని యీ దేశం మనకు అనేకవిధాల సన్నిహితమైంది. గత చరిత్రను గురించి జరిగిన విమాన ప్రమాదాలను గురించి చెప్పేవారు ఎవరూ యిచ్చటలేరు. యిదంతా యుద్ధకాలపు జపాను అధినేతలనుండి రావలసిన సమాచారం మాత్రమే! తాయిలాండులో హాంకాంగుమాదిరి రాజకీయ సంచలనంలేదు. అనిశ్చిత పరిస్థితులు లేవు. ప్రశాంతంగా కనిపించుతుంది. ప్రజలుగూడా స్వేచ్ఛాజీవులు.

మన ఆసియా ఖండంలోని ప్రతిదేశంలో ఒక్కొక్క ప్రాంతంలో ఒక్కొక్క ప్రత్యేకమైన విద్య కనుపించుతుంది. చేతివృత్తులు, గృహపరిశ్రమల్లో తయారయ్యే వస్తువుల్లో ఎంతో ప్రత్యేకత కనిపించుతుంది. వీరు బొంగు బద్దతో ప్లేట్లు, ట్రేలు, చిన్న చిన్న వస్తువులు తయారు చేస్తారు. మిషనులో చెక్కనువత్తి పలచగా తయారుచేసి అతి గట్టితనాన్ని తెస్తారు. అట్లాగే చాపలమీద, ఊనిన చర్మంమీద బొమ్మలు వ్రాయటం ఒక విద్య వీరిది. చైనా పురాతన ప్రభువులు, వారి పౌరాణిక దైవాలు, మనమాదిరే తయారుచేసి కొయ్యబొమ్మలు చెక్కి అమ్ముతారు. ప్లాస్టిక్ బొమ్మలు, అనేకమైన చిన్న చిన్న ఆటవస్తువులు తయారుచేస్తారు. యివన్నీ ప్రభుత్వ చేతిపరిశ్రమల కుటీర విక్రయశాలలో ఉన్నాయ్.

నేషనల్ తాయివాన్ యూనివర్సిటీ నూతన భవనాలు మనోహరంగా ఉంటాయి. యిచట వ్యవసాయ ప్రదర్శనహాలు ఒకటి ఉంది. వారి వ్యవసాయాభివృద్ధిని గురించిన సమాచారం, స్కీములు తెలుసుకోవచ్చు. యీ దేశంలోని 130లక్షల జనాభాలో దాదాపు 60లక్షల జనాభా వ్యవసాయంపై ఆధారపడి ఉంది. సంవత్సరానికి వ్యవసాయ వస్తువుల ఎగుమతుల ద్వారా 35కోట్ల అమెరికన్ డాలర్ల విలువైన ధనం సంపాదించుతున్నారు.

తాయిపైలో రిచర్డువాంగు అనే ఒక పెద్ద హోదాలో ఉన్నవారు స్నేహమయ్యారు హోటలులో. ఇచట నావెంట ఎవరూ గైడులేడు. సహాయం చేసేవారు లేరు. యీ నగరంలోని నైట్‌క్లబ్ చూదాం పదండి అని ఒకరాత్రి కార్యక్రమం పెట్టుకొన్నాం. అతి చౌకది, చైనీయుల గ్రామ జీవితానికి సమీపంలో ఉన్న ఒక క్లబ్బుకువెళ్లాం. యిది క్లబ్బా లేక ఎవరి యింటికైనా కబుర్లు చెప్పుకొంటానికి వెళ్లామా అనిపించింది. వారి ఆప్యాయతలు, మర్యాదలకు హద్దులేదు.

కాక్‌టెయిల్ బారు లేక స్నాక్‌బారు అంటారు. ఆ రెస్టారెంటులోని యీ ప్రత్యేక గదిలో రెండుగంటలు గడిపాము. ఈ కాక్‌టెయిల్ బారులో పానీయాలు, షర్‌బత్‌లు, ఫలహారాలు అందించే బాలికలు పదిమంది ఉంటారు. అందరూ 13, 14 వయస్సునుండి పదిహేను పదహారు సంవత్సరముల వయస్సు లోపలివారే. వారు రాత్రి 9 గం॥ల నుండి 1 గంట వరకు యిచట ఉద్యోగంచేసి రాత్రి యిచటనే పడుకొండి ఉదయం యింటికి వెళ్తారు

పగలు మూళ్ళలు గృహకృత్యాలు చూచుకొంటారు. యీ వయస్సులో రాత్రిపూట ఉద్యోగం చేయుటం కష్టంగాదా? అని ప్రశ్నించాము. మావి బీదకుటుంబాలు. యిద్దరు ముగ్గురు పిల్లల్ని మా తండ్రి ఒక్కడి సంపాదనమీద పోషించబడటం మంచిపనిగాదు. మేము సంపాదించి చదువుకోవాలని కొందరు, నాకు తండ్రిలేడు, నేనే యింట్లో పెద్దమ్మాయిని, యింకా యిద్దరు నా తరువాత పిల్లలు ఉన్నారు, వాళ్ళనిగూడా మా తల్లి ఒక్కతే పోషించలేదుగదా? అని ఒకమ్మాయి. ఈ విధంగా వారు ఎందుకు ఉద్యోగం చేస్తున్నారో వారి ఆర్థిక పరిస్థితి ఏమిటో తెలుసుకొన్నాక, వారిపైన ఎంత మక్కువ గలిగిందో చెప్పనలవిగాదు. వారు యాచనవృత్తి చేయాలనిగాని, ఒకరి మోచేతి నీళ్ళు త్రాగి బ్రతకాలనిగాని, ఆలోచనేలేని బాలికలు. వారి ఆత్మవిశ్వాసం, ఆత్మాభిమానం చూసి ఎంతో సంతోషం వేసింది. వారి ఉత్సాహం మందహాసం యిప్పటికీ మరువు రాకుండా ఉన్నాయి. సర్వ సత్తాకమైన జాతి, సృజనాత్మకమైన శక్తికి చిహ్నాలు యివి. అందుకనే యీ దేశాలలో కొంతమంది వ్యాకుల చిత్తం గలవారు, వ్యాకుల వృత్తిలో ఉన్నవారు ఉన్నప్పటికీ, యాచనవృత్తిలో ఎవరూ లేరు. జీవితం దుర్భరంగా ఉండి, యితరులను దుర్భరం చేసేవారు కనిపించరు. వారి భవిష్యత్తును వారే చక్కదిద్దుకొంటారు. స్త్రీలకు పురుషులకు సమాన సంస్కారం, సమాన ప్రతిపత్తి ఒకేసాంఘిక న్యాయం కనుపించుతుంది. స్త్రీలపట్ల యిచట ఉన్న గౌరవం మన సంఘంలో యేమాత్రం లేదనిగూడా స్పష్టమైంది.

తాయిపై కమ్యూనిస్టు విస్తరణ వ్యతిరేకోద్యమానికి కేంద్రం. యిది రాజకీయంగా ఆసియాదేశాల కూడలిస్థలం. ఈ సంస్థకు మదాం జంక్షైషేక్ సోదరుడు డాక్టరు కూ అధ్యక్షులు. హుాంగు సో సూ అనే ఆయన ప్రధాన కార్యదర్శి. వీరి ఆఫీసుకు వెళ్ళి వారితో ముచ్చటించ గలిగాను. కమ్యూనిస్టుల కార్యకలాపాలు, వారి యెత్తుగడలు, దూరప్రాచ్య దేశాలలోని రాజకీయాలు కొంతవరకు తెల్సుకొంటానికి ఒక అవకాశం గలిగింది.

—వి. యల్. సుందరరావు.

---

అభియోగాలలో వింతలు

# పదహారేండ్ల బాలికను చంపిన 40 యేండ్ల వ్యక్తి

స్టీఫెన్ కాన్వే మిల్నర్ వయస్సు 40 సంవత్సరాలు. ఏడుగురు బిడ్డల తండ్రి. పదహారు సంవత్సరాల వయస్సు బాలికను చంపిన నేరానికి మిగతా జీవితమంతా జైలులో గడపవలసినదిగా యీ ఆసామిని హాంట్స్ ఎసైజెస్ న్యాయమూర్తి వీల్ ఆదేశించారు.

జస్టిస్ వీల్ యిలా చెప్పారు: "ప్రస్తుత వైద్య పరిజ్ఞానంతో నువ్వు స్వేచ్ఛగా ఉండడం వాంఛనీయం కాదని డాక్టర్ల అభిప్రాయమూ, ఈ అభియోగం వివరాలూ విశదం చేస్తున్నాయి. నువ్వుచేసినది ఘోరమైన నేరం.

కాన్వే మిల్నర్ సైకోపత్. వైద్యం అతని మీద పని చెయ్యదని నేరారోపకుల తరపున న్యాయవాది అశీ రేమండ్ స్టేల్స్ వాదించారు. ఇంకా యిలా చెప్పారు: "ఆమె యింటికి కొన్ని మైళ్ళ దూరంలో మిస్ హీత్ శవం జనవరి 27 న కనిపించినది. ఆమె తలమీద పెద్ద దెబ్బ తగిలినది. ఆమెపై అఘాయిత్యం జరిగినది. చివరికి దేనితోనో వేలాడ తీశారామెను, ఆమె మరణించినది.

"ఆ తరువాత దర్యాప్తు ప్రారంభమయినది. డిటెక్టివ్ ఇన్స్పెక్టరు రెజినాల్డ్ టాపిన్ సహాయంతో పోలీసులు దర్యాప్తు జరిపి, వివరాలను సంతరించారు. మిస్ హీత్ మీదుగా తన వాన్ను పోనిచ్చాడు మిల్నర్. ఆ ప్రక్క సందులోగుండా తప్పించుకుపోయి నేరం జరిగినచోటుకు మళ్ళావచ్చాడు. ఇదిపోలీసుకథ."

మిస్ హీత్ను శ్రీమతి ఒలీవియా మాక్మిలన్ చూచినది. అప్పటికే ఆమె వళ్ళంతా గాయాలు. కనిపించిన మొదటి వాహనాన్ని శ్రీమతి మాక్మిలన్ ఆపినది. అది కాన్వే మిల్నర్ యొక్క వాహనం.

దగ్గరలో ఉన్న పోలీస్ స్టేషన్కు మిస్ హీత్ను తీసుకు వెళ్ళడానికి కాన్వే మిల్నర్ అంగీకరించాడు — దోవ చూపించడానికని శ్రీమతి మాక్మిలన్ ముందు బయలుదేరినది తన మోటారుకారులో. కానీ, ఆమె పోలీస్ స్టేషన్కు చేరేసరికి వాన్ అంతర్ధానమయినది. ఈ కథ అంతా పోలీస్లకు చెప్పినది శ్రీమతి మాక్మిలన్. దర్యాప్తు ప్రారంభమయినది. మిస్ హీత్ శవం దొరికిన తరువాత— ఆ సంగతి పత్రికలలోనూ, టెలివిజన్లోనూ ప్రకటించారు. ఆకుపచ్చరంగు వాన్ ఉన్న ఆసాములను గురించిన భోగట్టా పోలీస్లకు అందజేశారు కొంతమంది.

అలా భోగట్టా అందజేసిన వ్యక్తులలో ఒకరు కాన్వే మిల్నర్ వాన్ గురించి చెప్పారు. కాన్వే మిల్నర్ తన కుటుంబంతో ఉంటున్న ఇంటి బయట విరిగిపోయిన "పళ్ళు" (దంతాలు) దొరికినవి డిటెక్టివ్లకు.

ఇంతకూ యీ కాన్వే మిల్నర్ ఇంతకు ముందు చాలా ఘనకార్యాలు చేశారు.

ప్రస్తుత విచారణలో ఇలా చెప్పాడు: "ఆమెపై అఘాయిత్యం చేసే ఉద్దేశం తొలుత నాకులేదు. ప్రమాదం జరిగిన తరువాత నా మతిపోయినది. ఇదంతా ఓ ప్రేమాయణనేరంగా కనిపించాలని ఇలాచేశాను."

## ప్రధానమంత్రి విల్సన్ న్యాయస్థానంలో హాజరు

కొన్నిరోజుల వ్యవధిలోనే ప్రధానమంత్రి శ్రీ హెరాల్డ్ విల్సన్ రెండవసారి న్యాయస్థానానికివెళ్ళి సాక్ష్యమివ్వవలసిన పరిస్థితి ఏర్పడినది.

బ్రిటన్ వేతనాల శాఖ అధికారి శ్రీ జార్జి విగ్ "స్పెక్టేటర్" పత్రిక మీద వేసిన దావా యిది. "ప్రొఫ్యూమో" కథ గురించి కామన్స్ సభలో జరిగిన చర్చను పరిచయం చేస్తూ ఆంథోని వెస్ వ్రాసిన వ్యాసాన్ని 1963 లో యీ పత్రిక ప్రచురించినది.

ఈ అభియోగం విచారణలో సాక్ష్యం చెప్పడానికి వీలుగా కామన్స్ సభ నుంచి గైర్హాజర్ కావడానికి సెలవును కామన్స్ సభ నుంచి శ్రీ విగ్ ఇదివరకే సంపాదించారు.

ఇంకా కొంతమంది ప్రభుత్వాధిపతులను సాక్షులుగా న్యాయస్థానానికి పిలిపించాలని ప్రతివాదులు యత్నిస్తున్నారు. అట్టి సాక్షులలో ఒకరు శ్రీ హెరాల్డ్ విల్సన్. 1963 లో శ్రీ విల్సన్ ప్రతిపక్ష నాయకుడు.

ఈ వ్యాసం ప్రచురితమైన రోజులలో 'స్పెక్టేటర్' పత్రిక యజమాని టోరీ ఎమ్. పి. ఇయాన్ గిల్మర్, సంపాదకుడు ఇయాన్ హామిల్టన్.

'పాప్' సంగీత గాయకులపై ప్రధానమంత్రి విల్సన్ దావా వేసిన సంగతి చదువరులకు తెలిసే వుంటుంది. ఆ దావా విచారణకు ప్రారంభం కాకముందే యీ అభియోగం విచారణకు శ్రీ విల్సన్ హాజరై, బోనులో నిలబడి శ్రీ విగ్ తరపున సాక్ష్యం ఇవ్వనున్నారు.

ఇక్కడ ఒక విశేషమున్నది. బ్రిటిష్ పార్లమెంట్ చరిత్రలో— ప్రధానమంత్రి న్యాయస్థానాల కెక్కడం అరుదుగా జరిగే వింత. ఈ శతాబ్దంలో ఒక పౌరుని మీద లేదా సంస్థ మీద దావా వేసిన ప్రధానమంత్రులలో శ్రీ విల్సన్ మూడవవారు.

—వి. ఎస్. అవధాని




'ప్రేమించి పెళ్ళి చేసుకోవాలి' అనేది ప్రేమారావు నినాదం. మేనత్తకూతురు కాంతం అతనికి ఈడూ జోడూ అయినదే గాని నినాదాన్ని నీళ్ళలో కలపడం ఇష్టం లేక ఒప్పుకోవడం లేదు.

'కాంతానికేంరా బంగారబ్బొమ్మ' అని ప్రేమారావు ఖులాసాగా కనిపించినప్పుడల్లా అంటుండేది వాళ్ళ బామ్మ.

ప్రేమారావు వినుక్కునేవాడు. మనస్సులో మాట మొఖాన్ననలేక 'నాకిప్పుడే పెళ్ళేమిటే బామ్మా.... ఈ చదువు పూర్తికానీ....'' అనేవాడు.

తనతరానికీ ఈతరానికీ పోల్చి చాటభారతం చదివేది బామ్మ. అది మామూలే. అందుకు ప్రేమారావుకి బామ్మ మాటలమీద పూర్తిగా గురిలేకుండా పోయింది. బామ్మ కాంతం గురించి లేనివేమీ చెప్పేదికాదుగానీ, ఉన్నవాటికే నగిషీపెట్టి ప్రేమారావుమీద ప్రయోగించేది. ఒకోసారి తబ్బిబ్బయిపోయి అంగీకారం అతని నాలిక చివరిదాకా వచ్చేసేది. నినాదం నాలికని కరిపించి వెనక్కు తోసేసేది.

బామ్మన్నట్టుగా కాంతం నిజంగా బంగారబ్బొమ్మ. చూస్తే కళ్ళు జిగేల్ మంటాయ్, ఎప్పుడో సెలవులకని వాళ్ళింటికి పంపించింది బామ్మ. తెలిసీ తెలియని వయస్సులోనే కాంతం అప్సరసలా కనిపించింది. చేసుకుంటే ఇలాంటి పిల్లనే చేసుకోవాలి అనుకున్నాడప్పుడు.

'కాలేజిలో అడుగెట్టాక, అందర్నీ చూసి, ప్రేమించకుండా పెళ్ళేమిటి, ప్రేమించి పెళ్ళి చేసుకోవాలి' అనుకున్నాడు.

అతని అభిప్రాయాన్ని బలపర్చాడు జ్ఞానసంబంధం. బలపర్చాడు అనేకంటే ప్రేమారావులో అటువంటి అభిప్రాయాన్ని కలగజేసింది. అతనే అని చెబితే బాగుంటుంది.

జ్ఞానసంబంధం ప్రేమారావుకి ఏల్నాటి మిత్రుడు. ప్రేమారావు అతన్ని వదిలించుకోవడానికి ప్రయత్నం చేయడు. జ్ఞానసంబంధం అతన్ని వదలడు.

ఒకకంచంలో తినకపోయినా, ఒకేమంచంలో పడుకోపోయినా యిద్దర్నీ ఎందుకు వేరుచేయాలి అనుకోవచ్చు. అందుకు కావలసినన్ని కారణాలు ప్రేమారావు దగ్గరున్నాయి.

ప్రేమారావుని చూడగానే జ్ఞానసంబంధం ఆకర్షించాడు. అతనికంటే అతనిపేరు బాగా ఆకర్షించింది. కాంతాన్ని నేను చేసుకుంటున్న ప్రేమారావులో నవచైతన్యం కలిగించాడు.

ప్రేమపేరు చెప్పుకుని అప్పటికే ప్రేమారావు ఇద్దరి ముగ్గురి అమ్మాయిలచేత 'హితం' చెప్పించుకున్నాడు. అయినా జ్ఞానసంబంధం మీద గౌరవం పోలేదు. అతని మాటని శిరసావహిస్తాడు.

ప్రేమారావు బామ్మ పెంపకంలో పెరిగాడు. అందుకే 'భోళా'గా తయారయ్యాడు..అనేవాడు వాళ్ళ నాన్న. మొన్న మొన్నటివరకు 'వాజెమ్మ'అని తిడుతూనే ఇటీవలే జేజెమ్మ దగ్గరికి వెళ్ళిపోయాడు. ప్రేమారావుకి లయిన్ క్లియర్. ఏం చేసినా ఎదురించేవారు లేరు. బామ్ముందిగాని కాంతంమీద భ్రమచేత నోరెత్తదు. ఎప్పటికయినా తనమాట వినకపోతాడా అని ప్రేమారావు ఏం చేసినా 'సయ్' అంటుంది.

వాళ్ళనాన్నకి కలిగిన గంపెడు పిల్లల్లోనూ ప్రేమారావొక్కడే నిలిచాడు. గంపంత ఆస్తిని మిగిల్చి పోయాడు.

జ్ఞానసంబంధం ఎవరితోనన్నా స్నేహం చేస్తే పూరికే చెయ్యడు. ప్రేమారావులో యోగ్యతలన్నీ లెక్కవేసి అతని అంచనాకి సరిపోయినప్పుడు అతనితో స్నేహమారంభించాడు. ప్రేమారావు ఎందులో బలహీనుడో లెక్కేసి తెలుసుకున్నాడు. జ్ఞానసంబంధం వ్యవహారాలన్నీ అంకగణితాలు, బీజగణితాలమీదే తెముల్తాయి. అతను లెక్కల్లో ఫస్టు. ప్రేమారావుని ఉపయోగించుకుని ప్రయోగాలు చేస్తుంటాడు. తనకు కావాల్సిన పనిని ప్రేమారావుచేత సాధించి వచ్చినదాన్ని తను అనుభవించాలని చూస్తుంటాడు.

ప్రేమారావుని ప్రేమమోహంలో దింపి మరీ వెర్రెత్తేట్టు చేస్తున్నాడు జ్ఞానసంబంధం.

మామూలు రోజుల్లో చిన్నవి, ఆదివారం

పూట పెద్ద పెద్ద అయిడియాలు ఇచ్చేవాడు జ్ఞానసంబంధం ఆదివారం అయిడియాకోసం జ్ఞానసంబంధానికి కాఫీ పోయిస్తూ—

"ఇప్పుడేం చేయమంటావ్" అన్నాడు ప్రేమారావు, కాఫీతాగడం మాని

"ముందు కాఫీ తాగు. ఆత్మారాముడి పూజ చెయ్యకుండా ఏం చెయ్యకూడదు ఎప్పటిదప్పుడే చెయ్యాలి" అన్నాడు జ్ఞానసంబంధం ఖాళీకప్పు బల్లమీద పెడుతూ

ప్రేమారావు కాఫీ తాగుతుండగా రెండో సిగరెట్టు ఆఖరిదమ్ము లాగుతూ—

"ఒకపని చేస్తేనో . "? అన్నాడు జ్ఞానసంబంధం

కాఫీకప్పు గభాల్ని బల్లమీద పెట్టి "ఏమిటది .. ?" అన్నాడు ప్రేమారావు ఆసక్తిగా.

జ్ఞానసంబంధం సీరియస్ అయిపోయాడు అతనిముఖం వంకేచూస్తున్న ప్రేమారావు ఇట్టే కనిపెట్టేశాడు. కారణం మాత్రం తెలియలేదు ముఖం అదోలా మార్చేసుకుని కూర్చున్నాడు

"నీకు ఉత్సాహమెచ్చిందంటే వొళ్ళూపై ఏమీ తెలియదు నాకష్టం ఆలోచించవు. ఎదటివాళ్ళ సంగతి సరేసరి " అన్నాడు జ్ఞానసంబంధం చిరుకోపంతో

"ఇప్పుడేమయింది "? అన్నాడు బిక్కుబిక్కుమనిచూస్తూ ప్రేమారావు .

"ఏం కావాలి. ఇదో నాచ్ఛాక్కుచూడు "

'నిజమే కాఫీకప్పు బల్లమీద దభేలునపెట్టడం తనదే తప్పు!' అనుకున్నాడు ప్రేమారావు

"నష్టపరిహారం ...." మాట పూర్తి చేయకుండానే—

"చెల్లిస్తాగా " అంటు ప్రేమారావు జ్ఞానసంబంధానికి సర్దేశాడు

ప్రేమారావు టెరిలిన్‌పాంటూ షర్టూ తొడుక్కుని కాలరు సర్దుకుంటూ "ఎలా వుంది?" అన్నాడు జ్ఞానసంబంధం

"బాగానేవుంది" అన్నాడు ప్రేమారావు చక్కని పేంటూషర్టూ వీడి మొహాన తగలేయడమా అని లోలోపల తిట్టుకుంటూనే

"ఇంతవరకు . అయిడియా చెప్పనేలేదు. " అన్నాడు నాన్చుతూ... .

"చెప్తా చెప్తా నీకు మరీతొందరోయ్ దేనికీ అంతతొందర పనికిరాదు కాస్సేపుఆగు " అన్నాడు జ్ఞానసంబంధం పవుడర్ దట్టిస్తూ.

డ్రస్సింగ్ పూర్తిచేసుకుని "మ్యాట్నీ సినిమాకి ప్రోగ్రాం వెయ్ " అన్నాడు

"మరి అయిడియామాటో "

"అరె నే చెప్పినట్లు చెయ్యమంటే......" అగద్దించాడు జ్ఞానసంబంధం

"ఇంగ్లీషా? హిందీయా . ?"

"అవేవీ ఒద్దు .."

"మరి ....?"

"తెలుగు .. .."

"తెలుగా??"

సాధారణంగా జ్ఞానసంబంధం తెలుగు సినిమాలు చూడడు ఇంగ్లీషు సినిమాలే ఎక్కువగా చూస్తుంటాడు ఇంగ్లీషు సినిమాలు చూస్తున్నప్పుడు "అడుగో చూశావా "గ్రెగరీపెక్ " అతను మామేనమామకు దగ్గిర చిన్నప్పుడే ఫారిన్ వెళ్ళిపోయాడు "సోఫియా లారెన్" రమ్మని రాసింది స్టడీస్ పూర్తి చేసుకుని వెళ్దామనుకుంటున్నా"అంటూ పేర్లేనా తెలీని ప్రేమారావుకి చెప్తుంటాడు జ్ఞానసంబంధం లాంటి గొప్ప మిత్రుడు దొరికినందుకుమురిసిపోతుండేవాడు ప్రేమారావు అడపాదడపా హిందీ సినిమాలుకూడా చూస్తుండేవాడు అవిచూస్తున్నప్పుడు, పది పన్నెండు సార్లయినా హాలు బయటికి వెళ్లి వస్తుండేవాడు తెలుగుసినిమాల పేరెత్తితే తేళ్ళూ జెర్రులూపాకినట్టు మొహం పెట్టేవాడు అటువంటి జ్ఞానసంబంధం తెలుగుసినిమాకు ప్రోగ్రాం వెయ్యమంటే ప్రేమారావు కొత్తరకం కథతో తెలుగు సినిమా తీసినంతగానూ ఆశ్చర్య పోయాడు

"ఏమిటలా చూస్తావ్ . బయల్దేరు..." అన్నాడు జ్ఞానసంబంధం

"మరి అయిడియానో ..?"

"అదే వస్తుంది పద " అంటూ ప్రేమారావు జేబు తడిమి, తృప్తిపడి అతని చేయిపట్టుకు లాక్కెళ్లాడు జ్ఞానసంబంధం

హిందీ సినిమా చూస్తున్నప్పుడే పదిసార్లు బయటికి వెళ్ళి, తన ఖర్చుతో డ్రింకులు, సిగరెట్లు తాగి వచ్చే జ్ఞానసంబంధం ఆరోజున నిశ్చలంగా తెలుగు సినిమా చూస్తుంటే ప్రేమారావుకి పట్టలేక్యంకాక పోయింది పోనీ సినిమా చూద్దామన్నా, ఏం బాగోలేదు అప్పటికే అది ఎప్పుడో చూసినట్టుగా అనిపిస్తోంది అయినా జ్ఞానసంబంధం ఎంతో ఆసక్తిగా చూడగల్గుతున్నాడు

నిద్రపోతున్నాడేమోనని ఒకటిరెండు సార్లు ~ఇపి చూశాడు ప్రేమారావు

నిద్రపోవడంలేదు. అంతరాయం కలిగించినందుకు విసుక్కున్నాడు నల్లులకంటే గట్టిగా గిచ్చాడు.

"గోల్చెయ్యకు సినిమాచూడు " అంటూ హెచ్చరించాడు

ప్రేమారావు కిదంతా విచిత్రంగా వుంది.

'శుభం' చూసి, బయటికి వచ్చిన తర్వాత జ్ఞానసంబంధం ముఖం జ్ఞానజ్యోతిలా వెలిగిపోవడం చూసి, కూల్‌డ్రింక్ ఇప్పించి చల్లబరిచాడు ప్రేమారావు.

చల్లబడి, సిగరెట్ ముట్టించి టాక్సీఎక్కుతూ—

"నువ్వూ ప్రేమించు .." అన్నాడు జ్ఞానసంబంధం .

ప్రేమారావు గట్టిగా నవ్వాడు.

"నేను ప్రేమించనని ఎప్పుడన్నాను?" అన్నాడు అదే నవ్వుతో.

"యూఫూల్ ... ఏమిటా నవ్వు .... చెప్పిన మాట వినకుండా నువ్వూ ప్రేమించు మీ మేనత్త కూతుర్ని ."

ప్రేమారావునోరావులిస్తుంటే అతను మూశాడు.

"చెప్పేది సరిగ్గా విను. అనవసరంగా కాలయాపన చేయకు. మన ధ్యేయం ఏమిటి?"

"ప్రేమించి పెళ్లిచేసుకోవడం."

"అవునా? కాంతాన్ని నిన్ను పెళ్లి చేసుకోమంటున్నారా లేదా?"

"అంటున్నారు."

"మన ధ్యేయం ప్రకారం దాన్ని అటుదిటు ఇటుదటు మార్చు".

"అంటే .."

"నట్టిమట్టి బుర్ర."

అందుకే నా స్నేహం చేశాడు అని లోపల సంతోషించి—

"కాంతమంటే నీకు ఇష్టమేనా.....?"

"ఇష్టమే . . కాని. ."

"కానీ . అర్థాలిప్పుడు లేవు అనవసరంగా జరిగిన దాన్ని తలచి విచారించకు. నే చెప్పేది సరిగ్గా విను ఆన్సర్ టుది పాయింట్...... నువ్వెందుకు ప్రేమించాలనుకుంటున్నావ్......?"

"పెళ్లి చేసుకోడానికి "

"అవునా ...? నీకు కాంతమంటే యిష్టం. మరి అల్లాంటప్పుడు ఎవర్నయినా ప్రేమించి కాంతన్నెలా పెళ్లిచేసుకుంటావ్. ....?"

"కష్టమే ...."

"నంబర్‌టూ. కాంతాన్ని ప్రేమించకుండా పెళ్లి చేసుకోగలవా ...?"

" నా అభిమతం ప్రకారం ..."

"వ్యాఖ్యానం వొద్దు ఒకే ముక్కలో చెప్పు .. కష్టం లేదా యిష్టం ...."

"కష్టమే .."

"నంబర్ త్రీ .. సప్పోస్ .... నువ్వు నీ యిష్ట ప్రకారం ఎవర్నయినా ప్రేమిస్తావనుకో .. అప్పుడు సర్వం నువ్వే అనుకున్న కాంతం మాతితో దిగులుస్తుంది ఆ కష్టాన్ని నువ్వు వోర్చుకోగలవా?"

"కష్టమే "

"టు ష్లస్‌వన్ మూడు కష్టాలతో మన గొప్పెక్కలేవు. అంచేత, కాంతాన్నే ప్రేమించి పె

## 18 క్లూలకు తెలుగు అనువాదం

1 వడ్డీవ్యాపారి/కర్షకుని సహజమైన స్వార్థ సిరాయణతను మార్చగలుగుట సులభంకాదు.

2 నిరోధింపజాలని లోభం, పెచ్చుపెరుగుచున్నప్పుడున్ను ప్రజలు రాజతంత్రజ్ఞాధికారమును ప్రశంసించునప్పుడున్న సమాజంలో నిజమైన ప్రజాప్రభుత్వం/సమత్వం ఉండనేరదు

3 వెయ్యిన్నొక్క దేవుళ్ళుగల ఈ దేశంలో అంత రాక్షసత్వం మరియు నిరాశ/దుర్దశ ఎందుకు హెచ్చరిల్లుచున్నవి?

4 సారరూపంలో ప్రజాప్రభుత్వం ఒక జీవిత విధానం, వ్యక్తిగత గౌరవం/స్వాతంత్ర్యం అణచివేయబడకుండా వుండే జీవితవిధానం

5 జాతీయాత్మక చైతన్యం మరియు నాగరీక జీవితవిధానం పెంపొందుటలో శిక్షణ/ధర్మము నీతిజ్ఞం మరియు ప్రతిఫలింపజేసెడి దవుతుంది

6 ప్రాబల్యంగాను సార్థకంగాను వుండుటకు విమర్శనం న్యాయయుక్తంగా తీవ్రతగా/సహానుభవంగా మరియు రచనాత్మకంగా నుండవలెను

7 తెలివైన న్యాయాధిపతులు తమ పొరపాటును/విధ్యుక్త ధర్మమును పూర్తిగా ఎరిగినవారై యుందురు

8 మరచిపోయేశక్తి లేనప్పుడు క్షమించుట/ఆనందం అసంభవం

9 ఒకనిమిత్తార్థం ఉత్తేజం,ఉత్సాహం ఇప్పుడు అంతరించినవి, జనబాహుళ్యంలో నిశ్చేష్టత, నిర్లక్ష్యం మరియు కరుణాకరమైన నిరాధారత్వం/నిరుత్సాహం నెలకొనియున్నవి

10 భారతీయ తత్వజ్ఞానం యొక్క అధికారయుక్తమైన వివరణం ఆదర్శవాది/వాస్తవమైనది

11. అసూయత లేకుండా జీవించుట/ప్రేమించుట సంభవనీయమా?

12 సంకల్పరహితంగా ఈ ప్రపంచంలో ఏదిన్ని జీవింపనేరదు/కదలనేరదు

13 ఏ దేశమునందైనా కార్యనిర్వాహకం జాతీయ/ఆధ్యాత్మిక జ్ఞాన దృష్టిలో నడపబడవలెను

14 మనదేశంలో చాల తరుచుగా తప్పుడు అర్థశాస్త్రం మంచి కౌశలముగా/రాజ్యనీతిజ్ఞతగా పరిగణింపబడుచున్నది

15 శిక్షణ విస్తారంగా సర్వజనిక దురభిమానం/గౌరవం సహితంగానే ఇంకనూ అనుసరింపబడుచున్నది

16 వ్యవసాయం, వలెనే శిక్షణనిచ్చుట ఉత్పాదన శక్తిని/అభ్యుదయాన్ని హెచ్చించుటలో స్వప్రయోజనం ముఖ్యపాత్రగా నిర్వహించబడే వృత్తి

17 ధర్మం ఒక జ్ఞానస్వరూపం/మొదలంట మార్చగలుగునట్టిది (క్రాంతికారి) లేదా అది మిధ్య

18 మానవుడు రక్షణ గురించిన చింతన పూర్తిగా విడనాడినప్పుడే అతనికి నిజమైన రక్షణ/శాంతి సిద్ధించుతుంది

## No. 35: 18 CLUES

1. It is not easy to break through the natural conservatism of the **Banker / Farmer**
2. **Democracy / Equality** can never be true in a society where greed grows uncontrolled and people are drugged with admiration for power politics.
3. In this land of a thousand and one gods, why is there such delivery and such **Despair / Misery?**
4. Democracy is in essence a way of life, a way of life where the **Dignity / Liberty** of the individual is not smothered
5. With the growth of national consciousness and civilized ways of life **Education / Religion** becomes ethical and reflective
6. To be weighty and effective, criticism must be just, **Emphatic / Sympathetic** and constructive
7. Wise judges are fully conscious of their **Fallibility / Responsibility**
8. **Forgiveness / Happiness** is not possible without the capacity to forget
9. The fire and zeal for a cause have now gone Amongst the people at large there is stagnation, apathy and a pathetic **Helplessness / Listlessness**
10. The dominant note of Indian philosophy is **Idealistic / Realistic**
11. Is it possible to **Live / Love** without jealousy?
12. Nothing in this Universe **Lives / Moves** without a purpose.
13. The administration of any country should be guided by **National / Spiritual** considerations
14. Far too often in our country bad economics is being trotted out as good **Policy / Politics**
15. Education still carries with it a great deal of social **Prejudice / Prestige**
16. Teaching like agriculture is an occupation where personal interest plays a large part in increasing **Productivity / Progress**
17. **Religion** is **Reason / Revolutionary** or it is nothing
18. True **Security / Tranquility** comes to man only when he gives up all thought of security

గమనిక పై క్లూలు భారతీయ గ్రంథకర్తల, పుస్తకములనుండి తీసుకొనబడినవి అవి పూర్తి వాక్యములు మరియు వేరువేరుగా పూర్తి అర్థవంతమైనవి గ్రంధకర్తలు, వారి పుస్తకముల పేర్లు అఫిషియల్ సొల్యూషన్‌తోపాటు లిటరరీ క్విజ్ పత్రికలో ప్రచురించబడును.

## మారేజ్ సినిమా...

చేసుకో"

"ఎలా? వాళ్ళూరు చాలా దూరం"

"సెలవు పెట్టి వెళ్ళ కావాలంటే నేనూ వస్తా"

"నువ్వురాకుండా ఎలా. అయినా కాంతాన్ని మాత్రం ప్రేమించడం ఎలా?"

"మారేజి సినిమా స్టయిల్..."

"అంటే ?"

"ఇప్పుడు దాకా ఏం చూశావ్.. . తెలుగు సినిమా చూళ్ళా ? అప్పుడే మరచిపోయావా? ఒట్టిమట్టి బుర్ర ముందు యింటికి నడు అత్తమ్మ గారింటికి వెళ్తున్నానని బామ్మతో చెప్పు తనూ వస్తానంటుందేమో నేనున్నానని చెప్పు. నేనూ ఇప్పుడే వచ్చేస్తా"

* * *

అనుకున్న ప్రకారం జ్ఞానసంబంధం, ప్రేమారావు, ఆ వూరిలో ఒక లాడ్జిలో దిగారు

వ్యవహారాన్ని ఎలా నడిపించాలో అంతా పూస



గుచ్చినట్లు దార్లో జ్ఞానసంబంధం నూరిపోశాడు ఏది ఎక్కడ మరచిపోతాడోనని ట్రైనింగ్ పట్టించి తిరిగి ఒప్పజెప్పించుకొన్నాడు కూడా

సినిమా కథని పూర్తిగా వల్లింపు వేయించాడు మళ్ళీ ఆ వూళ్ళో ఆడుతుంటే మరేదైనా తెలుగు సినిమా చూస్తే అదే గుర్తొస్తుందిలే భయపడకు అని భరోసా ఇచ్చాడు

కాంతం ఏ కాలేజీలో చదువుతున్నదీ బామ్మకు తెలీదు చెప్పలేక పోయింది

"నేనోసారి అత్తయ్యగారింటికి వెళ్తేస్తా వివరాలన్నీ పట్టుగొస్తా." అన్నాడు ప్రేమారావు.

"నువ్వూ వాళ్ళూ కలసి ఏ గోతిలోనన్నా దిగండి తర్వాత నాకీ వివరాలన్నీ ఎందుకు?" అన్నాడు జ్ఞానసంబంధం

"మరే అవును కదూ" అని బుద్ధిమంతుడిలా కూర్చున్నాడు ప్రేమారావు

కాంతం కాలేజీ అడ్రసు తెలుసుకోవడం జ్ఞానసంబంధానికేం కష్టం కాలేదు ప్రేమారావు ప్రయత్నించిన ప్రయత్నం విఫలమయిన కారణంగా తనే ప్రయత్నించాడు. తర్వాత చేయవలసిన పనంతా

# 15 వారాలు 100 ఏజెంట్లు 170 పత్రికలలో ప్రకటనలు





లిట్‌క్విజ్ నెం. 33 లో

రు. 17,500

ఒకే ఒక ఎంట్రీతో

గెలుపొందెను.

శ్రీ బి. శ్రీధరన్

120. వి. ఓ. సి. రోడ్,

కారైకుడి-1. (ద. ఇం.

---

## లిట్ క్విజ్ నెం. 35 అధికార ఎంట్రీ ఫారము

ఆఖరు ముగింపు తేదీ 10-7-68 బుధవారం

**ADDRESS: LITQUIZ No 34, ALANKAR, BALARAM STREET, BOMBAY-7. (W B)**

గమనిక: (1) ఒక్కొక్క కాలంలో మీరు వద్దనే పదమును కొట్టివేయుండి. (2) ఒక కూపన్‌మాత్రం పంపినచో ఇతర కూపనులను కొట్టివేయండి. (3) ఎంట్రీరుసుము M.O. ద్వారా పంపినచో, పోస్టాఫీసునుండిపొందిన M.O. రసీదును ఎంట్రీ ఫారమునకు జతపరచవలెను. M. O రసీదు లేని ఎంట్రీలు నిరాకరింపబడును. (4) I. P. O. క్రాస్ చేయవద్దు. అది లిట్‌క్విజ్ నెం 35, బొంబాయి-7 వారికి చెల్లించునట్లు ఉండవలెను.

| No. | Rs 1 (1) | | Rs 1 (2) | | Rs 1 (3) | | Rs 1 (4) | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | BANKER | FARMER | BANKER | FARMER | BANKER | FARMER | BANKER | FARMER |
| 2 | DEMOCRACY | EQUALITY | DEMOCRACY | EQUALITY | DEMOCRACY | EQUALITY | DEMOCRACY | EQUALITY |
| 3 | DESPAIR | MISERY | DESPAIR | MISERY | DESPAIR | MISERY | DESPAIR | MISERY |
| 4 | DIGNITY | LIBERTY | DIGNITY | LIBERTY | DIGNITY | LIBERTY | DIGNITY | LIBERTY |
| 5 | EDUCATION | RELIGION | EDUCATION | RELIGION | EDUCATION | RELIGION | EDUCATION | RELIGION |
| 6 | EMPHATIC | SYMPATHETIC | EMPHATIC | SYMPATHETIC | EMPHATIC | SYMPATHETIC | EMPHATIC | SYMPATHETIC |
| 7 | FALLIBILITY | RESPONSIBILITY | FALLIBILITY | RESPONSIBILITY | FALLIBILITY | RESPONSIBILITY | FALLIBILITY | RESPONSIBILITY |
| 8 | FORGIVENESS | HAPPINESS | FORGIVENESS | HAPPINESS | FORGIVENESS | HAPPINESS | FORGIVENESS | HAPPINESS |
| 9 | HELPLESSNESS | LISTLESSNESS | HELPLESSNESS | LISTLESSNESS | HELPLESSNESS | LISTLESSNESS | HELPLESSNESS | LISTLESSNESS |
| 10 | IDEALISTIC | REALISTIC | IDEALISTIC | REALISTIC | IDEALISTIC | REALISTIC | IDEALISTIC | REALISTIC |
| 11 | LIVE | LOVE | LIVE | LOVE | LIVE | LOVE | LIVE | LOVE |
| 12 | LIVES | MOVES | LIVES | MOVES | LIVES | MOVES | LIVES | MOVES |
| 13 | NATIONAL | SPIRITUAL | NATIONAL | SPIRITUAL | NATIONAL | SPIRITUAL | NATIONAL | SPIRITUAL |
| 14 | POLICY | POLITICS | POLICY | POLITICS | POLICY | POLITICS | POLICY | POLITICS |
| 15 | PREJUDICE | PRESTIGE | PREJUDICE | PRESTIGE | PREJUDICE | PRESTIGE | PREJUDICE | PRESTIGE |
| 16 | PRODUCTIVITY | PROGRESS | PRODUCTIVITY | PROGRESS | PRODUCTIVITY | PROGRESS | PRODUCTIVITY | PROGRESS |
| 17 | REASON | REVOLUTIONARY | REASON | REVOLUTIONARY | REASON | REVOLUTIONARY | REASON | REVOLUTIONARY |
| 18 | SECURITY | TRANQUILLITY | SECURITY | TRANQUILLITY | SECURITY | TRANQUILLITY | SECURITY | TRANQUILLITY |

NO 35 SEND FIRST TWO COUPONS & ENTER MINIQUIZ (A) FREE — Rs 50000 — SEND FOUR COUPONS & ENTER BOTH MINIQUIZ (A & B) FREE

**MiniQuiz (A)** — 6 CLUES FREE COUPON

| | |
|---|---|
| BANKER | FARMER |
| DEMOCRACY | EQUALITY |
| DESPAIR | MISERY |
| DIGNITY | LIBERTY |
| EDUCATION | RELIGION |
| EMPHATIC | SYMPATHETIC |

**MiniQuiz (B)** — 12 CLUES FREE COUPON

| | | | |
|---|---|---|---|
| FALLIBILITY | RESPONSIBILITY | NATIONAL | SPIRITUAL |
| FORGIVENESS | HAPPINESS | POLICY | POLITICS |
| HELPLESSNESS | LISTLESSNESS | PREJUDICE | PRESTIGE |
| IDEALISTIC | REALISTIC | PRODUCTIVITY | PROGRESS |
| LIVE | LOVE | REASON | REVOLUTIONARY |
| LIVES | MOVES | SECURITY | TRANQUILLITY |

**35**

**(ASVP)**

ఈ క్విజ్ ప్రవేశమునకు చెందిన నిబంధనలను షరతులను పాటించుటకు అంగీకరిస్తున్నాను. మరియు కాంపిటీషన్ ఎడిటరు గారి నిర్ణయమును తుది నిర్ణయముగాను, న్యాయబద్ధమైనదిగాను అంగీకరించుటకు ఆమోదిస్తున్నాను. ప్రతి కూపనుకు ఎంట్రీ ఫీజు రు. 1/-. ఈ పూర్తి ఎంట్రీ ఫారము (4 కూపనులకు) ఫీజు రు. 4/-. M. O. రసీదు/I.P.O./లిట్‌క్విజ్ క్యాష్ రసీదు/ప్రైజు కార్డు జతపరుస్తున్నాను. వాటి నెం............

CAPITAL LETTERS

NAME ..................................................

ADDRESS ..................................................

..................................................

— ఈ పూర్తి ఫారమును కత్తిరించి పంపవలెను —

లిట్‌క్విజ్ నెం. 1 నుండి 34 వరకు ప్రకటింపబడిన క్లూలన్నియు యిప్పుడు సొల్యూషను పదముల అక్షర క్రమమునను సరించి తేదీ 16-6-68 లిట్‌క్విజ్ వీక్లీలో ప్రకటింపబడినవి. 30 పైసలు పంపిన వారికి పంపబడును.

* సొల్యూషన్ వెంటనే పొందుటకు 10 పైసల స్టాంపు, స్వంత అడ్రసుగల కార్డును వెంటనే పంపవలెను. * లిట్‌క్విజ్ వీక్లీ 8 సంచికలకు రు. 2/- పంపవలెను.

ఆఖరు ముగింపు తేది: 10-7-68.
సొల్యూషన్ ఆంధ్రప్రభ: 14-7-68.

## మారేజ్ సినిమా...

[illegible] ంచాడు.

కాంతం కాలేజీనుంచి యింటికి వస్తున్నప్పుడు ప్రేమారావు దారికాశాడు

ప్రేమారావు కళ్ళబడగానే కాంతం కళ్ళు తళ తళా మెరిసాయి. మనస్సు ఉప్పొంగి పోయింది. అమాంతం కావలించుకున్నంత పని చేసింది.

"ఏమిటి బావా. . ఎప్పుడొచ్చావ్ ఉత్తరమన్నా రాయలేవే? బామ్మకులాసా? బామ్మని తీసుకొచ్చావా? ఒక్కడివే వచ్చావా? ఇక్కడెందుకు నిలబడ్డావ్.. ?" అంటూ ప్రశ్న పరంపరల్ని కురిపించింది

ప్రేమారావుకి ఏంచేయాలో పాలుపోలేదు అంతా అడ్డంతిరిగింది 'కాంతం నన్ను చిన్నప్పుడు చూసింది. ఇప్పుడు గుర్తుపట్టదు'అని జ్ఞానసంబంధాన్ని నమ్మించి దానికి తగ్గట్టుగా ప్లాను వేయించాను. ఇప్పుడు ప్లానంతా చెడింది తనను ఇట్టే గుర్తించింది ఇప్పుడెలా?

"ఏంబావా అలా అయిపోయావ్ బామ్మ కులాసానా" అనడిగింది కాంతం

"ఆ ... అఁబ్బే ఏం కులాసా? బామ్మ ఎక్స్‌కర్షనికి ఇలా వచ్చాను. వద్దామనే అనుకుంటున్నా.. "

విరగబడి నవ్వింది కాంతం

ఎందుకో ప్రేమారావుకి అర్థం కాలేదు

"బామ్మ ఎక్స్‌కర్షనకి వచ్చిందా బావా?" అంది తర్వాత మరీ ఎక్కువగా నవ్వుతూ.

ప్రేమారావుకి కూడా నవ్వొచ్చింది ఆ నవ్వులో సగం బలం వచ్చింది

"నా ఫ్రెండూ నేనూ ఎక్స్‌కర్షనుకని బయలుదేరాం . విశేషమేంలేదు " అన్నాడు తేరుకొని

"మా వూరిలో ఏం వుంది చూడ్డానికి? అయినా మీ ఫ్రెండూ నువ్వూ ఇద్దరే ఎక్స్‌కర్షన్‌కి రావడమేమిటి? అసలు నీ ఒంట్లో బావుంటుందా?"అంది కాంతం.

అతనికే మోహం వచ్చేలా వుంది అనుకున్నాడు ప్రేమారావు. సమయానికి జ్ఞానసంబంధం దగ్గర్లో లేనందుకు తిట్టుకున్నాడు

"వట్టినే అన్నానే పిల్లా నిన్ను చూడ్డానికే వచ్చాను " అన్నాడు నవ్వాలనుకున్న దానికంటే బిగ్గరగా నవ్వి ఎంత నిగ్రహించుకుందామన్నా ఆగలేదు హాస్యమాడాలనుకున్నది అపహాస్యంగా తయారయింది

"నన్ను చూడా లనుకుంటే రోడ్డమీదనా? మా వాళ్ళకి తెలిస్తే అసలుకి బెడిసికొడుతుంది తెలుసుగా మానాన్న సంగతి?" అంది కొంచెం కోపంగా.

మామయ్యని తలచుకున్నప్పుడు ప్రేమారావుకి చెమటపోసింది. చిన్నప్పుడు జాంచెట్టెక్కి కింద పడ్డందుకు కొట్టిన దెబ్బలు ఇంకా గుర్తున్నాయి

"బాబోయ్ మావయ్యతో ఈ విషయం చెప్పకు నీకు పుణ్యముంటుంది" అన్నాడు.

"అయితే యింటి కొస్తావా ?"

"ఊ "

"ఇప్పుడెక్కడుంటున్నావ్ [illegible]"

"లాడ్జిలో ." అన్నాడు నేరం చేసిన వాడిలా

"సాయంత్రం లోపులో యింటికి రాకపోతే చూడు....." అంటూ భయపెట్టి పారిపోయింది కాంతం

ప్రేమారావు గుండెల్లో రాయి పడింది. ఏం చెయ్యడానికి తోచలేదు అక్కడే పక్కనున్న పార్కులో సిమెంటు బెంచిమీద కూర్చొని ఆలోచనలోమునిగి పోయాడు

వెనకాల నుంచి ఎవరిదో చెయ్యి భుజం మీద పడినప్పుడు మెలకువ వచ్చి పైకి చూశాడు

జ్ఞానసంబంధం!

"భయపడకు మై డియర్ బోయ్ సినిమా చూశ్లే ? అదంతే నేననుకున్నట్టుగానే అయింది రెండోసారి ప్రయత్నించు " అన్నాడు దగ్గరగా కూర్చుంటూ

"ఇంకేం ప్రయత్నం ? ఇంటికి రాకపోతే వాళ్ళ నాన్నతో చెబుతానంది వాళ్ళ నాన్న వచ్చి రెక్కలు విరగ్గొట్టి తీసుకెడతాడు "

"అది క్లయిమాక్సు మరేం భయపడకు నేనున్నాను జరిగినదంతా నాకు చెప్పకు నేనంతా విన్నాను ఇప్పుడు నే చెప్పినట్టు చెయ్ ఒక్క హీరో ఒక్క హీరోయిన్‌తో పనికాదు మధ్యలో ఒక విలన్ కావాలి "

"విలన్నా ?"

"అవును మన పనికి ఎవర్నైనా పురమాయించాలి "

"ఎవరో ఎందుకు? మా మామే ఒక విలన్ "

"అబ్బే, నీ యీడువాడు కావాలోయ్ ముసలాళ్ళతో నీకు పంతాలేమిటి?"

"అదీ నిజమే అయితే ఎలా?"

"నీకు తట్టదు నాకు తెలుసుగా నిన్ను నమ్మిన వాడు, నువ్వు నమ్ముకున్నవాడు, మధ్యలో వచ్చి పిట్టని ఎగరేసుకుపోనివాడు, నమ్మకస్థుడు ఇప్పుడు మనకి కావాలి ఇంకా తట్టలేదూ ?"

"అయితే ఇంకెవరు? నువ్వే?"

"అబ్బే, నావల్ల యీపని కాదు."

"అలాగంటే ఎలా చెప్పు ? నిన్ను నమ్ముకునే కదా ఇంతవరకూ వచ్చానూ ? ఇప్పుడు కాదంటే నేనేమైపోతాను చెప్పు ? బాబ్బాబు ఇవి కాళ్ళు కాదు " అంటూ చేతులు పట్టుకున్నాడు

"సరే నువ్వంతలా అడిగినప్పుడు తప్పుతుందా? అయితే ఒక షరతు?"

"ఎన్ని షరతులయినా అంగీకరిస్తాను నువ్వు విలన్‌గా వుండు."

"నువ్వు ఎన్ని షరతులయినా అంగీకరించే పక్షంలో నేను అడగవలసిన అవసరంలేదు ఆలస్యం చేయకూడదు ఇప్పుడు మనం ఎక్కడున్నాం?"

"మా అత్తయ్య గారింటికి దగ్గర్లోనే "

"మీ అత్తయ్యగారిల్లు ఇక్కడికి దగ్గర అక్కడికి ఈ పార్కు దగ్గర " అంటూ ఏదో లెక్కవేస్తున్నట్టుగా కాస్సేపు ఆలోచించాడు

"మీ అత్తయ్య గారింట్లో ఇంకా చిన్నపిల్లలు ఎవరైనా వున్నారా?"

"[illegible] గారికి చిన్నపిల్లలు [illegible] అయిదుగురు ఆడపిల్లల తర్వాత వాడొక్కడే.!"

"నీవిట్టుకు తర్వాత నవ్వుతాగాని ఇక్కడ లెక్క తాంమ్మని కుదిరింది. మీకాంతం ఇప్పుడిక్కడికి వస్తుంది కొమెంత? నా పాలి ఆగిపోయింది యింటి కెళ్ళాక కొత్తది కొనిస్తాగాని.."

పెద్దషరతే అని లోపల అనుకుంటూ "ఆలాయింది" అన్నాడు పైకి

సరే ఈ లోపులో ఆ వేరుశనక్కాయలు తిను. అంటూ ఆ 'అబ్బీ'ని పిలిచాడు

పప్పులు వొలుచుకొంటూ,

పార్కులో అడుగెడుతున్న పిల్లవాణ్ని చూసి 'మీ బామ్మరిదా?" అన్నాడు జ్ఞానసంబంధం.

ఆవెనకే కాంతం జిగేల్‌మని వస్తూండడం చూసి "ఆ బామ్మరిదే" అన్నాడు. గట్టిగా ఉత్సాహంగా

"నువ్వు గట్టిగా అరవకు ఆ సంపెంగ పొద చాటుకి తప్పుకో " అన్నాడు జ్ఞానసంబంధం

ఇష్టం లేకపోయినా అలా చేయక తప్పలేదు ప్రేమారావుకి

జ్ఞానసంబంధం కూడా అక్కడనుంచి లేచి కొంచెం అటుగా వెళ్ళి జేబులోంచి పొడుగాటి మఫ్లర్ తీసి మెళ్ళో ముడేసుకొన్నాడు నల్ల కళ్ళద్దాలు పెట్టుకున్నాడు. క్రాఫింగ్ అదీ చెరిపేసుకున్నాడు

ఈ లోపులో జ్ఞానసంబంధం ఖాళీ చేసిన బెంచీ మీద కాంతం కూర్చుంది కూర్చుని తనలో తానే నవ్వుకుంటోంది కుర్రాడు దూరంగా బంతితో ఆడుకుంటున్నాడు

జ్ఞానసంబంధం మఫ్లర్ బిగించుకొని, వేరుశెనక్కాయ గింజలు ఒక్కొక్కటే నోట్లో వేసుకుంటూ కుర్రాడి దగ్గరికి వచ్చి.

"ఏం పేరబ్బాయ్ " అన్నాడు కుర్రాడి భుజాలు నవిరిస్తూ కాంతానికేసి చూస్తూ.

"నీ కెందుకబ్బాయ్ ?" అన్నాడు ఆడే బంతిని జ్ఞానసంబంధ ముఖానికేసి కొట్టి

అదిరిపడి, కళ్ళజోడు సర్దుకొని, 'గడుసున్నాడే' అనుకుంటూండగా కాంతం అతని దగ్గరికొచ్చింది. గుడ్లురిమి చూసింది

జ్ఞానసంబంధం నోరు వంకరగా పెట్టి 'ఏహెహే' అని—

"మీ తమ్ముడా?" అన్నాడు

"హవ్వన్ను" అంది గట్టిగా.

"గట్టాడు " అన్నాడు కళ్ళజోడు ఒత్తుకుని పోయిన ముక్కు నిమురుకుంటూ

"వాడి జోలికి వెళ్తే అంతే ." అంది కాంతం రుసరుసలాడుతూ

"మీకూ చాలా కోపం ప్రేమారావు చెప్తుంటే వాడులెండి "

ప్రేమారావు పేరు వినేసరికి వాసన్నాసిన విన్న నాగుపాములా ఆనందం కనబడ్డింది కాంతం. ముఖం ప్రసన్నం చేసుకుని—

"మా బావ మీకు తెలుసునా?" అంది

"ప్రేమారావు మీబావా మీ బావగా తెలియ[illegible]



[illegible]

[illegible] నాకు తెలుసు" అన్నాడు.

"ఎవరో ఫ్రెండుతో వచ్చానన్నాడు. అంటే మీరేనా? మా బావేడీ? వన్నెలా గుర్తుపట్టారు? మా బావ మాయింటికొచ్చాని వెళ్ళాడా? అయ్యో సమయానికి నేనూ ఇలా వచ్చేశానే?"

"మీరేం మనవ్వు పాడు చేసుకోకండి. అన్నీ పక్రమంగా నే చేశాను."

"ఏమిటి మీరనేది?"

"అవును ప్రేమారావు మీయింటికి రాడు"

"ఎందుకు?"

"ఎందుకేమిటి? రాడంతే! మీరేమో మీనాన్నని దండయాత్రకి పంపిస్తానన్నరట, అతనేమో యింటికి పరుగెత్తాడు"

"ఏమిటి మీరనేది నిజమా?"

"అవును కటిక నిజం నేనే అతన్ని యింటికి పంపేశాను."

"మీకేం పట్టింది?"

"పట్టింది గనకనే పంపేశాను పట్టకే విందుకు పంపుతాను? నాప్లాను పాడు చేయడానికి ఎన్ని గుండెలున్నాయ్ మీకు?"

"నాకేమో గందరగోళంగా వుంది ఇదంతా కలో నిజమో కూడా తెలియడంలేదు మీరు కావాలని నాతో పోట్లాట పెట్టుకునేలా వుంది మీప్లాను నేను పాడు చేయడమేమిటి?"

"అదంతా నీ కవసరం నువ్వు ప్రేమారావుని ప్రేమిస్తున్నావా?"

నువ్వు అనే సంబోధనకి కాంతం వళ్ళు మండింది అయినా ప్రస్తుతాంశం మంచిది కనక నిలదొక్కుకుంది

"ఏం, మాటాడవేం?"

"నాకు పెళ్ళంటూ జరిగితే బావతోనే జరుగుతుంది?"

"బావంటే విబావ?"

అదేమిటి అలా ఉరుముతావ్? నెమ్మదిగా మాట్లాడు నాకు ఒక్కడే బావ ప్రేమారావు, అతనే నా సర్వస్వం"

"వాడుట్టి వాజెమ్మ."

"అయినా సరే!"

"వాడుట్టి చవట."

"అయినా సరే!"

జ్ఞానసంబంధం కొంచెం ఆలోచించి, ఆమె చెవి దగ్గరగా వొంగి

రహస్యం చెపుతున్నట్లుగా—

"ఆస్తికోసమా?" అన్నాడు

"కాదు పుస్తికోసం నాకేం మడులూ మాన్యాలూ అక్కరలేదు" అంటూ సీతా అనసూయ కథలు కొన్ని చెప్పింది

సెభాష్ కథ రక్తిలో పడిందని మెచ్చుకున్నాడు లోలోపలే జ్ఞానసంబంధం

"నిన్ను చూస్తుంటే నాకు జాలేస్తుంది వాడేమో ప్రేమించి పెళ్ళి చేసుకోవాలని చూస్తున్నాడు నువ్వేమో వాడినే పెళ్ళి చేసుకోవాలని చూస్తున్నావ్ ..." అన్నాడు మళ్ళీ

"నిజమా? మా బావ ప్రేమిస్తున్నాడా? ఎవర్ని?" అంది గాభరాగా

"[illegible] నీ [illegible] నీ మేలు కోరి చెబుతున్నా యిక నీ బావమీద ఆశలుచంపుకో అతని పాడయినా గిట్టనివ్వకు మీ నాన్నని అతని కోసం లాడ్జికి పంపాల్సిన అవసరం ఇక నీకులేదు తెలిసిందా? చూడు. నీ గురించి ఎంత నిజాన్ని చెబుతున్నానో ..... వాడు నా ప్రాణమిత్రుడు అయినా నీ కీ నిజం చెప్పక తప్పడం లేదు ఇదంతా చేస్తున్నానంటే ఎవరికోసం? ఎందుకోసం?" (నీ కోసమేనని అను కాకపోతే డైలాగు తప్పుతుంది అనుకున్నాడు మనసులో)

"నా కోసం మీరు దేవుళ్ళు మా బావ ఇలాంటి వాడని నాకు తెలీదు మోసపోయాను" అంది

"ఇక నా పనయిపోయింది, నే వెళ్ళిపోతా మీ నాన్నని లాడ్జికి పంపకు పంపవన్నమాటేగా?" అన్నాడు

ముక్కు దగ్గరి జేబురుమాలు తీసి—

"అలాగే" అన్నట్లుగా తల వూపింది

జ్ఞానసంబంధం డొంకచాటుకొచ్చి, "ఎలా వుంది?" అన్నాడు ప్రేమారావుతో

"ఏడ్చినట్లుగా వుంది విలన్ అంటే అంతేనేమిటి? నువ్వు ప్రేమించానని చెప్పు ఏమంటుందో చూద్దాం"

"ఏమంటుందో నాకు తెలుసుగాని, నువు కాస్త నోర్మూసుకో" అన్నాడు కోపంగా జ్ఞానసంబంధం

"అది కాదోయ్ అప్పుడే ఏమయింది చెప్పు ఈ అవకాశాన్ని విడిచిపెట్టుకుంటే ఎలా? కాంతం దృష్టిలో నేనెలానూ చెడ్డవాణ్ణి అయాను మా యిద్దరికీ పెళ్ళి ఖాయమనుకో అది తర్వాత ఇప్పుడు నీ మీద మొగ్గుతుందేమో చూద్దాం నేనూ కాంతాన్ని పరీక్షించాలి ఈ మాత్రం సాయం చేయలేవు? ఈపగాచి సక్కని పాలేస్తానంటావేం?" అని ప్రార్థించాడు ప్రేమారావు

"లెక్క తప్పుతుందోయ్" అన్నాడు జ్ఞానసంబంధం

"పాడు లెక్కలూ నువ్వూనూ నా లెక్కకి [illegible] బయటికి గెంటాడు

కాంతం అప్పటికే తమ్ముడి చేయి పట్టుకుని, వాడు ఏడుస్తున్నా వినిపించుకోకుండా లాక్కెళ్ళి పోతోంది

"ఏమండీ.. మిమ్మల్నే......."

అని పిలిచాడు జ్ఞానసంబంధం.

చిర్రున చీది, కళ్ళు తుడుచుకొని వెనక్కి తిరిగి చూసింది కాంతం

"అప్పుడే వెళ్ళిపోతున్నారా? ఇలా రండి మీతో మాట్లాడాలి" అన్నాడు

రెండడుగులు ముందుకువేసి ఎందుకన్నట్లు చూసింది కాంతం

"అలా కూర్చోండి మీరు నిలబడే వున్నారు. అసలే దుఃఖభారంతో కృంగిపోతున్న మిమ్మల్ని ఎలా ఉపశమింప చేయాలో తెలియకుండా వుంది."

కుర్రాడు ఏడుపు మానేశాడు. [illegible] ఆసక్తిగా వింటున్నాడు

"మీ దుఃఖభారాన్ని తగ్గించుదామనే మిమ్మల్ని మళ్ళీ పిలిచాను"

"ఏం? బావ గురించి మళ్ళీ ఏమైనా తెలిసిందా? నన్ను పెళ్ళి చేసుకుంటాడా?"

"అదేంకాదు, వాడి ప్రసక్తి మీ నోటి మంచి రావడం నేను సహించలేను వాడి పేరెత్తితేనే పంచమహా పాతకాలు చుట్టుకుంటాయ్?"

"మీరనే దేమిటి?"

"ఏంలేదు" అంటూ నాన్చాడు.

"చెప్పండి ఫర్వాలేదు పగిలిపోయిన గుండె మీద ఎన్ని బండలున్నా పడనివ్వండి ఫర్వాలేదు"

"మరేంలేదు మిమ్మల్ని చూసిన మొదటి చూపులోనే నేనేదో ఏదో అయిపోయాను సరిగ్గా చెప్పడానికి నాకు డైలాగులు రావడంలేదు, నేను మీ దాసుణ్ని నన్ననుగ్రహించండి మనసా, వాచా మిమ్మల్ని ప్రేమిస్తున్నాను ప్లీజ్"

కాంతం కాలికి పసుక్కున ముల్లు గుచ్చు

ఇప్పటికి వరకూ మా అమ్మాయి యాభై రెండు చిత్రాల్లో నటించింది!

యాభై చిత్రాల్లో ఎక్స్‌ట్రాగానూ, రెండు చిత్రాల్లో .........

కాలేజీ వదిలింది. అంతే, వారెక్కడనుంచో చెప్పు చేతిలో కొచ్చింది. ఊరుకోలేదు జ్ఞానసంబంధం చవడలు "ఇడియట్ డామ్ డర్టీగూస్ " అంటూ వాయగొట్టి ఆ కోపోద్రేకంతో చిందులు తొక్కుతూ చరచర వెళ్ళిపోయింది

కుర్రాడు గుడ్లు మిటకరించి చూసి జ్ఞాన సంబంధాన్ని ఒక తన్ను తన్ని పరుగెత్తాడు

ప్రేమారావు చాటు నుంచి అక్కడికొచ్చేలోగా యింత గొడవా జరిగిపోయింది

చెంపలు చేతబట్టి కూలబడిన జ్ఞానసంబంధం ముందు, దోషిలా నిలబడి నేల చూపులు చూడ సాగాడు.

జ్ఞానసంబంధం మాట్లాళ్ళేదు లాడ్జికి వెళ్ళే వరకు మాట్లాళ్ళేదు

"లెక్క తప్పలేదు తప్పదు " అన్నాడు ఆనక ప్రేమారావు చేసిన ఉపచర్యల అనంతరం

జ్ఞానసంబంధం కూకలేస్తాడేమోనని చాలా భయపడ్డాడు ప్రేమారావు కాని, అతను ఏమీ మాట్లాళ్ళేదు. అందుకు కొంత సంతోషించాడు

జ్ఞానసంబంధం లెక్కప్రకారమే మర్నాడు ఉదయించింది

"చెప్పింది గుర్తుందా?" అన్నాడు పన్నెండో సారి ప్రేమారావుతో.

"బేషుగ్గా "

"అయితే కాలేజీ టయిము జ్ఞాపకం పెట్టుకో

## మారేజ్ సినిమా...

మొహంనొప్పి తలనొప్పి కడుపులో తిప్పు అన్నీ నా మీద సవాలు చేస్తున్నాయ్ నేను రాలేను వెళ్ళు విష్ యు గుడ్‌లక్ " అన్నాడు ఆయాసంగా

కాంతాన్ని మొదట కలుసుకొన్న చోటికే వచ్చి నిలబడ్డాడు ప్రేమారావు ఎంతసేపటికీ కాంతం ఆ దారిన రాకపోయేసరికి 'ఇవ్వాళ కాలేజీకి వెళ్ళదేమో' అనుకున్నాడు

అంతలో కొన్ని మంజులమరాళ గళాలు విని పించాయి

కొంతమంది ఆడపిల్లలు జట్టుగా వస్తున్నారు అందులో కాంతం కూడా వుంది గుండె దిటవు చేసుకొని నిలబడ్డాడు ప్రేమారావు

కాంతం ఏదో వూహాలోకంలో వుంది కాబోలు! ఎక్కడా పక్కలకి చూడడం లేదు భూమిని కొలుచుకొంటూ నడుస్తోంది ఆ జట్టు అతన్ని దాటిపోతున్నా ఎవరూ ప్రేమారావుని లక్ష్య పెట లేదు

ఇక లాభం లేదనుకొని

"కాంతా " అని పిలిచాడు

కాంతం వెనక్కి చూడలేదు గాని, కాంత లంతా చూశారు కాంతాన్ని తట్టి చూపించారు

కాంత అతన్ని చూసి మళ్ళీ మామూలుగా దిరచేసుకుంటుంది. వాళ్ళతో వెళ్ళిపోతున్నవాళ్ళ మళ్ళీ పిలిచాడు

"కాంతా నీతో మాట్లాడాలి రావూ నా మీద కోపమా? ఏలా?" అన్నాడు జాలిగా

"మీరు నడుస్తుండండి " అంటూ వాళ్ళతో చెప్పింది

అతని దగ్గరికి వచ్చి—

"నేనసలు నీకు గుర్తున్నానా?" అన్నది కటు వుగా ఎవరూ వినకుండా

"నేను నిన్ను ప్రేమిస్తున్నాను కాంతా నిజంగా. ఎంతగా ప్రేమిస్తున్నానో చెప్పలేకుండా వున్నాను. రాత్రిళ్ళు నిద్రపట్టదు పగలు ఏ పనీ చెయ్య బుద్ధవదు మనస్సంతా నీ మీదనే ఆశలన్నీ నీ మీదనే " అన్నాడు పారం వొప్పజెప్పినట్లు

"అంతా పచ్చిమోసం " అంది గట్టిగా కాంతం.

"నిజం కాంతా నిన్ను నిజంగానే ప్రేమిస్తున్నాను నిన్ను నేను పెళ్లి చేసుకుంటాను ", అన్నాడు అర్థిస్తున్నట్లుగా

"నీదంతా నాటకం నీ గురించి నాకు ముందు గానే తెలుసు కల్లబొల్లి కబుర్లు చెప్పకు "

"నిజం కాంతా నా మాట నమ్ము నువ్వు అంగీకరించకపోతే నేను లేను చస్తాను. నిజం. నన్ను నువు ప్రేమించకపోతే విషం తిని చస్తాను. నన్ను ప్రేమించు కాంతా నిన్ను పెళ్లి చేసుకుంటాను " అన్నాడు

అప్పటికే కాంత తోటివాళ్ళు ఆ దరిదాపులకి వచ్చేశారు ప్రేమారావు పిచ్చి పేలాపన వాళ్లకి వెగటు పుట్టించింది

అందరూ తిట్లు మొదలెట్టారు ఒకమ్మాయి కొట్టడానికి చెయ్యెత్తింది రెండో అమ్మాయి కొట్టింది మూడో అమ్మాయి చెప్పు తీసింది. నాలుగో అమ్మాయి ఆపని చేసింది

అక్కడికి దగ్గరగా వున్న పోలీసు వెంకటస్వామి రంగంలో ప్రవేశించి—

'అమ్మాయిల్ని అల్లరి పెడుతున్నటు ' కేసు రాసుకున్నాడు

ప్రేమారావు గుండె గాభరా ఎత్తింది. పై ప్రాణాలు పైనే పోయాయి

టాక్సీలో ఆఫీసు కెళ్తున్న కాంతం తండ్రి అటుగా వచ్చి గొడవంతా వింటున్నాడు

అసలు కథంతా కాంతానికి వూపగుచ్చినట్లు చెప్పి మొర్రో అంటూ మొత్తుకున్నాడు ప్రేమారావు

అమ్మాయిలు క్షమాపణ చెప్పుకొని గేలిచేశారు.

కాంతం ప్రేమారావుని చూసి జాలిపడింది.

'మారేజి సినిమా స్టయిల్' అంటూ గొణుక్కుంటూ వెళ్ళిపోయాడు పోలీసు వెంకటస్వామి.

కాంతాన్ని, ప్రేమారావుని టాక్సీ ఎక్కించుకుని ఇంటికి తీసుకెళ్ళాడు ముసలాయన. ●

డాక్టర్ల కబుర్లు

## శాక్కరిన్ ప్రభావం

శాక్కరిన్ పేరు ఈమధ్య— చక్కెర కొరతవల్ల!— అందరికీ బాగా తెలిసిపోయింది అతిమూత్ర వ్యాధి వగయిరా కల రోగుల సంగతి సరేసరి!

ఇది చాలా నిరపాయకరమయిన తీపి వస్తువు అంటారు కాని, ఇద్దరు డాక్టర్లు కొన్ని వింత గుణాలు గమనించారు.

వీరిలో ఒకరు దద్దులతో బాధపడి శాక్కరిన్ కారణమయి ఉండవచ్చునని అనుమానించారు, అవి తగ్గిపోగానే నాలిక కింద కొంత శాక్కరిన్ ఉంచుకున్నారు రెండు నిముషాలలో గుండెలో దడ, చెమట పొయ్యటం తిరిగి దద్దులు రావటం జరిగింది.

రెండవ డాక్టరుకి దురదలువచ్చాయి అలవాటుగా శాక్కరిన్ పుచ్చుకునేవాడు. ఏదో ప్రయాణంమీద వెళ్లి శాక్కరిన్ మానివెయ్యవలసి వచ్చింది దురదలు తగ్గిపోయాయి ఇంటికి వచ్చేసిన తర్వాత శాక్కరిన్ పుచ్చుకొనటంతో దురదలు మళ్ళీ ప్రారంభం అయ్యాయి శాక్కరిన్ వాడకం పూర్తిగా ఆపి వేశాడు .

శాక్కరిన్ వాడకంలో మరింత పరిశోధన అవసరమా?

హెచ్. ఎల్ హెర్మెన్‌సోన్

( కాపీరయిటు. )

# మీరు పుట్టిన ఇంగ్లీషు తేదీని అనుసరించి మీ స్వభావం? మీ మిత్రులు?

## మిధునం

ఇది రాసులలో మూడవది. ప్రతిసంవత్సరం మే 22వ తేదీనుంచి జూన్21వ తేదీవరకు సాయన సూర్యుడు మిధునరాసిలో ఉంటాడు కాబటి యీ యీతేదీలమధ్యను జన్మించినవారు మిధునరాశి యందు పుటినవారుగా పరిగణింపబడుచున్నారు. ఏసంవత్సరంలోనైనా సరే, ఈ తేదీల మధ్యను పుటిన వారికి మిధున రాశి ఫలితాలే వర్తిస్తాయి. దీనికి జనన కాలంతో గాని జన్మనక్షత్రంతోగాని నిమిత్తం లేదు

ఈరాశి ప్రారంభంలో అనగా మే 19—22 తేదీల మధ్యను పుటిన వారిమీద అంతకుముందు ఉన్న వృషభరాశి యొక్క ప్రభావం కూడా ఉంటుంది అలాగే రాశి ఆఖరున అనగా జూన్18—21 తేదీలలోమధ్యనుపుటిన వారిమీద రాబోయే కర్కాటకరాశిప్రభావం కూడా ఉంటుంది.

మిధునం అనగా దంపతులని అర్ధం. పాశ్చాత్యులు యీ రాశిని కవలలుగా భావిస్తున్నారు. ఇది ద్విస్వభావ రాశి. వాయువుకు సంబంధించిన రాసులలో యిది మొదటిది చాతుర్యమే తన సొత్తుగా గల బుధుడు యీ రాశికి అధిపతి.

ఈరాశియందు జన్మించినవారు సాధారణంగా ఆలోచనా పరులై ఉంటారు. వీరికి కొన్నివిషయాల్లో పరస్పర విరుద్ధాభిప్రాయాలు ఉండడం వలన యితరులు వీరిని అపార్ధం చేసికొనే అవకాశం ఉంది. వీరికి చాలా విషయాల్లో ప్రవేశం ఉంటుంది ఇతరుల అభిప్రాయాలకు అనుగుణంగా వ్యవహరిస్తూ వారు తమ పనులను పూర్తిచేసికొనగలరు

ఏవిషయంలోనైనా వీరు త్వరగా ఒకనిర్ణయానికి రాగలరు. కాని అంత త్వరలోనే వారు తమనిర్ణయాలను మార్చుకొనే అవకాశం కూడా ఉంది. వీరు యితరులు చేసిన అపకారాలను సులువుగా మరచి పోతారు వీరికి యేవిషయంలోనూ పటుదల లేకపోయే ప్రమాదం కూడా ఉంది.

వీరికి ఉన్నతాశయాలు ఉంటాయి కాని వాటిని ఆచరణలో పెటడానికి కావలసిన దృఢనిశ్చయం వీరివద్ద సాధారణంగా లోపిస్తుంది. నూతన విషయాలను తెల్సుకోవాలనే కుతూహలం వీరికి చాలా ఉంటుంది వీరు ఒకేసారి అనేక విషయాల్లో దృష్టిని ఉంచడం వలన యేందులోనూ చెప్పుకో దగినంత ప్రావీణ్యాన్ని సంపాదించ లేక పోవచ్చును.

ఏవిషయాన్నైనా వీరు సులభంగా గ్రహించగలరు తాము తెల్సుకొన్న ప్రతి విషయాన్నీ వీరు తమ హేతువాదంతో పరిశీలిస్తుంటారు. అందుచేత వీరు సామాన్యమైన సంఘటనల మంచికూడా నూతన విషయాలను గ్రహించగలరు.

తమ ఆలోచనలను వారు ఆచరణలో పెటడానికి తీవ్రంగా కృషి చేయవలసి ఉంటుంది. లేకపోతే వీరి ఆలోచల్లో చాలా భాగం కేవలం ఆలోచనలు గానే ఉండి పోతాయి.

### ద్రేక్కాణ ఫలం

మిధున రాశిలో మొదటి ద్రేక్కాణానికి (మే22—31 తేదీల మధ్యకాలం) గురుడు అధిపతి. ఈసమయం అంతగా అదృష్టవంతమైనది కాదు. ఈకాలంలో పుటినవారికి ఆత్మవిశ్వాసం అధికంగా ఉంటుంది. ఈఆత్మవిశ్వాసమే ఒక్కొక్కప్పుడు గర్వంగా మారి వీరి పతనానికి దారి తీస్తుంది. వీరు చాలా ఉదారంగా ప్రవర్తిస్తారు. స్వయం కృషివలన వీరు అభివృద్ధి లోనికి రాగలరు. వీరికి ఆలోచనా శక్తి కూడా అధికంగా ఉంటుంది కాని యేవిషయం లోనూ స్థిరమైన నిర్ణయానికి రాలేరు. తమకు తామే హానిని చేసికొనే పరిస్థితికూడా వారికి ఒక్కొక్కప్పుడు యేర్పడవచ్చును.

రెండవ ద్రేక్కాణానికి (జూన్ 1—11 తేదీల మధ్య కాలం) కుజుడు అధిపతి. వారు ముక్కుకు సూటిగా పోయేవారు కావడం వలన యితరులతో వీరికి తరుచుగా భేదాభిప్రాయాలు వస్తుంటాయి. వీరు తరుచుగా విఫల ప్రయత్నాలు చేస్తుంటారు. వీరికి సంబంధించని వ్యవహారాల్లోనే వీరి సమయంలో యెక్కువ భాగం గడచిపోతుంది వీరికి సామర్ధ్యం ఉంటుంది కాని నిలకడ లేకపోవడం వలన జీవితంలో వీరు విజయాన్ని సాధించలేరు పోరాటానికి ముందంజ వేసే స్వభావం ఉంటుంది.

మూడవ ద్రేక్కాణానికి (జూన్ 12—21 తేదీల మధ్యకాలం) సూర్యుడు అధిపతి. ఈరాశిలో యీ సమయం అదృష్ట వంతమైనది. వీరికి సూక్ష్మ బుద్ధి ఉంటుంది. ఆర్ధిక వ్యవహారాల్లోకంటే మానసిక వ్యవహారాల్లో వీరికి ఆసక్తి యెక్కువగా ఉంటుంది. దూర ప్రయాణాలు చేసి వీరు తమ పనుల్ని చక్కబెటుకొనగలరు వీరు యెప్పుడూ యేదో ఒకదానిని గురించి ప్రయత్నం చేస్తుండడం వలన జీవితంలో సుఖం తక్కువగా ఉంటుంది ఆరంభంలో శ్రమ కలిగినా, తుదకు అన్ని వ్యవహారాల్లోను అనుకూలతను సాధించగలరు.

సూచన—మొదట చెప్పబడిన రాశిఫలితానికి, తరువాత చెప్పబడిన ద్రేక్కాణ ఫలితానికి తేడా ఉన్నప్పుడు ద్రేక్కాణ ఫలితాన్నే గమనించాలి. ద్రేక్కాణ ఫలితమే సరిగ్గా సరిపోతున్నట్లు చాలా మంది అభిప్రాయం.

### మిధున రాశి యందు జన్మించిన భర్తతో వ్యవహరించడం యెలాగ?

వీరు తరుచుగా తమ అభిప్రాయాల్ని మార్చుకొంటారు. కాబటి వీరు మాటవరుసకు చెప్పే విషయాలను గురించి అంతగా పటించుకోవలసిన అవసరం లేదు. ఏవిషయాన్నైనా సరే వీరియిష్టానికి వదలి వేయడం మంచిది. అప్పుడే వారు 'యితరులకు అనుకూలంగా ప్రవర్తిస్తారు. 'తమకు' సంబంధించని, విషయాలను వీరు పటించుకోరు కాబటి అన్ని విషయాలను వీరితో చెప్పడం మంచిదికాదు. వీరికి కొన్ని విషయాల్లో పరస్పర విరుద్ధాభిప్రాయాలు ఉంటాయి. కాబటి వీరితో వాద ప్రతివాదాలకు దిగడంవలన అంతగా ప్రయోజనం ఉండదు. వీరు భౌతికవిషయాల్లోకంటే మానసిక విషయాల్లో సంతోషాన్ని పొందగలరు.

### మిధున రాశి యందు జన్మించిన భార్యతో వ్యవహరించడం యెలాగ?

వీరు తరుచుగా తమ ఊహాలోకంలోనే ఉంటారు కాబటి వీరి ఊహలకు భంగం కలిగించే పనిని చేయడం మంచిదికాదు. మిగిలిన వారికంటే వీరు యెక్కువగా ఊహించ గలరు. కాబటి అలంకరణ నిమిత్తం వీరు యెక్కువ ఖర్చు చేస్తుంటారు. వీరికి తొందరగా కోపం వచ్చినా అది యెంతసేపో ఉండదు. సలహారూపంలో యేపని చెప్పినా వారు చేస్తారుగాని ఆజ్ఞలను పాటించడం వీరికి సహించదు. తమ కుటుంబంలో స్నేహపూరిత వాతావరణమే ఉండాలని వారి కోరిక. అందుచేత దానికి యేమీ భంగం కలిగించకూడదు

### మిధున రాశి యందు జన్మించిన వారికి మిత్రులు యెవరు?

మిధున రాశియందు జన్మించిన మిత్రులు ఒకే స్వభావాన్ని కలిగివుంటారు. కాబటి వీరి స్నేహం చాలాకాలం ఉంటుంది. వీరి మధ్యను భేదాభిప్రాయాలు ఉండక పోవచ్చును. కాని ఒకరు చెప్పిన దానిని యింకొకరు వెంటనే అంగీకరించడం వలన వీరి మైత్రి ఉత్సాహంగా ఉండదు.

మిధునరాశియందు జన్మించినవారికి కర్కాటకరాశి (జూన్ 22—జూలై 22) యందు జన్మించినవారికి స్నేహం చాలా అరుదుగా ఉంటుంది. మిధున రాశివారు తరుచుగా తమ ఊహాలోకాల్లోనే ఉంటారు. 'అది కర్కాటకరాశి వారికి సహించదు.' కర్కాటకరాశివారు అన్ని విషయాల్లోను కృష

క్రమంగా అభివృద్ధిని సాధించాలని కోరుతూం టారు. అది మిధునరాశివారి స్వభావానికి విరుద్ధం. ఏదైనా బలవత్తరమైన కారణం వలన వారు సన్నిహితులు అయినా, ఆస్నేహం హృదయపూర్వ కంగా ఉండక పోవచ్చును.

మిధున రాశియందు జన్మించిన వారికి సింహరాశి (జూలై 23—ఆగసు 22) యందు జన్మించిన వారికి సాధారణంగా స్నేహం ఉంటుంది. మిధున రాశివారి వద్ద ఆలోచనలు ఉంటాయి. సింహ రాశివారివద్ద ఆచరణ శక్తి ఉంటుంది. అందుచేత వీరిమైత్రి ప్రయోజనకరంగా ఉంటుంది కాని సింహరాశివారి ఉదారస్వభావాన్ని మిధునరాశివారు దుర్వినియోగం చేసే ప్రమాదం ఉంది. వీరికి కలహం వస్తే అది చాలా దూరం వరకు వెళ్ళగలదు. మిధున రాశివారు తగినంత జాగ్రత్తతో ప్రవ ర్తిస్తే సింహరాశివారితో స్నేహం స్థిరంగా ఉంటుంది.

మిధున రాశియందు జన్మించిన వారికి కన్యా రాశి (ఆగసు 23—సెప్టెంబరు 22) యందు జన్మించిన వారికి స్నేహం చిత్రంగా ఉంటుంది. వీరు ఒకొరి నొకరు విమర్శించుకొంటారు కాని వెంటనే తిరిగి కల్సు కొంటారు. మిధున రాశివారికి మానసిక విషయాల మీద మోజు ఉంటుంది. కన్యారాశి వారికి భౌతిక విషయాల మీద ఆసక్తి యెక్కువగా ఉంటుంది. స్వభావంలో వీరికి చాలా భేదం ఉన్నా, ఆభేదమే వారి మధ్యను ఆకర్షణను కలిగిస్తుంది. ఇతరుల మూలంగా వీరి మధ్యను భేదాభిప్రాయాలు రావచ్చును.

మిధున రాశియందు జన్మించినవారికి తులా రాశి (సెప్టెంబరు 23— అక్టోబరు 22) యందు జన్మించిన వారికి మైత్రి బాగా ఉంటుంది. వీరి యిద్దరి స్వభావాల్లో పోలికలు చాలా వుంటాయి. కాని ఆచరణ భేదం ఉంటుంది. జ్ఞానం జ్ఞానం కోసమేనని మిధునరాశివారి అభిప్రాయం కాగా జ్ఞానా నికి కూడా ఒక ప్రయోజనం ఉంటుందని తులా రాశివారి అభిప్రాయం. అందుచేత వీరి మైత్రి వల్ల తులా రాశివారికే ఎక్కువ ప్రయోజనం ఉంటుంది. మిధున రాశి వారికంటే తులారాశివారి వద్ద వ్యవహార జ్ఞానం అధికంగా ఉంటుంది. కాబటి మిధున రాశివారు తులా రాశివారిని అనుస రించడం, మంచిది.

మిధున రాశియందు జన్మించిన వారికి వృశ్చిక రాశి(అక్టోబరు–23—నవంబరు 21)యందు జన్మి చిన వారికి స్నేహం అరుదుగా ఉంటుంది. మిధున రాశివారి ఊహాప్రపంచ నివాసం వృశ్చిక రాశివారికి సరిపడదు. కాని వృశ్చికరాశివారు ఉదారస్వభావులు కావడం వలన మిధున రాశివారి ఆలోచనలను కొంతవరకు సహించ గలరు. వృశ్చిక రాశివారివద్ద కార్య దక్షత ఉంటుంది. కాబటి మిధునరాశి వారు వృశ్చిక రాశివారిని అనుసరించడం మంచిది. వీరి మైత్రి యెంత దృఢంగా ఉన్నట్లు కన్పిం చినా, దానికి ఆకస్మికంగా భంగం కలిగే ప్రమా దం ఉంది. వీరి సంబంధం కేవలం పరిచయం గానే ఉండడం వలన యిరువురకూ ఉపయోగం

## విహారంపట్టిన ఇంగ్లీషు...

ఉంటుంది.

మిధున రాశియందు జన్మించిన వారికి ధనూరాశి (నవంబరు 22—డిశంబరు 21) యందు జన్మిం చినవారికి మైత్రి బాగా ఉంటుంది. మిధునరాశి వద్ద ఆలోచనలు ఉంటాయి. ధనూరాశివారివద్ద సాహసం పటుదల వుంటాయి కాబటి వీరు యిద్దరూ హృదయపూర్వకంగా ప్రయత్నించిన యెడల యెటువంటి పనినైనా సాధించగలరు. వీరి మధ్యను గౌరవ పూర్వకమైన సంబంధం ఉంటుంది. వీరు కొంచెం సంయమనంతో ప్రవ ర్తించిన యెడల వీరిమైత్రి చాలా ప్రయోజన కరంగా ఉంటుంది.

మిధునరాశియందు జన్మించినవారికి మకరరాశి (డిశంబరు 22—జనవరి 20) యందు జన్మించిన వారికి మైత్రి చాలా అరుదుగా ఉంటుంది. మకర రాశివారు యెంతసేపూ తమ గొడవలేతప్ప యితరులను గురించి అంతగా పటించుకొనరు. అది మిధున రాశివారికి నచ్చదు. మిధునరాశివారి ఆలో చనలు మకర రాశివారికి సరిపడవు అందుచేత వీరిమైత్రి కేవలం నామమాత్రంగా ఉంటుంది. బలవత్తరమైన కారణాలవలన వీరిమధ్య మైత్రి యేర్పడినా, అది హృదయ పూర్వకమైనదిగా ఉండక పోవచ్చును.

మిధున రాశియందు జన్మించిన వారికి, కుంభ రాశి (జనవరి 21—ఫిబ్రవరి 19) యందుజన్మిం చిన వారికి సహజమైన మైత్రి ఉంటుంది. వీరి ఆలోచనలు సమానంగా ఉన్నా, ఆచరణలో చాలా తేడా ఉంటుంది. కుంభరాశివారు ఉదార స్వభా వులు కాబటి మిధునరాశివారి చంచల స్వభావాన్ని చాలా వరకు సహిస్తారు. వీరు హృదయ పూర్వ కముగా ఒకరి నొకరు గౌరవిస్తుంటారు. అందు చేత వీరు కారణాంతరాలవలన విడిపోయినా, వీరి మధ్యను ఉండే గౌరవానికి భంగం కలుగదు. తమ మధ్యను మూడవ వారి ప్రమేయాన్ని వీరు సహించ కూడదు.

మిధున రాశియందు జన్మించిన వారికి, మీన




రాశి (ఫిబ్రవరి 20—మార్చి 21) యందుజన్మిం చిన వారికి సాధారణమైన మైత్రి ఉంటుంది. వీరి యిద్దరి మధ్యను అభిమానం సామాన్యంగా ఉంటుందికాని ఒకరివల్ల యింకొకరు ప్రయోజ నాన్ని కాంక్షిస్తుంటారు. మీనరాశివారువరి స్థితులకు అనుగుణంగా వ్యవహరించే వారుకాగలరు. అది మిధున రాశివారికి సహించదు. కాని దానివల్ల వీరి మైత్రికి భంగం కలగదు. వ్యాపారం మొదలైన వాటిలో వీరి కలయిక చాలా ప్రయో జన కరంగా ఉంటుంది.

మిధున రాశియందు జన్మించిన వారికి, మేష రాశి (మార్చి 22— ఏప్రిల్ 20) యందు జన్మిం చిన వారికి మైత్రి చాలా అరుదుగా ఉంటుంది, మేషరాశివారు తమ అభిప్రాయాలను యెదుటి వారిమీద రుద్దడానికి ప్రయత్నిస్తారు. మిధున రాశివారు ఆప్రయత్నాన్ని తమ వాద బలంతో యెదుర్కొంటారు. వాద ప్రతివాదాల్లో తరు చుగా మిధునరాశి వారిదే పైచెయ్యి కావడంవలన మేషరాశివారు వారిని తప్పించుకొని తిరుగుతుం టారు. బలమైన కారణం వలన వీరు మిత్రులు అయినా, ఆమైత్రి హృదయ పూర్వకంగా ఉండక పోవచ్చును.

మిధున రాశియందు జన్మించిన వారికి వృషభ రాశి (ఏప్రిల్21—మే 21) యందు జన్మించిన వారికి స్వభావంలో చాలా భేదం ఉంటుంది కాని ఒకసారి వీరికి స్నేహం యేర్పడితే అదిస్థిరంగా ఉంటుంది. వృషభరాశివారు ఆచరణకు ప్రాము ఖ్యతను యిస్తే మిధునరాశివారు ఆదర్శాలకు ప్రాముఖ్యతను యిస్తుంటారు. అందుచేత వీరి మైత్రి ఉభయ ప్రయోజనకరంగా ఉంటుంది.

### ఆరోగ్యం వగైరా

ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. వీరు తమ శక్తి వలన కంటే యుక్తివల్లనే కార్యసాధనచేయ గలరు. వీరు యెప్పుడూ యేదో ఒక దానిని గురించి ఆలోచించడం వలన అనారోగ్యంచేస్తుంది. హృదయ సంబంధమైన అనారోగ్యం చేయ వచ్చును.

వీరికి అదృష్టాన్ని కలిగించేవి రంగు— వెండి రంగు, పసుపు, లేత రంగులు. ధరించవలసినవి— వజ్రం (Diamond) వచ్చరాయి. (Aqua-marine)

సంఖ్యలు—5, 14, 23, 32, 41, 50 వగైరా.

వారాలు— బుధవారం.

నెలలు మే 22 మొదలు జూన్ 21

ఆగసు 23 మొదలు సెప్టెంబరు 22

సెప్టెంబరు23 మొదలు అక్టోబరు 22

జనవరి 21 మొదలు ఫిబ్రవరి 19

సంవత్సరాలు (వయస్సు) 5, 14, 23, 32, 41, 50, 59 వగైరా. —మహేష్

 చర్చ 

'సినిమాలలో అసభ్య వస్త్రాలంకరణ'పై శ్రీమతి కె. హేమలతగారు 21-6-68 సంచికలో రాసిన వ్యాసంపై చాలామంది పాఠకులు తమ తమ అభిప్రాయాలని రాశారు. వాటిలో ఒకటి ఈ వారం ప్రచురిస్తున్నాము.

—సం.

## కాలంతో పాటే మార్పు

కాలం మారుతోంది. దానితోబాటు సమాజం మారుతోంది. ఒకప్పుడు కాశీకి వెళ్ళినవాడు కాటికి వెళ్ళినవాడు సమానమనేవాళ్ళు. కాని యిప్పుడు 90 నిమిషములలో భూమిచుట్టూ ఒక ప్రదక్షిణం చేయగలుగుతున్నాడు మానవుడు. ఆడవారు కూడా, మగవాళ్ళతో సమంగా గగన వీధుల్లో విహరించగలుగుతున్నారు. మనమింకా పాత సంప్రదాయాలనే పట్టుకొని వ్రేలాడడం అవివేకం అసాధ్యం కూడాను. ఇక సినిమాలలో వస్త్రధారణ గురించి చెప్పాలంటే, అంత అసభ్యత ఏమీ కనిపించుటలేదు. సన్నివేశానికి, సంఘటనలకు తగినట్లుగా వస్త్రాలంకరణ చేయడం తప్పుగాదు. సినిమాలు సామాన్య మానవుని వినోదం కోసం ఎక్కువగా ఉపయోగపడుతున్నవి. సినిమాల కోసం వెళ్ళేవాళ్ళు మామూలు జీవితం నుంచి కొంత మార్పు, హాస్యం, శృంగారం, నాట్యం మొదలైనవి ఆశించి ఊహాలోకంలో విహరించి, సినిమా చూసినంతసేపు బాహ్యప్రపంచాన్ని మరచి ఆనందిస్తారు. ఆ పరిస్థితిలో, వస్త్రాలంకరణలోను, హావభావ ప్రదర్శనలోను, అంగవిన్యాసంలోను, స్త్రీ, పురుషులలో ఆకర్షణ కలుగజేయటానికి, ఆనందాన్ని అందజేయటానికి కొన్ని విచిత్ర విపరీత పరిస్థితులను సృష్టించుటలో తప్పులేదు. అసలు సినిమా ఆశయమే అది. మామూలు భార్యాభర్తల కీచులాటలు ఎప్పుడూ ఉండే రోదనలు, రోగాలు, ఆర్థిక బాధలు సినిమాలలో చూడాలని ఎవ్వరూ కోరు.

సినిమాలు అంత అసభ్యంగా ఉన్ననాడు ప్రజలే తమంత తాముగా చూడడం మానివేస్తారు. ప్రజాభిప్రాయానికి ప్రతిబింబాలే సినిమాలు. ప్రజల అభిరుచిని చూరగొనని సినిమాలు విజయవంతముగా లేవు. నిర్మాతలు గూడా అలాంటి సినిమాలు తీయ సాహసించరు. ప్రజలు హర్షిస్తున్నారు గాబట్టే నిర్మాతలు వారి అభిరుచుల కనుగుణమైన సినిమాలు తీస్తున్నారు. తమ వ్యతిరేకతను వ్యక్తం చేయాలంటే అలాంటి సినిమాలను ప్రజలే బహిష్కరించవచ్చును.

సినిమా తీయాలంటే సామాన్యమైన విషయం కాదు. లక్షలలో డబ్బు పెట్టుబడి పెట్టాలి. ఎంతో శ్రమపడాలి. అయినవాళ్ళని కానివాళ్ళని కాళ్ళు పట్టుకోవాలి. మనం సినిమాహాలులో కుషన్ చైర్‌లో కూర్చుని సినిమా చూసి ఆనందించినంత తేలికకాదు సినిమా తీయడం. అది కేవలం అనుభవైక వేద్యం. ఇంత ఖర్చుపెట్టి, యింత శ్రమపడి నిర్మాత సినిమా తీసేది, నష్టపడటానికికాదు. కనీసం తన పెట్టుబడి తనకు రావాలంటే కథ, శృంగారం, నాట్యం, సెక్సు, సంగీతం వగైరా సమపాళ్ళలో రంగరించి, ఆధునిక ప్రజాభిప్రాయానికి కనుగుణంగా అందించగలిగితేనే సాధ్యం. అలాకాని పక్షంలో "ప్రేమకథలు" తీయడం మానేసి చిప్పా కర్రా చేత పుచ్చుకోవాల్సి వస్తుంది. అంతటి సాహసానికి ఏ నిర్మాత ఒడికడతాడు?

పాత సాంప్రదాయాలను పాటించడం ధర్మమే. కాని ఈనాడు ఎంతమంది స్త్రీలు (చదువున్నవారే) నేత చీరెలు ధరిస్తున్నారు? మనదేశంలో చేనేతపరిశ్రమ పడిపోవటానికి ముఖ్యకారణం యిదే. ఎక్కడ చూచినా నైలాను, టెరిలీను, ప్లాస్టిక్, వీపులు కనిపించేటట్టు, వళ్ళంతా కనిపించేటట్టు, కురచ చీరెలే కనిపిస్తున్నవి. ఇది కేవలం సినిమాలను చూసే అనుకరిస్తున్నారనుకోవడం పొరపాటు. అలాంటి అభిరుచి ఉండబట్టే అవి ధరిస్తున్నారు. పాత సాంప్రదాయాలను అనుసరించేవారిని కాదనేవారుండరు. అనుభవపూర్వకంగా జరిగేవి సినిమాలలో చూస్తే తప్పేముంది.

కేవలం రెండు వందల సంవత్సరముల క్రితమే ఉద్భవించిన అమెరికా దేశం ఎంతో పురోగమించింది. మానవుడు రాతియుగంలో నుండి రాకెట్టు యుగంలోకి పురోగమించాడు. ప్రపంచం చాలా చిన్నదైపోతోంది. అమాటకొస్తే ఈ విశ్వమే చిన్నదైపోతోంది. ఈ రోజులలో అమెరికావారు, ఫ్రెంచివారు, జపానువారు, హైందవులు అనే తారతమ్యమే లేదు. విజ్ఞానం, సంస్కారం, సంస్కృతి ఒకరి సొత్తుగాదు. మానవులంతా ఒకటే అనే పరిస్థితి వచ్చేసింది. ప్రగతిని సాధించిన అణుయుగ నిర్మాతలు అమెరికావారు, ఫ్రెంచివారు నగ్న దృశ్యాలతో సినిమాలు తీసి చూసి ఆనందిస్తున్నారు. ఇక్కడ అదే సినిమాలను అర్ధనగ్నంగా ప్రదర్శిస్తుంటే మనం చూసి ఆనందిస్తున్నాము. మనం మడిగట్టుకొని కూర్చున్న ప్రయోజనంలేదు. కాలంతోపాటు మనం మారాలి. మారతాం కూడాను. నిప్పుకోడి లాగ తలదూర్చితే ప్రపంచం మన కోసం ఆగదు. కాలగమనాన్ని, పురోగతిని ఎవ్వరూ ఆపలేరు.

సినిమా సెన్సారు బోర్డులో అనేకమంది స్త్రీలున్నారు. వారు కళ్ళు మూసుకుని కూర్చోలేదు. చక్కగా ప్రతి దృశ్యం కళ్ళారా చూసి మనకంటే ఎక్కువగా విమర్శనా దృష్టితో పరిశీలించి, హద్దుల లోపల నున్న దృశ్యాలను మాత్రమే అనుమతిస్తున్నారు. వారిలో విదుషీమణులు ఎంతో సభ్యత గలవారు మాత్రమే ఉంటారు. వారికన్ని విషయములు, క్షుణ్ణంగా కూలంకషంగా తెలుసు. వారేదో పొరపాటు చేశారని బాధ పడనవసరంలేదు. వారి విధి వారు సక్రమంగా నిర్వహిస్తున్నారు. ప్రేక్షకాభిప్రాయాని కనుగుణంగా ప్రదర్శిస్తున్నారు. ఏవిధమైన అసభ్యతను వారంగీకరించరు. ఇందులో స్త్రీలోకానికి తలవంపులు తెచ్చే ప్రసక్తేలేదు.

పూర్వం దేవాలయాలను అతి పవిత్ర స్థలాలుగా భావించేవారు. ప్రజలకు అవి సమావేశ మందిరాలుగా కూడా ఉండేవి. ఒకరి నొకరు అర్థం చేసుకోవటానికి, ఆకర్షించుకోవటానికి కళామంటపాలను ఏర్పాటు చేసేవారు. అలాంటి కళారూప దర్శనము బహుళ జనాభా అభివృద్ధికి తోడ్పడేది. ఇందు పరస్పరాకర్షణ ముఖ్యగమనాంశము. ఇప్పుడు దేవాలయాలకు వెళ్ళేవారు తక్కువ. సినిమాలకు వెళ్ళేవారు ఎక్కువ. సినిమా హాలులు ఆకర్షణ విషయంలో దేవాలయాలను మించిపోయినవి. సామాన్యంగా మంచి సినిమా అయితేనే వెడతారు. తమకున్నంతలో ముస్తాబై యితరులను ఆకర్షించేందుకు తయారై వెడతారు. తమకు తెలియని పద్ధతులు యింకేమైనా ఉన్నవేమోనని సినిమాలలో చూసి నేర్చుకుంటారు. ఇది మానవ సహజం. దేవాలయాల నుండి సినిమాలయాల వరకు యిది అనన్యాతముగా వస్తున్న మానవ సాంప్రదాయం.

మానవునికి కదిలే స్వభావం, పెరిగే స్వభావం ఉన్నది. కొన్ని విషయాలు ప్రకృతి నుంచి, కొన్ని విషయాలు పరిసరాల నుంచి నేర్చుకొని పురోగమిస్తూ, పరిణామం Evolution చెందుతూ, కోతియుగం దాటి రాతియుగం నుంచి రాకెట్టు యుగంలోకి వచ్చాడు మానవుడు. కళారాధనలో సినిమాలు, కళాశాలలు, అనాటి దేవాలయాలను మరపిస్తున్నాయనుటలో అతిశయోక్తిలేదు. ప్రఖ్యాత కళాకారుడు సినిమాలను దేవాలయాలతో పోల్చటం తప్పులేదు. సమాజం మారుతోంది.

—కె. నాగేశ్వరరావు, నెల్లూరు.



## హిందీనటి రాజశ్రీపై వారంట్

"ఓమ్ తారా" కలర్ చిత్రం నాయిక రాజశ్రీ, నిర్మాత గున్వంతలాయ్ ఎల్. నాయక్‌ను మోసగించిందట. రాజశ్రీ తాలూకు 5వేల రూపాయలను నిర్మాత నాయక్ ఆమె తల్లి జయశ్రీకి యిచ్చారట. చిత్రం యొక్క మొదటి షూటింగు రాజకమల్ స్టూడియోలో ఫిబ్రవరి 10,1966లో జరిగిందట. మార్చి నుండి నవంబరువరకు రాజశ్రీ కాల్‌షీట్లు యివ్వలేదట. 1967 మార్చికి నిర్మాత రాజశ్రీకి మొత్తం 75 వేలరూపాయలను ముట్టచెప్పాడట. 1966 డిసెంబరులో రెండు రోజులు; 1967 డిసెంబరులో మూడు రోజులు మినహా యేలాంటి షూటింగు తేదీలు రాజశ్రీ యివ్వలేదట. ఆపైన రాజశ్రీ ప్రమాదానికి గురి అయిందని వంకపెట్టిందట ఆమెతల్లి. ఆపైన బొంబాయిలో స్టూడియోల మూసివేత ఒకటి. స్టూడియోలు తెరువబడ్డాయి. మే 25 నుండి 29 వరకు రాజశ్రీ కాల్‌షీట్లు యిచ్చిందట, కానీ రాలేదట. ఆమె వివాహాన్ని రహస్యంగా చెయ్యనున్నట్లు నాయక్‌కు తెలిసిందట. పై విషయాన్ని ఫిలిం ప్రొడ్యూసర్స్ గిల్డుకు ఇండియన్ మోషన్ పిక్చర్ అసోసియేషన్‌కు తెలియజెయ్యగా వాళ్లు ఆమెకు ఒక పత్రాన్ని, టెలిగ్రామును జారీ చేసారట. వారికెలాంటి సమాధానం రాకపోవడంతో నిర్మాత రాజశ్రీ యింటికి వెళ్లాడట. కానీ అప్పటికే రాజశ్రీ ఫ్రాంక్‌ఫర్టుకు వెళ్ళిపోయిందని ఆమెతల్లి చెప్పిందట.

ఇప్పటికే మొత్తం 20 లక్షలు చిత్రంపై ఖర్చుపెట్టడం జరిగిందని చిత్రం పూర్తి కాకపోతే 50 లక్షలు వ్యయం చెయ్యాల్సి వస్తుందని నిర్మాత నాయక్ నటి రాజశ్రీపైన ఆమె తల్లి జయశ్రీపైన 'వంచన' అభియోగాన్ని బొంబాయి గిర్‌గాం కోర్టులో దాఖలు చేసారట. దాని ఆధారంగా ప్రెసిడెన్సీ మేజిస్ట్రేటు శ్రీ హెచ్. ఎస్. పుర్వేకర్ నటి రాజశ్రీకి, ఆమెతల్లి జయశ్రీకి సమన్సు జారీ చేసారట. రాజశ్రీ ఇంకా చాలమంది నిర్మాతల్ని మోసగించినట్లు వార్తలు వెలువడుతున్నాయి

# చిన్నారిపాపలు

చలనచిత్ర రంగంలో స్త్రీల ప్రాముఖ్యాన్ని కరతలామలకం చేసే చిత్రం శ్రీ మాతా ఫిలింస్‌వారి 'చిన్నారిపాపలు'.

ప్రముఖ నటి శ్రీమతి సావిత్రి దర్శకురాలిగా పరిచయమయ్యే ఈ స్త్రీ నిర్మాతల చిత్రంలో–స్త్రీలనేకాక, అందరినీ రంజింపజేయగల హంగులు చాలావున్నాయి.

బొమ్మలు వేసుకోవడం తప్పితే వేరే పని లేని మహేష్‌కి కొండజాతి బాలిక 'గిరిక'తో పరిచయమవుతుంది. ఆ పరిచయాన్ని అపార్థంచేసుకుని గిరిక అతన్ని పెళ్లాడేస్తుంది! ఈ విషయం తల్లితో చెప్పి, ఆమె అంగీకారంతో గిరికను తీసుకు వెళ్లడానికి వచ్చిన మహేష్ గిరిక వరదల్లో చచ్చిపోయిందని వింటాడు. ఇదంతా ఒక ఫ్లాష్‌బ్యాక్‌లో జరుగుతుంది పైగా అందులో మరొక ఫ్లాష్ బ్యాక్ మహేష్ పార్వతుల కథ అక్కడినుంచి మొదలవుతుంది. గిరిక బ్రతికే వుంటుంది ఆమెకొక కొడుకు, పార్వతికి ఒక కుమార్తె. ఈ యిద్దరు పిల్లలు ఒక చోట చేరినప్పటినుంచి 'చిన్నారిపాపలు' [illegible] కథ మొదలవుతుంది. ఈ పాపలు చాలా కథనడిపిస్తారు. గిరిక తనకోసం వెతుక్కుంటూ వచ్చిందనీ, ఆతర్వాత చచ్చిపోయిందనీ, తన దగ్గరున్నవాడు తన కొడుకేననీ – ఇన్ని నిజాలు మహేష్‌కి ఒక్కసారిగా తెలిసినప్పుడు కథ సుఖాంత మవుతుంది!



'చిన్నారిపాపలు'లో బేబీ రోజారమణి.

ఇందులో జగ్గయ్య, జమున, జానకి చిన్నారి పాపలకి ప్రాణంపోస్తే—బేబీ రోజారమణి, మరోపాప, సి. హెచ్. కృష్ణమూర్తి, దర్శకురాలు, యస్. వి. రంగారావు, రేలంగి, రమణారెడ్డి, పద్మనాభం, సూర్యకాంతం, శాంతకుమారి అదిగాగల మేటి తారలంతా చిత్రాన్ని సర్వాంగసుందరం చేశారు.

కోదండపాణి పర్యవేక్షణలో శ్రీమతి పి. లీల సంగీత సారథ్యం వహించారు. శ్రీమతి రాజసులోచన నృత్య దర్శకత్వం నెరపారు. కుమారి మోహన కథా దర్శకురాలు. కథా రచన శ్రీమతి వి. సరోజిని కథా రచయిత్రి, ముళ్ళపూడి వి రమణ (?) మాటలు కూర్చారు.

నటి శ్రీమతి సావిత్రి దర్శకత్వంలోని 'చిన్నారిపాపలు' మహిళాలోకానికి గర్వ కారణంగా నిలుస్తారు!

— [illegible]

# సి ని మా

జగ్గయ్య తిరగని ఆఫీసులేదు. దేనికో తెలుసా? ఉద్యోగానికి. ఎక్కడ చూసినా 'నో! వేకెన్సీ' బోర్డు కన్పడేది. ఒకరోజు ఉదయం ఒకపెద్ద బంగళాలోకి జగ్గయ్య వెళ్ళబోతుంటే బయట గూర్ఖా గెంటడానికి ప్రయత్నిస్తాడు. అవమానితుడై జగ్గయ్య తిరుగుముఖం పెట్టే సమయంలో ప్లిమత్‌కారు హారన్ మ్రోగుతుంది. జగ్గయ్య కళ్ళు విప్పి చూసాడు. అంతే కారులోవున్న వ్యక్తి అమాంతంగా దిగి



'చుట్టరికాలు'లో జగ్గయ్య, జయంతి.

కౌగిలించుకుని, జగ్గయ్య పరిస్థితులను గ్రహించి 'రారా పోదాం' అంటూ తన చక్కెర ఫ్యాక్టరీలోకి తీసికెళ్ళి, అతనికి అందులో వాటా యిస్తాడు.-పై సన్నివేశం శ్రీ దేవి కంబైన్స్ 'చుట్టరికాలు'లో మీరు చూడగలరు. పేకేటి దర్శకత్వం నెరపిన యీ చిత్రాన్ని శ్రీ తోట సుబ్బారావు నిర్మించారు. ఆంధ్రాలో జ్యోతి ఫిలింస్ జూన్ 22 న విడుదల చేసిన యీ చిత్రంలో జయంతి, శోభన్‌బాబు, లక్ష్మి, రమాప్రభ, రేలంగి, అల్లురామలింగయ్య, బాలకృష్ణ, రామచంద్రరావు ముఖ్యపాత్రలను ధరించారు.

ఆజానుబాహుడు, ఆదర్శవంతుడు, అచంచల దీక్షాబద్ధుడు, అనుభవజ్ఞుడయిన కె.ఎస్. ప్రకాశరావు యిప్పటివాడా?

**పరిచయం:**



### కళాదర్శకుడు రాజేంద్రకుమార్

ప్రముఖ దర్శకుడు శ్రీ గుత్తా రామినీడుచే "అనురాగం" చిత్రానికి కళాదర్శకుడిగా పరిచితుడయిన శ్రీ వి. వి. రాజేంద్రకుమార్‌కు బాల్యం నుండి చిత్రలేఖనంలో ఆసక్తి యెక్కువ.

పచ్చయప్పస్ కళాశాలలో బి. ఎ. డిగ్రీ పొందిన మరుక్షణమే మద్రాసు స్కూల్ ఆఫ్ ఆర్ట్స్‌లో చేరి తనకు దేవుడిచ్చిన వరాన్ని మరింత తేజోవంతం చేసుకున్నాడు. అంతర్జాతీయ ప్రశస్తినందుకున్న శ్రీ టి. వి. ఎస్. శర్మవద్ద సహాయకుడిగా ఎనిమిది చిత్రాలకు పనిచేసి కుర్రవాడు గట్టివాడు అనిపించుకున్నాడు. "అనురాగం" షూటింగు జరిగే సమయంలోనే సహవాసపురం అప్పారావు "శాంత" చిత్రం యొక్క కళాదర్శకత్వ బాధ్యతను కుమార్‌కప్పగించారు. ఆపైన డి.రామానాయుడు తను నిర్మించే ప్రతి చిత్రానికీ రాజేంద్రకుమార్‌నే కళాదర్శకుడిగా నియమించుకుంటూ, అతన్ని అన్నివిధాలా ప్రోత్సహిస్తున్నాడు.

దర్శకుడిచ్చిన అభిప్రాయాలకనుగుణ్యంగా స్కెచ్‌లను తయారుచేసుకుని, తక్కువ ఖర్చుతో చక్కటి కళాజ్యోతిని ప్రతిబింబింపచేసే సెట్లను నిర్మించి యిచ్చి, ప్రతిభావంతుడు అనిపించుకుంటున్నాడు.

మంచితనంతో పదిమందికి కావలసినవాడై, తానుకూడ పదిమందికీ వుపయోగపడుతూ కర్తవ్యనిర్వహణలో క్రమశిక్షణను పాటిస్తూ చక్కటి కళాదర్శకుడిగా మాత్రమే గాక, విలక్షణమైన పబ్లిసిటీ నిర్వాహకుడిగా కూడా పేరందుకుంటున్న రాజేంద్రకుమార్ వివాహితుడు. ముప్పైలో పడిన యితనికి మున్ముందు మంచి మంచి అవకాశాలొచ్చి గొప్పవాడ్ని చెయ్యగలవని విశ్వసిస్తున్నాం.

## సినివార్త

'కన్నతల్లి' వద్దనుండి 'స్త్రీ జన్మ' వరకు దర్శకత్వంలో సరిక్రొత్త పద్ధతులను ఆయాకాలం, మనః పరిస్థితులనుబట్టి ప్రవేశపెడుతూ ప్రేక్షకుల అభిమానాన్ని రెండు దశాబ్దాలుగా చూరగొంటున్నాడు. ఈ మధ్య మాధవి పిక్చర్స్ ఔట్‌డోర్ దృశ్యాల చిత్రీకరణ సందర్భంలో ఒక విపత్కరమయిన విచిత్ర సంఘటన జరిగింది.

అది హరిప్రశమం పరిసరాల్లో ప్రకృతి రామణీయకంగా ప్రవహించే జలపాతం. మాధవి పిక్చర్స్ యూనిట్ యావన్మంది యీ ఒడ్డునుండి ఆవలి ఒడ్డుకు చేరడానికని తాత్కాలికమయిన వెదురుగడల వంతెన తయారుచేశారు. చిత్రంలోని సాంకేతిక వర్గం, నటీ నటులందరూ ఆవలిగట్టు చేరుకున్నారు. ఇక దర్శకుడు కె. ఎస్. ప్రకాశరావు నిర్మాతల్లో ఒకరయిన జె. సుబ్బారావు ఆవలివైపుకు చేరవలసి వుంది. ఇద్దరూ నెమ్మదిగా అడుగులో అడుగు వేసుకుని బ్రిడ్జిని దాటడానికి ప్రారంభించి సగందూరం చేరుకున్నారు. అంతే కాలు జారింది. ఇద్దరూ ఆ భయంకర జలపాతంలోకి దొర్లిపోయారు. అందరూ భయ, విభ్రాంతులయ్యారు. మన ప్రకాశరావు, సుబ్బారావు లేమయ్యారు అని ఒకరి మొఖాలొకరు చూసుకోసాగారు. ప్రకాశరావు పూర్వజన్మ సుకృతంవల్ల ఆ అగాధంలో నుండి ప్రాణాలతో బయటపడ్డారు. ఇదే మరొకరయితే యింకేముంది—ఆ గంగామతల్లికి ఆహుతులయ్యేవారు. మొత్తానికి మన పరిశ్రమ, మనం అదృష్టవంతులం అందుకే ఒక గొప్ప దర్శకుని దక్కించుకున్నాం. ప్రకాశరావు నూరేళ్లు చల్లగా వర్ధిల్లాలని మనందరం కోరుకుంటాం.

### ఊటీలో ఉక్కపోత

మాధవి పిక్చర్స్ నిర్మాత శ్రీ ఎ. ఎస్. ఆర్. ఆంజనేయులు ఊటీలో వుండినప్పుడు విపరీతంగా చెమట పట్టేది. ఊటీలోని చలిని భరించలేరు. అందుకని కంబళి దుప్పట్లను కూడ తీసికెళ్ళారు మామూలుగా. మరి ఆంజనేయులుగార్కి చెమట పట్టడం విడ్డూరంగా లేదూ! ఈ యూనిట్‌కు సూర్యభగవానుడు కూడ అనుకూలించాడు. అందుకే వారం రోజులు వేసుకున్న షెడ్యూలు మూడు రోజుల్లో పూర్తయింది. ఇక అక్కడ వుండబట్టలేక నిర్మాత ఆంజనేయులు, దర్శకులు ప్రకాశరావు, ఛాయాగ్రాహకుడు వెంకటరత్నం ఊటీనుండి కోయంబత్తూరుకు వెళ్ళి, అక్కడి నుండి కారులో మద్రాసు చేరుకున్నారు. కొన్ని విమానపు టిక్కెట్లు వృధా అయ్యాయి. ఈ షెడ్యూలులో నాగేశ్వరరావు, జమున, కాంచనలకు సంబంధించిన పాటల చిత్రీకరణ జరిగింది. ఊటీనుండివచ్చి రెండురోజులు విశ్రాంతి తీసుకుని వెనువెంటనే సారధి స్టూడియోలో పదిరోజుల షూటింగును పూర్తిచేసుకుని జూన్ 17 కు మద్రాసు చేరుకున్నారు.



'గుణదాసు'లో విజయలలిత.

### 'ఆ' మీద అభిరుచి

జూన్ 17 వరకు మాధవి పిక్చర్స్ షూటింగులో పాల్గొన్న నాగేశ్వరరావు 19 వ తేదీనుండి జగపతిపిక్చర్స్ మొదటి షెడ్యూలులో పాల్గొన్నారు. చక్కటి

చిత్రాలను నిర్మిస్తూ ప్రేక్షకుల ప్రభుత్వాల ప్రశంసలు అందుకుంటూ, ఉత్తమ నిర్మాతగా వినుతికెక్కిన శ్రీ వి. రాజేంద్ర ప్రసాద్ ప్రస్తుతం నిర్మిస్తున్న చిత్రానికి 'అదృష్టవంతులు' అని పేరు పెట్టి తమ 'అ' పై అభిరుచిని మరోసారి నిరూపించుకున్నారు. గతంలోని 'అ' చిత్రాల వలె ఇదీ 'అ' కూడ విజయవంతంగా ప్రదర్శింప బడగలదని ఆశించవచ్చు. బాక్సాఫీస్ దర్శకుడు శ్రీ వి. మధుసూదన



'బంగారు సంకెళ్లు'లో జి. వరలక్ష్మి.

రావు దర్శకత్వం నిర్వహించే యీ చిత్రంలో నాగేశ్వరరావు, జయలలిత, జగ్గయ్య, గుమ్మడి, ప్రభాకరరెడ్డి, విజయలలిత, పద్మనాభం, గీతాంజలి ముఖ్యపాత్రలను ధరిస్తున్నారు.

* * *

శ్రీ సారథీ స్టూడియోలో క్రొత్తగా నిర్మించబడ్డ విశాలమైన నాల్గవ ఫ్లోర్‌లో జగపతి షూటింగు ప్రారంభమైంది అంతే [illegible] మూడు[illegible]

షూటింగును ప్రారంభించవచ్చు నన్నమాట. నవయుగా అధ్వర్యంలో సారథి స్టుడియో దిన, దిన ప్రవర్ధమాన మవుతూ చిత్ర నిర్మాతలకు వలసిన సదుపాయ సౌకర్యాలను అందిస్తూ, అవసరమయిన మార్పులను పొందుతూ వుండేందుకు శ్రీ శ్రీనివాస రావు తీసుకునే శ్రద్ధాసక్తులే కారణం అంటే అతిశయోక్తి లేదు

*  *  *

ఇన్నట్లు మీరు విన్నారా శ్రీనివాసరావు నిర్మాతగా మారిన విషయాన్ని! ఉత్తమ కంపెనీ సంస్థగా పేరందిన నవయుగాలో శ్రీనివాసరావు భాగస్వాములు. శ్రీ నాగేశ్వర రావు హైదరాబాదుకు తరలివెళ్లినతర్వాత సారథి స్టుడియోను శ్రీనివాసరావు తమ

# సినిమా

అజమాయిషీలోకి తెచ్చుకున్నారు. ఇప్పుడు శ్రీ దుక్కిపాటి మధుసూదనరావు అధ్వర్యంలో తమ స్టుడియోలోనే ఒక చక్కటి సాంఘికచిత్ర నిర్మాణానికి వుపక్రమించారు 'మంచికుటుంబం' పేంవి. మధుసూదన రావు దర్శకత్వంలో, నాగేశ్వరరావు నాయకుడిగా, రాజేశ్వరరావు సంగీత సారథిగా ఆగస్టు ఫస్టుకు సారథి స్టుడియో పిక్చర్ షూటింగు ప్రారంభం కానున్నది.

*  *  *

సారథి స్టుడియోలో షూటింగుజరుపు కుంటున్న రవీంద్రా ఆర్ట్సు 'బంగారు గాజులు' చిత్రం యొక్క ఆఖరిసీను

# మీకు తెలుసా?

ప్రముఖ కెమెరామెన్ వి ఎస్ ఆర్ స్వామికి ఇంగ్లీషు పిక్చర్లను పదే పదే చూడడం సరదా.

ప్రముఖ దర్శక, నిర్మాత శ్రీ బి. విఠలాచార్యకు తమాషాగా జోక్స్ విన రడం అలవాటు

హాస్యనటుడు రాజబాబుకు అంత ర్జాతీయ హాస్యనటుడు కావాలనే కోరిక వుంది.

హీరో శోభన్ కు పెయింటింగ్ అంటే చాలా ఇష్టం.

కథానాయిక వాణిశ్రీకి తీరిక దొరికి నప్పుడల్లా బొమ్మలు గీయడం అల వాటు.

ప్రముఖ నిర్మాత డూండేశ్వరరావు తాము నిర్మించే చిత్రంయొక్క ప్రతి సెట్టుకు హాజరవుతూ. తామే దగ్గ రుండి పనిచేయడం సరదా.

క్యారెక్టరు నటుడు ధూళిపాలకు హరికథా కాలక్షేపం వినడం ఒకసరదా.

క్యారెక్టరు నటులు శ్రీ గుమ్మడికి సంగీత, సాహిత్యాల్లో విశేషమయిన ప్రజ్ఞా, ప్రాభవాలున్నాయి

# సినిమా డైరీ

● సుజాతా ఫిలింస్ నిర్మిస్తున్న చిత్రానికి "నేనంటే నేనే" అని పేరుపెటారు కాంచన, కృష్ణ నాయకీనాయకులుగా నటించే యీ చిత్రాన్ని వి రామచంద్రరావు డైరెక్టు చేసారు

● బెర్లిన్‌లో జరుగనున్న పదునెనిమిదవ చిత్రోత్సవానికి జపాన్‌దేశం మూడు చిత్రాలను ఎంట్రీగా పంపింది

● మురుగన్ ఫిలింస్ "జీవితబంధం" సెన్సారయింది ఎం ఎస్. గోపీనాథ్ దర్శకత్వంలో కాంతారావు, కృష్ణకుమారి, రాజసులోచన, రామకృష్ణ, రాజనాల, శోభన్‌బాబు (అతిథి) ముఖ్యపాత్రలను ధరించారు

● వాసూమీనన్ హిందీలో నిర్మిస్తున్న చిత్రానికి "వారీస్" అని పేరుపెటారు. ఈచిత్రాన్ని టి ఆర్ రామన్న డైరెక్టు చేస్తే, ఎం ఏ రహమాన్ కెమెరాను నిర్వహిస్తున్నారు

● శ్రీధర్ నిర్మిస్తున్న ఈసు మన్‌కలర్ చిత్రానికి "సివందమన్" అనిపేరు పెటారు కాంచన శివాజీగనేశన్ నాయకీనాయకులు

● లిటిల్‌సెజి వద్దనుండి "పాల్‌కుడం" చిత్రనిర్మాణపు హక్కులను విజయ, సురేష్‌కంబైన్స్ కొన్నారు

● ఈ వి ఆర్ పిక్చర్స్ నిర్మిస్తున్న కలర్‌చిత్రంలో శివాజీగనేశన్‌తో తొలిసారిగా నటించే అవకాశం భారతికి లభించింది టి ఆర్ రామన్న డైరెక్టు చేస్తున్నారు

● ప్రఖ్యాత సంగీత దర్శకుడు సలీల్‌చౌదరి కన్‌మణి ఫిలింస్ "ఏడురాత్రులు" చిత్రానికిగాను పి బి శ్రీనివాస్, ఏసుదాస్, పి లీల పాడిన మూడు పాటలను భరణి థియేటర్లో రికార్డుచేసారు

● తాష్కెంట్‌లో అక్టోబరు 21వ మొదటి అంతర్జాతీయ ఆఫ్రో—ఆసియన్ చలనచిత్రోత్సవం జరుగనున్నది

● "ఆఖిఖత్" అనే హిందీచిత్రానికి హిమాచల్ ప్రదేశ్ ప్రభుత్వం వినోదపు పన్నును మినహాయించింది

● జకోస్లవేకియా—ఇండియా దేశాలమధ్య జూన్‌మాసంలో సాంస్కృతిక ఒప్పందం ప్రేగ్‌లో జరుగనున్నది

● మాతాఫిలింస్ "చిన్నారి పాపలు" జూన్ 21న ఆంధ్రాలో విడుదలయింది

● విజయభట్‌మూవీస్‌కు శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి అన్ని పాటలను వ్రాసియివ్వడానికి అంగీకరించారు

● అన్నపూర్ణా ఎంటర్‌ప్రయిజస్ నిర్మిస్తున్న "విషవలయం" ఆదిలాబాద్, కర్నూలుజిల్లాల్లోని అరణ్యాల్లో అధికభాగం నిర్మించబడింది

● నటి జయంతి యీమధ్య నిత్యం రాత్రింబగళ్లు షూటింగుల్లో పాల్గొనడంలో హడావుడి అధికమై అతిముఖ్యమైన విషయాన్నికూడ విస్మరిస్తుంది ఈమధ్య ఒక కన్నడ చిత్రం అవుట్‌డోర్‌కి మైసూరు వెళ్లింది తీరా వెళ్లిన తర్వాత చూస్తే కాస్ట్యూము మద్రాసులోనే మరచినట్లు తేలి హడావుడిగా మద్రాసుకు ట్రంక్‌కాల్ చేసింది అబ్బాయి సూట్‌కేసు తీసుకుని మైసూరు వెళ్లివాటిని అందించడం జరిగేసరికి ఒకరోజు పటింది అందువల్ల షూటింగు ఒక ఆలస్యమయింది జయంతి నిర్విరామంగా పనిచేసి ఒకేరోజులో రెండుదినాల పనిని పూర్తిచేసింది

మద్రాసులోని ప్రసాద్ స్టుడియో ఆవరణలోను, శ్రీమతి అంజలిదేవి బంగళాలోను జూన్ 19వ దర్శకులు శ్రీ సి. ఎస్. రావ్‌చే చిత్రీకరించబడింది మా థవి షూటింగులో పాల్గొన్న నాగేశ్వరరావు జూన్ 18న విమానంలో మద్రాసుచేరారు. జూన్ 19 ఉదయం 7 గంటలకు మేకప్‌లో షూటింగుకు సిద్ధమయ్యారు. ప్రసాద్ స్టుడియో ఆవరణలో ఉదయం 11 గంటల వరకు జరిగిన షూటింగులో నాగేశ్వరరావు, విజయనిర్మల పాల్గొన్నారు. 19 రాత్రి 10 గంటలనుండి 20వ తేది తెల్లవారు ఝామువరకు జరిగిన షూటింగులో శ్రీయుతులు నాగేశ్వరరావు, కాంతారావు, పద్మనాభం, విజయనిర్మల పాల్గొన్నారు ఇంతటితో షూటింగు కార్యక్రమం పూర్తయినట్లు, జూలైలో చలపతిరావుచే రీ-రికార్డింగ్ చేయించి, ఆగస్టుకు విడుదలచెయ్యనున్నట్లు నిర్మాత తమ్మారెడ్డి కృష్ణమూర్తి వెల్లడించారు.

—శ్రీనివాస్ ●

తిప్పుకోకుండా శివకేశవుల నిర్ధారణా జబాయించాడు

దానికి విష్ణుమూర్తి తెల్లబోయి పరమేశ్వరుని వైపు చూశాడు అప్పుడు పరమేశ్వరుడు భారత పౌరునితో యిలాగ అన్నాడు

'భారతపౌరా! నువ్వు చెప్పింది నిజమే నువ్వు కైలాసానికి వచ్చి మాతో మాట్లాడినందువలన నీకు చాలా పుణ్యం వచ్చింది కాని నువ్వు యిదివరకు చేసిన పాపానికి ఫలితం కొంచెమైనా అనుభవించాలి గదా! అందుకు కొద్దికాలం మాత్రం నువ్వు ఓపికపట్టు కొద్ది కాలంలోనే భారతదేశపు సరిహద్దుల్నీ, భారతజాతి గౌరవాన్ని కాపాడగల బలిష్ఠమైన జాతీయ ప్రభుత్వం యేర్పడుతుంది అప్పుడు నీకు సుఖశాంతులు లభిస్తాయి'

ఈ విధంగా పరమేశ్వరుడు భారత పౌరునికి వరం యిచ్చి భృంగికి సంజ్ఞ చేశాడు. వెంటనే భృంగీశ్వరుడు భారత పౌరుణ్ణీ, వర్తకుణ్ణి, ఉద్యోగినీ, మంత్రినీ శాసన సభ్యుణ్ణీ కూడా భూలోకానికి పంపివేశాడు.

అప్పుడు పరమేశ్వరుడు నారదుణ్ణి చూసి యిలాగ అన్నాడు:

'నారదా! నువ్వు అనవసరంగా భారత పౌరుని చేత ఫిర్యాదు చేయించావు కాబట్టి దీనికి శిక్షగా నువ్వు యిక్కడ జరిగిన వ్యవహారాన్నంతా భారతీయులకు చెప్పాలి'

'పరమేశ్వరా! నన్ను కరుణించు తెలియక ఏదో పొరపాటును చేశాను దానికి యింత కఠిన శిక్షను విధించడం న్యాయం కాదు ఇన్ని కోట్లమంది ఉన్న భారతీయులందరికీ నేను యీ విషయాన్ని చెప్పడం ప్రారంభిస్తే నా పనులెలాగ జరుగుతుంది? అందుచేత నన్ను క్షమించి యీ శిక్షను తప్పించవలసినదిగా కోరుతున్నా'నని నారదుడు పరమేశ్వరుని ప్రార్థించాడు.

దానికి పరమేశ్వరుడు కనికరించి, నారదునితో యిలాగ అన్నాడు.

'నారదా! అయితే యీ విషయం నువ్వు అందరితోను చెప్పనవసరం లేదు కాని అనకాపల్లి యేటి గట్టున కూర్చొని బాతాఖాని కొట్టే ముగ్గురు మూర్ఖులతో మాత్రం చెప్పాలి దీని ప్రచారం సంగతిని వాళ్ళే చూసుకొంటారు' -

'ఈ విధంగా పరమేశ్వరుడు ఆదేశించడం వలన మీ దగ్గరకు వచ్చాను' అని నారదుడు ముగ్గురు మూర్ఖులతో చెప్పాడు

'మహర్షి! మీరు ఒక షరతుకు అంగీకరించినట్లయితే యీ వ్యవహారానికి తగినంత ప్రచారం చేయడానికి మాకు అభ్యంతరం లేదు' అన్నాడు చిదంబరం.

## ముగ్గురు మూర్ఖులు

(15 వ పేజీ తరువాయి)

'ఏమిటా షరతు? నాయనా!'

'ఏమీలేదు ఈ ఒక్క విషయమే కాదు ఇకముందు జరగబోయే విషయాల్ని కూడా, మేము మిమ్మల్ని స్మరించగానే మా దగ్గరకు వచ్చి చెబుతుంటామని మీరు వాగ్దానం చేయాలి' అని చిదంబరం తన షరతును వెల్లడించాడు.

'సరే! తప్పుతుందా? నాయనా!' అని అంటూనే నారదమహర్షి అదృశ్యుడై పోయాడు.

ఇప్పటికే చాలా రాత్రి అయిందంటూ చూడామణి లేవగానే మిగిలిన యిద్దరు మూర్ఖులూ అతన్ని అనుసరించారు

(అయిపోయింది)

ఆటలు

# రాజకీయవేత్త క్రీడాభిమాని డాక్టర్ సుబ్బరాయన్



అక్టోబరు 6, 1962లో రాజకీయాలలోనూ, క్రీడారంగంలోనూ కూడా మంచి పేరు సంపాదించుకున్న ఒక గొప్ప వ్యక్తి పరమపదించారు బొంబాయి గవర్నరుగా ఉంటున్న డా సుబ్బరాయన్ ఆనాడు మదరాసులో ఈ జీవితం చాలించారు. స్వతంత్రం రాకముందు ఆయన ముఖ్యమంత్రి పదవిని అలంకరించారు, 1947 ఆగస్టు తర్వాత కేంద్ర మంత్రివర్గంలో కొంతకాలం ఉన్నారు; ఇండోనేసియాలో రాయబారిగా ఉన్నారు

అయితే ఈయన రాజకీయవేత్తగా ఎంత కీర్తి సంపాదించుకున్నారో క్రీడాభిమాని, పోషకులుగాకూడా అంత పేరూ సంపాదించుకున్నారు సెంట్రల్ బోర్డ్ ఆఫ్ క్రికెట్ అధ్యక్షుడుగా, మదరాసు క్రికెట్ ఎసోసియేషన్ అధిపతిగా లోక విదితులయ్యారు. అంతే కాదు, ఆయన ఇంగ్లాండులోని ఎమ్. సి. సి లో కూడా సభ్యులుగా ఉండేవారు 'విస్డెన్' అనే 'క్రీడా సర్వస్వం'లో ఆయన పేరు ఉంది పుస్తకాల సంగతి ఎత్తితే చప్పుడు ఆయన గ్రంథాలయం గురించి చెప్పాలి! క్రికెట్‌కి సంబంధించిన పుస్తకం ఒకటి కూడా వదలకుండా సంపాదించేవాడేమో ఆయన! అందుకనే ఇటీవల జూన్ 16 వ తేదీన శ్రీ ఎం ఎ చిదంబరం దానిని క్రికెట్ అభిమానులకి అందుబాటులో ఉండేట్లు చేశారు. ఈ సందర్భంలో శ్రీ చిదంబరం కీ శే సుబ్బరాయన్ మాత్రమేకాక ఆయన వంశం అంతా క్రీడాసేవ చేస్తూ ఉందన్నారు. భారత సేనాని, జనరల్ కుమారమంగళం సుబ్బరాయన్ మొదటి కుమారుడు

జీవించి ఉన్నప్పుడేకాక, మరణానంతరం కూడా డాక్టరు సుబ్బరాయన్ క్రీడారంగానికి ఎంతోసేవ చేస్తున్నారు!

— కె ఎస్. నరసింహన్

ఈ ఏడు వింబుల్డన్‌లో 'వృత్తి' క్రీడాకారులని కూడా ఆడనిస్తున్నారు సాధారణంగా వారి ఆటస్థాయి ఎక్కువ ఉంటుందంటారు. ఇది నిజమేనా ? అయినా, అసలు వీరు ఆటల్లో సరసంగా ప్రవర్తిస్తారా ? ఈ ప్రశ్నలన్నిటికీ వింబుల్డన్ మాచ్‌లే సమాధానాలు ఇవ్వగలవు ! (కె)

* * *

'భారత దేశంలో క్రీడారంగంలో సపరిపాలన ఉంటే చాలా తక్కువ మంది 'మాన్‌జర్లు', 'అడని కాప్టెన్‌లు' ఉంటారు.

—టయిమ్స్ ఆఫ్ ఇండియాలో ఎ ఎఫ్. ఎస్. టి

శ్రీ మాతా పిక్చర్స్ (ప్రై) లిమిటెడ్

# చిన్నారి పాపలు

స్క్రీన్‌ప్లే-డైరెక్షన్: సావిత్రి    కథ-నిర్వహణ: వి. సరోజిని

మాటలు: రమణ, సరోజిని    సంగీతం: పి. లీల. (సూపర్విజన్) కోదండపాణి

ఫొటోగ్రఫి: శేఖర్-సింగ్    ఎడిటింగ్: మూర్తి. M.S.N    ఆర్టు: మోహన

నృత్యం: రాజసులోచన




ఆంధ్ర-సీడెడ్: విజయా కంబైన్స్ * నైజాం: విజయా డిస్ట్రిబ్యూటర్స్ * మైసూరు: విజయానంద్

Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6 & 7, Thambu Chetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.



సారిడన్ యొక్క సహాయము మీకు అవసరమయ్యే దినాలు

# అందరు స్త్రీలకి తెలుసు... కొన్ని సమయాల్లో కేవలం నివారణ మాత్రమే సరిపోదు

ఒక్కొక్కప్పుడు సారిడన్‌తో సేదదేర్చుకొనే ఆవశ్యకత స్త్రీలకు వుంటుంది. మీకు ఎక్కువ మాంద్యము, నిరుత్సాహము లేక బాధ వున్న యెడల ఒకే ఒక సారిడన్ భారాన్ని తగ్గించి, ఉత్సాహాన్నిస్తుంది. సారిడన్ నొప్పిని, దానివలన కలిగే శ్రమను పోగొట్టును. దానిని వేసుకోగానే మీలో ఎంత మార్పు వస్తుంది! మీరు శక్తితో ఉత్సాహపూరితులై వుంటారు, సరిగ్గా ఆలోచించగలుగుతారు, స్నేహితులతో సరదాగా వుండగలుగుతారు! సారిడన్ యిచ్చే నివారణ సత్వరమైనది, స్థిరమైనది. తలనొప్పి, పంటి నొప్పి మరియు ఒంటినొప్పికి కూడ ఎల్లప్పుడు సారిడన్‌ను మీ దగ్గర వుంచుకోండి. ఒకే ఒక సారిడన్ నొప్పిని పోగొట్టును, సేద దేర్చును, నవోత్సాహమును కలిగించును.

'రోష్' తయారు

ఏకైక డిస్ట్రిబ్యూటర్లు: వాల్టాస్ లిమిటెడ్

Regd No. 4479 ANDHRA SACHITRA VARA PATRIKA



సంగీతం: చలపతిరావు  మాటలు: రావికొండలరావు



పాటలు: దాశరథి, నారాయణరెడ్డి    ఛాయ: ఎం.కె.రాజు

జనరంజని ఫిలింస్ వారి

# చల్లని నీడ

నిర్మాణం: డా. కె.వి. సుబ్బయ్య - చలపతిరావు

దర్శకత్వం: తాతినేని రామారావు